# సప్తసింధు

డా॥ జి. వి. పూర్ణచంద్

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ నెం. 1

ప్రథమ ముద్రణ :
జూన్, 1991

ముఖ చిత్రం :
"నాని"

వెల : రు. 20/-

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-2.

ప్రతులకు :
విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, విశాఖపట్నం, హైదరాబాద్, అనంతపురం,
గుంటూరు, తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

*

కృష్ణాజిల్లా రచయితల సంఘం
C/o సుశ్రుత క్లినిక్
విద్యాధరపురం, విజయవాడ—520 012.

# ఇదీ మా దారి....

రచయిత, పాఠకుడు, ప్రచురణకర్త-సాహితీరంగంలో ఈ ముగ్గురికీ అవినాభావ సంబంధంవుంది-

ఉత్తమ సాహిత్యం వెలుగు చూసి పది మందిలో ఒకరినైనా ప్రభావితం చేయాలంటే పుస్తక ప్రచురణ తప్పనిసరి!

సాహితీవేత్తలూ - పుస్తక ప్రియులతో కూడిన సాహిత్య సంస్థ ఉత్తమ సాహిత్య సృష్టిని ప్రోత్సహించడం ఒక ఎత్తు-స్వయంగా సాహిత్య ప్రచురణకు పూనుకోవడం ఇంకొక ఎత్తు... కష్టసాధ్యమైనా, సాహితీ సంస్థలకు పుస్తక ప్రచురణ ఒక నైతిక బాధ్యత-

కృష్ణాజిల్లా రచయితల సంఘం తెలుగునాట 'పనిచేస్తున్న' సాహితీ సంస్థలలో ఒకటి- తన దైన ప్రత్యేకతతో ఇప్పటికి అనేక సాహితీ సమావేశాలు-మహాసభలునిర్వహించి, ఉత్తమ సాహిత్యపు విలువలను ప్రోదిచేయడంలో తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చింది.

అధ్యక్షులు శ్రీ ముక్కామల నాగభూషణంగారి పూనికతో పుస్తక ప్రచురణ రంగాన తన దృష్టిని సారించి ముందుకు సాగుతోంది.

మొదటి ప్రచురణగా ఈ 'సప్తసింధు' నవలను సాహితీ లోకానికి సవినయంగా సమర్పిస్తున్నాం.

వెనువెంటనే మరో మూడు పుస్తకాలను వెలువరించే ప్రయత్నం చేస్తున్నాం. మేం చేపట్టిన కార్యక్రమాలకు మీ సహకారమే పట్టుకొమ్మ.

డా॥ జి.వి. పూర్ణచంద్ పాఠకులకు చిరపరిచితుడే. కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ముఖ్యులైన కార్యకర్తలలో ఒకడు. అంతే కాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి ఎన్నికైన సభ్యుడు. తెలుగు సాహితీ సంస్థల కార్యకర్తల సమావేశకర్త. ప్రధాన కార్యదర్శి కూడా. కేవలం కార్యకర్తృత్వమే కాక, కవితా పటిమ కూడా ఉన్న మంచి రచయిత.

ఈ "సప్తసింధు" తెలుగు పాఠకులను అలరిస్తుందని ఆశిస్తూ...

**గుత్తికొండ సుబ్బారావు,**

ప్రధాన కార్యదర్శి.



# అంకితం

శ్రీ ముక్కామల
నాగభూషణం గారికి

వేద శాస్త్రమ్ముల పాదెఱింగిన వాడు
విజ్ఞాన సాగర వీచి యతడు
సామ్యవాదములోని సౌరెఱింగినవాడు
గాంధేయవాద ప్రకాశ మతడు
స్వాతంత్ర్య సమరాన శక్తి చూపినవాడు
నిర్మాణ శాస్త్రాన నిపుణుడతడు
బహు ప్రజాహిత కార్యభారమూనినవాడు
నీతికల్గిన రైతునేత యతడు

ముసలి మేని పడుచు ముక్కామలాన్వయి
నాగభూషణమ్ము త్యాగమూర్తి
ప్రగతి వాది వారి ప్రజ్ఞకు కానుకగా
సాగె నంకితముగ 'సప్తసింధు'

—డా॥ జి. వి. పూర్ణచంద్

# ....సవినయంగా!

తెగల మధ్య అనాదిగా జరిగిన సంఘర్షణ సంలీనాలే మానవజాతి చరిత్రను నిర్మించాయి.

మన చరిత్రకారులు సంఘర్షణల్ని వీరోచితంగా వర్ణించారు. కానీ, జాతుల సంలీనం వలన వివిధ తెగల స్థాయిలో జీవిస్తున్న ప్రజలు పునర్వికాసాన్ని పొందిన వాస్తవాన్ని అంతగా పట్టించుకోలేదు.

మేటుకూరి బలరామమూర్తిగారు ఒక సందర్భంలో అన్నట్లు— ప్రాచీన చరిత్రలో సంఘర్షణ ఒక అంశమే గాని అదే ఏకైక సత్యం కాదు— !!

అనంతంగా సాగిన చరిత్రలో సంఘర్షణలు జరిగినప్పుడల్లా జాతుల సంలీనాలు జరిగాయి, సంఘర్షణలు లేనప్పుడూ సంలీనాలు జరిగాయి.

సంఘర్షణల వలన కింది వాళ్ళం పైకీ, పై వాళ్ళం కిందికీ మారి పోయాం. సంలీనం వలన మనమంతా సంకరమై పోయాం.

ప్రపంచంలో ఏజాతీ, ఏకులమూ స్వచ్ఛమైనవిగా మిగిలిలేవు!

ఈ వాస్తవాన్ని గుర్తించగలిగితే కులమతాల దురహంకారాన్ని ఎదుర్కోగల్గుతాం !!

సప్తసింధు నదులను ఈ చారిత్రక సత్యాన్ని చాటడానికే వ్రాశాను.

కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యకర్తలుగా గత సంవత్సరం మేం నిర్వహించిన "మానవతా విలువల సదస్సు" విజయవంతమైనాక ఒకరోజు మా అధ్యక్షులు శ్రీ ముక్కామల నాగభూషణంగారు తాను వ్రాస్తున్న "అసుర నాగరకత" చారిత్రక పరిశోధక గ్రంథంలోంచి కొన్ని భాగాల్ని మాకు చదివి వినిపించారు.

ప్రాచీన భారతీయ చారిత్రక విజ్ఞానం పైన ఆయన చేసిన కృషికీ, అపారమైన ఆయన మేధాశక్తికీ ఒకింత ఆశ్చర్యపోయాం!

ఆ నేపథ్యంలోనే, ఈ సప్తసింధు నవలను ఆయనకు చూపించడం జరిగింది.

ఆయన దీక్షగా చదివారు. చారిత్రకమైన వక్రీకరణలూ, అవాస్తవాలూ ఉండకూడదంటూ అక్షరం అక్షరం గాలించారు. మళ్ళీ మళ్ళీ నా చేత ఎత్తిరాయించారు.

దీని ప్రచురణ వెంటనే జరగాలనీ, కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షానే ప్రచురిద్దామనీ అన్నారు.

అలా దాదాపు ఏడేళ్ళతర్వాత వెలుగు చూస్తోంది ఈ నవల.

ఎనభై ఏళ్ళ ప్రాయంలో కూడా నవయువకునిలా ఇంకా పరిశోధిస్తూనే ఉన్న ఆయనలోని జిజ్ఞాసను గౌరవిస్తూ, ఈ "సప్తసింధు" ను శ్రీ నాగభూషణంగారికి సవినయంగా సమర్పిస్తున్నాను.

వేదాలనీ, వేదకాలాన్నీ హేతు బద్ధమైన శాస్త్ర దృష్టితో విశ్లేషించిన అనేక గ్రంథాలను ఇందుకోసం సంప్రదించాను. ఆయా పరిశోధకులకు నా నమస్కృతులు.

హింస, అశ్లీలాలే సాహిత్య సామగ్రిగా చెలామణి అవుతున్న నేటి భావ దారిద్ర్య కాలంలో, వేదకాలం నాటి ఇతి వృత్తాన్ని ఎంచుకున్న సాహసానికి మెచ్చుకుంటూ, వెన్నుతట్టి ప్రోత్సహించిన పెద్దలున్నారు. వారికి నా నమోవాకాలు—

చెయ్యి తిరిగేలా, చెవి మెలిపెట్టి మరీ రాయించిన కళాప్రపూర్ణ అత్త గారికీ, రాత్రిందివళ్ళా నాతో కూర్చుని, ఈ నవలని ఆసాంతం చదివి, వితర్కించి, విమర్శించి, ప్రోత్సహించిన ఆవంత్స సోమసుందర్ గారికీ, "రాయండి! మీలాంటి యువకుల కలాల్లోంచి ఇలాంటి రచనలు రావడం అవసరం" అని అభినందించిన పోటుకూరి బలరామమూర్తిగారికీ నా కృతజ్ఞతాభి వందనాలు!

ఈ నవలా రచన ప్రారంభించినప్పటి నుంచీ, అచ్చయ్యే వరకూ అనుక్షణం - తన అనుభవాన్నంతా నాకు ధారపోసిన అభ్యుదయ రచయిత్రి హైమవతిగారికి నేనెంతో ఋణపడి ఉన్నాను.

సాగర మథనం చేసి, సారాన్ని వెలికి తీసి, ఈ నవలా పరిచయం చేసిన ఉత్తమ ప్రముఖ అవధాని కళాసరస్వతి డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్‌కు నా ధన్యవాదాలు.

"అక్షర పాత్ర ఇన్నింకా పొంగుతూనే ఉందండీ—" అని అభినందించి, ఈ రచనకు భాషాపరంగా చక్కని సూచనలిచ్చిన కవి పండితుడు మల్లాది కృష్ణ ప్రసాద్‌గారికీ, శ్రీమతి విజయగారికీ అభివాదాలు.

ఏది శాస్త్రాన్నయినా తవ్వితీసి, మథించి, సాలంకృతంగా చర్చించి సత్యాన్ని నిగ్గు తేల్చే విమర్శకుడు డా॥ డి. విజయకుమార్‌గారికి నా ప్రణామాలు.

ముఖ పత్ర చిత్ర రచన చేసిన చిత్రకారుడు, పదిహేనేళ్ళ నించి సాహితీరంగంలో స్నేహితుడు 'సాని'గారికీ, శరవేగంతో అచ్చుపని పూర్తి చేసిన శ్రీ నవోదయా ప్రింటింగ్ ప్రెస్ అధినేత యస్వీ. శేషగిరి రావుగారికీ, వారి సిబ్బందికీ నా కృతజ్ఞతలు.

ఇంకా, నన్ను అనేక విధాలుగా ప్రోత్సహిస్తున్న సాహితీ మిత్రులందరికీ నమోవాకాలు.

ఈ సప్తసింధు నవలపై పాఠక మహాశయులు తమ అభిప్రాయాల్ని, సూచనల్ని తెలియజేస్తే సహృదయతతో స్వీకరిస్తాను—

సుమిత్ర క్లినిక్
విద్యాధరపురం
విజయవాడ - 520 012

డా॥ జి. వి. పూర్ణచంద్

# మున్నుడి

అవధాన కళాసరస్వతి
డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్

"సప్తసింధు" రసవత్తర నవలా కావ్యం
భారతీయుల తొలివెలుగుల కథాదీపం

వచన కవిత్వంలో మానస శాస్త్రాన్ని సైతం చెప్పగలిగినవాడూ - శాస్త్రీయమైన విషయాల్ని కూడా సూత్రబద్ధంచేసి అందంగా మలిచి వివరించ గలవాడూ-వైదిక, ఐతిహాసిక, చారిత్రకఅంశాలను హేతుబద్ధంగా పరిశీలన చేయగలిగినవాడూ....డా॥ జి.వి. పూర్ణచంద్ వెలువరించిన ఈ 'సప్తసింధు' సౌరభాలు వెదజల్లే సౌగంధిక పుష్ప సమాహారం అని చదివేక ఎవరైనా ఒప్పుకుంటారు.

వివిధ తెగలమధ్య, జాతులమధ్య జరిగిన సంఘర్షణ - సంలీనాలే మానవజాతి చరిత్రను నిర్మించాయని నిరూపించటానికే రచయిత ఈ ఇతివృత్తాన్ని ఎంచుకున్నారు.

అనగనగా సగరుడనే చక్రవర్తి ఉండేవాడు. ఆయన ప్రసిద్ధులైన చక్రవర్తులలో ఒకడు. ఆయనకు ఇద్దరు భార్యలు—కేశిని, సుమతి!

ఋషి వరంచేత కేశినికి అసమంజసుడూ, సుమతికి అరవై వేల మంది కొడుకులూ పుట్టారు.

అసమంజసుడు కనిపించిన పిల్లలనందరినీ సరయూ నదిలోకి తోసి ఆనందించేవాడు. తండ్రి సగర చక్రవర్తి అతణ్ణి దేశంనుండి బహిష్క-రించాడు.

మిగిలిన అరవై వేలమంది కొడుకులూ యజ్ఞాశ్వం కోసం పాతాళానికి పోయి బూడిదయ్యారు.

అంసుమంతుడు సింహాసనం ఎక్కాడు.

ఇది రామాయణంలో వున్న సగరుని చరిత్ర. ఇదే కథ భారత భాగవతాలలో కొద్ది తేడాలతో కన్పిస్తోంది.

క్రీ. పూ. 3,380 ప్రాంతాలనాటి బాబిలోనియా, ఈజిప్ట్, హిట్టైట్ ఇండస్, గోథిక్‌ల ప్రాచీన చరిత్ర, సంస్కృతులను పరిశోధించి ఎల్.ఎ. వాడేల్ అనే చరిత్రకారుడు "ది మేకర్స్ ఆఫ్ సివిలిజేషన్ ఇన్ రేస్ అండ్ హిస్టరీ" అనే గ్రంథం వ్రాశాడు.

ఆ పుస్తకంలో—సార్గాన్ అనే రాజు తన తండ్రిని సంహరించిన ఈజిప్ట్ ప్రభువు జిగ్గిషిపై ప్రతీకారం తీర్చుకొని, రాజ్యాన్ని విస్తరించి చక్రవర్తి అయినట్లూ, జలమార్గం ద్వారానే అతను రాజ్యవిస్తరణ చేసినట్లూ కొన్ని రికార్డుల ఆధారంగా నిరూపించాడు —

'సార్గాన్' కొడుకు "అహ-మెనిస్" లేక "మనిష్-తుషు" ఈజిప్ట్ నాగరకతని వ్యవస్థాపించినవాడు.

వాడేల్ తన పరిశోధనలకు రామాయణ భారతాలను ప్రధాన భూమిక లుగా చేసుకొని, "సార్గాన్"-"సగర", "అహ-మెనిస్"- "అసమంజస" సారూప్యాలతో సగరుడి కథ, సార్గాన్ చరిత్ర ఒకటే అని ప్రకటించాడు.

సగరుడు తన తండ్రిని చంపినవారిపై పగతీర్చుకున్నట్లు భాగవతం లోనూ ఉన్నది.

"చండ స్ఫూర్తి నతండు తండ్రి పగకై సంగ్రామ రంగంబునన్
చెండెన్ హైహయ బర్బరాదుల వధించెన్ తాళజంఘాదులన్
ముండీ భూతులుగా నిరంబరులుగా మూర్తుల్ సభీభత్సులై
యుండం జేసి నిజారులన్ సగర నామోర్వీ విభుండల్పుడే

[భాగ: నవమ: 203]

'మెనిస్" పేరుకు దగ్గరగావున్న మనస్యు గురించి భారతంలో ఉంది—

"మనస్యుర భవత్త స్మాత్సురసేని సుతః ప్రిభుః"

[కలకత్తా ప్రతి Vol 1 Sec 94-3-695]

'మనస్యు' పదంలో 'యు' అంటే యునైటర్-ఏకం చేసినవాడని అంటూ, నైలూ నదికి ఎగువనున్న ప్రాంతాలనూ, దిగువనున్న ప్రాంతాలనూ 'మెనిస్'-సమైక్యపరిచి, సంయుక్త ఈజిప్ట్‌ను నిర్మించాడని పేర్కొన్నాడు వాడేల్.



అలబాస్టర్‌లో దొరికిన అసమంజసుని
[మనిష్-తుష (లేక) మెనిస్] విగ్రహం.

మెసపొటేమియా రికార్డులలో, సార్గన్ రెండో కొడుకు అధికారంలోకి రావడం, అంతఃపురంలో జరిగిన కుట్రలో అతను మరణించడం

పెద్దకొడుకు తండ్రిని కాదని ఈజిప్ట్ వెళ్ళిపోయి అక్కడ స్వతంత్ర ప్రభువుగా రాజ్యపాలన చేయడం వగైరా కథ అంతా ఉంది.

ఈ సప్తసింధు నవల సగర కథ—సార్గాన్ చరిత్రల సమన్వయంగా కల్పించబడింది.

ప్రజా సమూహాల వలసలు, సామ్రాజ్య స్థాపనలతో సంస్కృతులు దేశాల ఎల్లలు దాటి ఎలా ప్రసరిస్తుంటాయో ఈ నవల వివరిస్తుంది.

కుల మతాలపరంగా సమాజం విడిపోయి, పరస్పరం విద్వేషాలు పెల్లగిల్లుతున్న ఈరోజుల్లో ఈ "సప్తసింధు" నవల రాయటం ఒక చారిత్రక అవసరం.

కేవలం పురాతత్త్వ, పురావస్తు పరిశోధనల ప్రాథమిక సాక్ష్యాలతో చరిత్ర నిర్మించదలిస్తే, ఎన్ని వందల సంవత్సరాల తవ్వకాలలో ఎంత చరిత్ర ఎప్పటికి పరిపూర్ణమై జాతికి అందుతుందో....! ఆ ఎదురు చూపుల్లో ఎన్నితరాలు చీకటిలో గడపాలో.....!!

మాధ్యమిక ఆధారాలుగా మనం పరిగణిస్తున్న వేదోపనిషత్, పురాణ ఇతిహాసాలలో ఉన్న చారిత్రకాంశాలను అన్వేషించి, తులనాత్మక ప్రామాణికాలద్వారా చరిత్రను నిర్మాణం చేసుకోవటం తప్పదేమో !

ఈ విధమైన సమన్వయ పరిశోధన ప్రసక్తి వచ్చినప్పుడు యీ 'సప్తసింధు' ముందు నిలుస్తుందని నా విశ్వాసం.

కొన్ని ఐతిహాసిక పౌరాణిక వృత్తాంతాలకు, ఈ దృష్ట్యా ఈ నవలలో చేసిన సమన్వయాలు అంగీకరించదగినట్లున్నాయి.

దేవతలూ దానవులూ కలిసిచేసిన 'సాగర మథనం' కథ ఇందుకు చక్కని ఉదాహరణ.

సముద్రయానం చేసేటప్పుడు నావలకు అడుగున చక్రాలవంటి యంత్రాలు తిరిగి, నీరు చిలికి, సుడులు తిరిగి నావ ముందుకు నడుస్తుంది కాబట్టి, సముద్ర మథనం అంటే సముద్ర యానమేనంటారు ఈ రచయిత!

"సముద్ర మథనం ద్వారా ఒక జాతి నుంచి మరొక జాతికి ప్రపంచ వింతలనదగిన వస్తు సముదాయం విశేషంగా అందుబాటులోకి వస్తున్నాయి" [పుట: 152]

"కామధేనువులూ, కల్పవృక్షాలూ, వైద్యానికి పనికివచ్చే కాలకూట విషాలు వగైరా ఈ సముద్ర మథనం ద్వారానే ఒక చోటునుంచి మరొక చోటుకు తరలించబడుతున్నాయి". [పుట: 152]

పణి-సరమ సంవాదం ఋగ్వేదంలో ఉంది. ఇందులో ఇంద్రుణ్ని ప్రభువైన సగరుడిగా పేర్కొన్నారు! అలాగే,'సరమ'ని విశ్వ'మోహిని'గా వర్ణించి ఆమె స్వయంగా రాక్షసులైన పణులను సంహరించినట్లు చిత్రించి, పణి-సరమ సంవాదానికీ, సముద్ర మథనం కథకీ అద్భుతమైన సమన్వయాన్ని సాధించారు రచయిత.

అలాగే, "అశ్వమేధయాగం" అంటే, గుర్రాన్ని చంపే యజ్ఞం అయివుండదనీ, సగరుడు హైహయులనేవారిని చంపినదానికి సంకేతంగా 'హైహయ మేథం'—"హయమేధం"గా రూపొందిఉంటుందనీ మరొక సమన్వయం!! జిగీషకి సగరుడు రాసిన ఉత్తరంలో దీన్ని గమనించవచ్చు. బాబిలోనియా రికార్డులలోంచి ఆ ఉత్తరాన్ని వాడేల్ పేర్కొన్నాడు.

సంగీతంలో ఇప్పుడు 'సరిగమపదని' ఆరోహణ అవరోహణ క్రమంలో స్వరాలున్నాయి. వైదికంగా అవి "మగరిసధనిప" అనే క్రమంలో ఉండేవి. [చూ: సంస్కృత వాఙ్మయ చరిత్ర- మల్లాది సూర్య నారాయణశాస్త్రిగారు - పు. 191]

గాంధార దేశ పురోహితుడు సౌభరి వాటిని "సరిగమపదని" క్రమంలో సవరించినందుకు గుర్తుగా—'గ' స్వరానికి 'గాంధారం' అని నామకరణం చేశారన్న రచయిత ఊహ ఆలోచనామృతం. ఇది నిజంగా సంగీత శాస్త్రంలో ఒక మలుపు.

వైదికంగా ఈ నవలలోని ఇతివృత్తం ఋగ్వేదకాలం నాటిది. ఋగ్వేదంలోని ఎన్నో ఋక్కుల్ని ఇందులో ఉదహరించారు. యజ్ఞయాగాది క్రతు ప్రయోగాలు, వివిధ వైదికాంశాలు ఈ కథలో కలిసిపోయి ఋగ్వేద కాల వాతావరణాన్ని అందంగా సృష్టించాయి.

యజ్ఞయాగాలు జరిగే సమయంలో ఋషి గోష్ఠి (సెమినార్) జరగడం, అందులో స్త్రీలుకూడా పాల్గొని వైజ్ఞానికవిషయాలపై తర్జనభర్జనలు జరపడం....ఇవన్నీ అనేక ఆలోచనల్ని రేకెత్తించే అంశాలు.

చరకుడు చరక సంహితలో ఇటువంటి గోష్ఠుల్ని పేర్కొన్నాడు.

పండితులు-"ద్వా సుపర్ణా సయుజా సఖాయా"అనే ఋక్కును కర్మ సిద్ధాంతానికి ఋగ్వేదంలో ఉన్న బీజంగా, వేదాంత సమన్వయంలో ముఖ్యమైనదిగా పరిగణిస్తారు. ఆ ఋక్కును కథకు అన్వితమయ్యేటట్లు చెప్పటం [పుట: 211] బాగుంది.

గణాలుగా, చిన్నచిన్న రాజ్యాలుగా పాలనా వ్యవస్థ ప్రారంభమైనప్పుడు పరస్పర సంఘర్షణల్లోంచి అధికార కేంద్రీకరణ (సామ్రాజ్య స్థాపన) అందంగా కనపడింది. అధికారం కేంద్రీకృతమైన తర్వాత సామంతులు భోగలాలసులై, పాలనాఫలాలు ప్రజలకు చేరనప్పుడు మళ్ళీ తిరుగుబాటులూ, స్వతంత్ర రాజ్యాలూ, అధికార వికేంద్రీకరణలూ తల ఎత్తాయి.

ఈ ఆరోహణ, అవరోహణ క్రమమంతా ఈ నవలలో రెండు మూడు తరాలలో వర్ణించబడింది.

"ప్రస్తుత విపత్కర పరిస్థితులలో జిగీషి మూకకు వ్యతిరేకంగా వివిధ ఆర్య అనార్య జాతులను సమీకరించి, సంలీనం చేయగల వీరుడూ, జ్ఞాని అయిన యువకుడెవరైనా ముందుకువచ్చి ఈ రాజ్యపాలనా భారం స్వీకరించి—మానవాళిని సంఘటితపరచవలసిందిగా ప్రార్థిస్తున్నాను—" అంటాడు రాజర్షి రథవీతి.

రాజవ్యవస్థ - మహర్షి వ్యవస్థల మధ్య సంఘర్షణలు ఒకదానిపై ఇంకొకటి ఆధిపత్యం చెలాయించే ప్రయత్నాలు గతితార్కిక భౌతిక వాదానికి అనుకూలమైన పరిణామాలు.

"రాజులంతా అసమంజసునిలా విజ్ఞానవేత్తలను హింసించడమే జరిగితే....రాయబారీ! మహర్షులు సహిస్తారనుకోవద్దు....వారు ఒక చేతితో శాపాన్ని, మరో చేతితో శరాన్ని సంధించగలరు—" అంటాడు సగరుడు.

రాజ్యసభను నిర్మించి, ప్రభువుగా తాను ఆ రాజ్యసభా నిర్ణయానికి బద్ధుడై ఉండేట్లు ప్రవర్తించిన ఆ మహాసగరుని పాత్ర చిత్రణ అద్భుతం.

ఆహార సేకరణ దశనుంచి ఆహారోత్పత్తి దశకి సమాజం పరిణ మిస్తున్న దశలో జాతులు సంలీనం చెందడం తప్పనిసరి పరిణామం. ఈ పరిణామాన్ని డి.డి. కోశాంబి మాటల్లో ఇలా అన్వయించుకోవచ్చు—

"ఉత్పాదన ప్రాతిపదికతో సామాజిక సాంస్కృతిక అవాన ప్రవా నాల తాలూకు సంబంధం చారిత్రక ప్రాముఖ్యంగల నూర్చు. ఆర్యుల ఆధి పత్యంలో కొత్త సామాజిక వ్యవస్థ నిర్మాణం సాధ్యమైందంటే అది ఒక పరిణామక్రమం ఫలితం ఆర్యేతర గణాలలో బలమైనవాడికి ఆహార ఉత్పత్తినీ, ఇనుము వాడకాన్నీ అలవాటుచేసి, వారిలోనైతం వర్గ విభజనను ప్రవేశపెట్టి ఆర్య సమాజంలో కలుపుకోవడం ఒక దశ....ఈ దశలో బలమైన ఆర్యేతరగణాలను లొంగదీసుకోవడానికి సామాజిక సాంస్కృతిక సమ్మేళనాన్ని ఒక సాధనంగా ఉపయోగించారు ఆర్యులు. ఈ క్రమంలో లొంగిపోయిన గణాల అలవాట్లు, ఆచారాలు, పూజావిధానం, సామాజిక నిర్మాణం ఆర్యసమాజంలోకి వచ్చి చేరినట్లుగానే, ఆర్య సంస్కృతి ప్రధాన లక్షణాలైన వర్ణవ్యవస్థ, బ్రాహ్మణాధిక్యం, హేతురహితమైన కర్మకాండ వగైరాలు త్రివిక్రమావతారం తాల్చాయి...." [భారత చరిత్ర-పరిచయ వ్యాసాలు పుట: 28-29]

పైన పస్తావించిన చరిత్ర బీజాలే 'సప్తసింధు' నవలా వృక్షంగా రూపొందాయి.

"వాడు కిరాతకుడైనా, అనార్యుడైనా, కృష్ణత్వక్ అయినా మనం గౌరవించి సముచిత స్థానాన్ని కల్పించి నాగరకతా ఫలాన్ని సమానంగా అందించ లేనంత కాలం మనజాతి అజ్ఞానాంధకారం లోంచి బైటపడలేదు"

"నరుడు మానవుడు కావాలంటే అతను జ్ఞానాన్ని సంతరించు కోవాలి— పాపపుణ్యాల వ్యత్యాసాన్ని గ్రహించడమే జ్ఞానం! మానవతను పెంచుకోవడమే జ్ఞానం!!"

"ప్రపంచ జాతులను సంఘటితంచేసి ప్రజాతంత్ర వ్యవస్థను నెలకొల్పు"

"ధనవంతుడికీ, నిర్భాగ్యుడికీ మధ్య అడ్డుగోడలా నిల్చున్న ఈ గోడగోడల్ని కూల్చిందే సమసమాజం సాధ్యం కావని నిర్ణయించుకొంటూ పుష్కలావతీ నగరంలోకి అడుగుపెట్టాడు సగరుడు !"

"త్వష్టా! మానవజాతి మహోదయాన్ని అరచేతులు అడ్డుపెట్టి ఆప గలమనుకోవడం భ్రమ! ప్రజాపీడకులయిన నియంతలు తామే సర్వస్వం అనుకొని, తామే సర్వవ్యాపకులం అని భ్రమపడి— చివరకు ఇలా భంగ పడతారు"

ఇలా బుధమూర్తి, రోమశ, సగరుడు, అసమంజసుడు, అప్సర... మొద లైన పాత్రలద్వారా ప్రజాపాలన, ప్రజాసంక్షేమాల గురించి రచయిత చేసిన వ్యాఖ్యానాలు ఆయన రాజకీయ సామాజిక అవగాహనా గాఢతను పట్టి ఇస్తాయి. వస్తువు ఆ కాలానిదే అయినా, వాస్తవాలు సార్వకాలికాలని ఋజువు చేస్తాయి.

మత సామరస్యానికి ముప్పు ఏర్పడిన ఈ రోజుల్లో .... మానవత్వపు పరిధి మరీ కుచించుకు పోతున్న ఈ రోజుల్లో .... సంస్కృతులు సాగరాలు దాటుతున్నా, సంస్కారం చిక్కి నగమౌతున్న ఈరోజుల్లో.... వర్ణవ్యవస్థ ఇంకా ఏర్పడని సువర్ణ యుగాన్ని ఈ సప్త సింధు మన కన్నుల ఎదుట ప్రత్యక్షం చేస్తుంది.

"పూర్ణ మదః పూర్ణ మిదం" అన్న శ్రుతి ప్రకారం వృత్తాకారంలో పరిణామాలు సంభవిస్తూ ఉంటాయి. పడమర నుంచి తూర్పుకి, తూర్పు నుంచి పడమరకి వస్తూ పోతూ ఉండే వ్యవస్థలూ, సంస్కృతులు ఎవరికి చెందినవని చెప్పగలం? ఏది ఎవరి సొంతం?

మతాలు సాపేక్షాలనీ, మనిషి నిరపేక్షుడని నిరూపించే ఈ 'సప్త సింధు' సుందర నవలలో విరిసిన మల్లె మొగ్గ!

దాని సౌరభాలను లోకాలకు పంచుతున్న డాక్టర్ పూర్ణచంద్ అభినంద నీయుడు..!!

# సప్తసింధు

సరస్వతీ నదీ తీరం....

బంగారు కాంతులు ప్రసరిస్తూ— సుదీర్ఘ ఉషస్సును ప్రసాదించే దివ్యప్రభాకరునికి స్వాగతం పలుకుతోంది పవిత్ర సరస్వతి...

మహర్షులు ముక్తకంఠంతో చేసే వేద ఘోషలా సరస్వతీ కెరటాలు లయ బద్ధంగా ధ్వనిస్తున్నాయి—

"అగ్ని మీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతవం"

అంటూ రాజర్షి రథవీతి మంత్రోచ్చాటన చేస్తున్నాడు.

బుధ మహర్షి ఆయనతో గొంతుకలిపి అగ్నిదేవుని కీర్తిస్తున్నాడు.

ఆ యిద్దరు మహనీయుల గానంతో ప్రకృతి పవిత్రత సంతరించుకుని ఓజోవంతమై ప్రకాశిస్తోంది.

సూర్య భగవానుడు తమ ప్రజల్ని చల్లగా చూడాలని ప్రార్థించుకున్నారిద్దరూ!

సూర్యారాధన ముగిశాక తన సౌధానికి బయల్దేరాడు రథవీతి రాజర్షి! ఆయన రాకను సూచిస్తూ రాచమార్గాన మంగళవాద్యాలు ఒక్కసారిగా మార్మోగాయి.

బుధమహర్షి వినయంగా ఆయనను అనుసరిస్తున్నాడు.

మార్గానికిరువైపులా బారులు తీరిన పంచాపదేశ పౌరులు తమ ప్రియతమ నాయకుని మనసారా దర్శించుకొని కష్టసుఖాలు వెళ్ళబోసుకొంటున్నారు.

మహారాజులా, మహాఋషిలా, ఆయన కళ్ళలో దర్పమూ-దయా ఆ ప్రజల్ని సదా శాసిస్తూ, అలరిస్తూ, పాలిస్తూన్నాయి.

ఏకాగ్రమైన తపస్సు చేత సాధించుకున్న తేజస్సు ఆ పుణ్యపురుషుని చుట్టూ కాంతి పరివేషాల్ని కల్పిస్తోంది!

శరత్కాలపు లేయెండ-కెంజాయ సరస్వతీ కెరటాల పైన ప్రసరించి, పరావర్తం చెంది, వెన్నెల గూడు కట్టినట్లు ఆయన చుట్టూ గుబురు విడిచింది!

పాల సముద్రంలో పుట్టిన – "తొడిమ ఎర్రని పారిజాతం"లా ప్రకాశిస్తున్నాడాయన!!

అభయ హస్తంలో ఐదు వేళ్ళలా వితస్త [జీలం నది], చంద్రభాగ [చెనాబ్], సరస్వతి [ప్రస్తుతం అదృశ్యం] విపాస [బియాస్] శతుద్రు [సట్లెజ్] నదులు ఈ సింధుభూమిపైన తమ చల్లని పీచికా హస్తాలు సాచినాయి....!

ఈ పంచనదీ పరీవాహక 'పంచాపదేశం' అనాహౌక సుందర కేదారం! అందునా, అత్యంత పవిత్రమై, సరస్సులకు నిలయమైన సరస్వతీ నది పర్వతాల నుంచి సింధువు వరకూ ఉరకలు వేస్తోంది!!

ఆ నదీతీరాన కొంచెం దూరంగా.... అపురూపమైన 'స్త్రీల స్నాన వాటిక'....

స్నానవాటికలో కొందరు ఆడవాళ్ళు పచ్చల పిడిబాకులకు పదును పెట్టుకొంటున్నారు. కొందరు నారీమణులు వింటినారిని సంధించి గురి చూసుకొంటున్నారు. కొందరు బలశాలినులు కండలు పొంగించి బలాలు ప్రదర్శించుకొంటున్నారు.

యోగ్యమైన ఆ నదీజలాలతో తడిసి, తన సుందర రూపంతో నదీ సైకతాన్ని ప్రకాశింప చేస్తోంది "అప్సర" — రాజర్షి రథనీతి ముద్దుల కూతురు—

అప్సర అంటే ఏరులా కదిలేది—సముద్రంలా ఎగిసి పడేది — జల పాతంలా దుమికేది....!!

అసుర సేని [అప్యర సేని] ఆమె అసలు పేరు—

యోధాను యోధుల్ని తమ శృంగార విద్యలతో ఆకర్షించి, యుద్ధ విద్యలతో జయించడం సింధు వనితలకో వినోదక్రీడ—

అప్సరకు ఇలాంటి వినోదాలు గిట్టవు—

దూరంగా పోయి, ఇసుక తిన్నెలమీద కూర్చుని దేన్నో తదేకంగా చూస్తోంది....

ఆమె ఏకాంతంలో వుందని, 'భామ' అటుగా వచ్చింది—

"కుమారీ! ఏమిటీ చూస్తున్నావ్?" ఆమె ఆలోచనలను భగ్నంచేస్తూ అడిగింది భామ.

"ఇసుకమీద ఆ పురుగు నడుస్తుంటే పడిన గుర్తులు చూశావటే భామా....?" తియ్యగా అడిగింది అప్సర.

భామ అయోమయంగా చూసింది.

"ఆ గుర్తులు అక్షరాల్లా లేవూ....?"

"అక్షరాలంటే....?"

"అక్షరాలంటే మనం మాట్లాడే మాటల్ని గుర్తులుగా పెట్టడం—"

అప్సర మాటలు అర్థం కానట్లు చూసింది భామ—

"అయితే నీకు పురుగు భాష కూడా వచ్చా....ఇసకమీద ఆ పురుగు ప్రేమలేఖ రాస్తోందా....??" గలగలా నవ్వింది భామ.

"నీకెప్పుడూ ప్రేమగొడవే–!" చిన్నగా మందలించింది అప్సర– "మనుషులు ఒక్కో–మాటకు ఒక్కో– గుర్తు పెట్టుకుని వ్రాస్తున్నారు. ఆ గుర్తుల్ని అక్షరాలుగా వ్రాసే ఉపాయాల గురించి మొన్ననే మహర్షి సమితిలో చర్చించారు. ఈ పురుగు నడిచిన గుర్తులు ఏవో అక్షరాల్లా వుంటే వింతగా చూస్తున్నాను–"అని వివరించింది అప్సర.

"నీతోపాటు నన్నూ మహర్షి సమితికి తీసుకు వెళ్ళవూ....?" ప్రతి మాలింది భామ.

"అలాగే! భాషించడం నేర్చుకో ముందు" వరమిచ్చే దేవతలా అంది అప్సర.

అంతలో రాచమార్గాన భేరీ మృదంగాది తూర్య స్వనాలు చెల రేగాయి.

"నాన్నగారు దేవతార్చన ముగించినట్లున్నారు – నేను త్వరగా వెళ్ళాలి–" అంటూ లేచింది అప్సర.

ఆమె వెనకే నడిచింది భామ.

రాజ్యసభ అత్యవసర సమావేశం ప్రకటించాడు రథవీతి రాజర్షి• వెంటనే రాజసౌధానికి రావలసిందిగా పిలుపునిస్తూ వేగులు బయల్దేరారు.

అనూహ్యమైన స్తబ్ద యుద్ధ వాతావరణం ఏదో క్రమ్ముకొంటున్న సూచనలు అందర్నీ కలవర పెట్టసాగాయి.

సూర్యుడు కూడా ఒకింత బాధతో చల్లబడిపోయాడు!

* * *

చెట్టూ చెట్టూ రాపాడితే అగ్ని పెచ్చరిల్లినట్లు జ్వాజ్వల్యమానంగా పెల్లుబుకు మండుతోంది.

మంటల చుట్టూ మైమరచి ఉన్మత్త నృత్యం చేస్తున్నారు – ఆడా మగా అందరూ కలిసి–!!

కామాగ్నిలా భగభగ మండుతోంది ఎత్తయిన కట్టెల రాశి....!

శబ్దానికన్నా లయ ముందు పుట్టిందన్నట్లు, ఒకేవూపుతో, ఒకే లయతో ఆడుతున్న వాళ్ళ నడకకు అనుగుణంగా ఏవేవో వాద్యాలు వింత వింత శబ్దాలు చేస్తున్నాయి—

ఎవరూ వంటిమీద అబద్ధాల ముసుగులు కప్పుకుని సిగ్గుని దాచు కోవడం లేదు.

అందరూ కలిసి హాయిగా ఆడుతున్నారు—పాడుతున్నారు.

ఇర్యాదేశపు [నేటి ఈజిప్ట్‌లో ఒక ప్రాంతం] రాకుమారి పెళ్ళి వేడుకలు కోలాహలంగా సాగిపోతున్నాయి.

గాంధార రాజైన "జిగీషి" కుమారుడు "త్వష్ట"కి ఇర్యా యువ రాణి "యోజిత"కీ పెళ్ళి.

ఇర్యాదేశం యావత్తు సంబరం చేసుకొంటోంది—

నీలానది [నైలూ] తీరంలో శోభస్కరంగా అలంకరించిన విశాల మైన వేదికపైన సింహ చర్మాన్ని పరిచారు.

పట్టు వస్త్రాలు కట్టుకుని వేదికపైన కూర్చున్నాడు 'త్వష్ట'. అతని నడుముకు ఎర్రటి ఉన్ని వస్త్రాన్ని బిగించారు. తలపైన ఒక ప్రక్కకు వంగిన చమరీ చర్మ కిరీటాన్ని వుంచారు.దానికిచివర అందమైన పక్షిఈకలు తగిలించారు!

జిగీషి పురోహితుడు సౌభరి వివాహవిధిని స్వయంగా దగ్గరుండి జరిపిస్తున్నాడు.

"తమరు నాగరకులు... తమ సాంప్రదాయాన్నే కార్యం జరిపిం చండి..." అన్నాడు పెండ్లికుమార్తె తండ్రి- ఇర్యాదేశ ప్రభువు తలేవా!

సంతోషంగా అంగీకరించాడు గాంధారదేశ (నేటి అఫ్ఘనిస్థాన్‌లో కాందహార్ ప్రాంతం) ప్రభువు జిగీషి.

"మన జిగీషికి ముందుచూపు ఎక్కువ. సింధూ ఆర్యులు ఎన్నడూ ఎరుగని మారుమూల ప్రాంతాలలో తన పాదాన్ని మోపి ప్రపంచ విజేత అనిపించుకోవడానికి చక్కటి మార్గం వేసుకొంటున్నాడు" అంటూ గుసగుసలాడారు జిగీషివైపు వచ్చిన సామంతభూపాలురు!

"తలేవా అంటేనే 'తలలు తేసేవాడు' అని! ఎంత తెలివైనవాడు కాకపోతే గాంధారవీరుణ్ని అల్లుడుగా తెచ్చుకుంటాడూ....? అల్లుణ్ని అడ్డం పెట్టుకొని రాజ్యాలేలాలని ఆశ....!" అని చెవులు కొరుక్కొంటున్నారు తలేవా పక్షాన వచ్చిన వివిధ రాజన్యులు—

ఉపరి సౌభరి! ఆయనకు ఈ రాజకీయాలేవీ పట్టవు. "సింధూ ఆర్యుల్నీ ఈ ఈరేయుల్నీ కలుపుతున్నవాడు 'హ-ర' దేవుడొక్కడే...." అనుకొంటున్నాడు.

'హర' శబ్దంలో 'ర' బీజాక్షరాన్ని సూర్యుని రూపంగా భావించి ఈ ఇర్యా ప్రజలు పూజించడం సౌభరిని విశేషంగా ఆకర్షించింది.

"ఏ జాతీయులయినా, ఏ దేశీయులయినా మనుషులంతా ఒకటే అనడానికి ఇంతకన్నా దృష్టాంతం ఇంకేం కావాలి....?" అనుకున్నాడు. హరునితప్ప మరో ఆలోచన మనసులోకి రానీయడాయన!

ఇంతలో పెళ్ళికుమార్తె 'యోజిత'ను వేదికపైకి తీసుకు వచ్చారు.

కోలాహలంగా పెళ్ళి వేడుకలు జరిగిపోతున్నాయి.

తృప్తిగా ఇలా ఆనందించే రోజులు మళ్ళీ వస్తాయనే నమ్మకంలేని ఇర్యా ప్రజలు ఇదే అదనుగా సుఖంగా భోగిస్తున్నారు.

వాళ్ళకు చావంటే భయంలేదు. కష్టాలంటే లక్ష్యంలేదు. వాళ్ళు కేవలం యుద్ధజీవులు!

తమ పటపుల్ని ఇతరులు దొంగిలించినప్పుడు అక్కడ భేరీభాంకారాలు విన్పిస్తాయి. తమ స్త్రీలను శత్రువులు లేవదీసుకుపోతారని భయం

వేసినప్పుడు అక్కడి మూలాలు పచ్చనెక్కుతాయి. ప్రేమ సురని మనుష్కులు తస్కరిస్తారని అనుమానం కల్గినప్పుడు అక్కడ తలలు తెగుతాయి.

ప్రస్తుతం చిత్రవిచిత్రమైన ఆ వాద్యాల ఘోషలో, ఆ మత్తులో, రాబోయే కష్టాలు ఎవరినీ కలవరపెట్టడంలేదు.

పెళ్ళి జరిగిపోతోంది.

పీటలమీద యోజితను కూర్చోబెట్టారు. అర్థ, కామాలను ప్రసాదించమని కోరుతూ, ఆమెచేత జలదేవతకు మొక్కించారు.

ఆమెకు ఏమీ అర్థంకాకపోయినా, సౌభరి చేస్తోన్న ఋక్మంత్ర గానానికి తన్మయమై, మనసులోనే ఆయనకు నమస్కరించుకొంది యోజిత—

"నారీ! మన పశువుల మందను జాగ్రత్తగా చూసుకో- మనకు దొరికిన గుహనీ, మనం నిర్మించుకున్న గృహాన్నీ చక్కగా తీర్చి దిద్దుకో—"

"మనకోసం వీరుడైన కొడుకును కను!"

"మహోత్తరమయిన నా వంశపు ఉన్నతి నీ గర్భంలో జీవంపోసుకోగాక—"

అనే భావాలతో అనేక ఋక్కుల్ని రాగతాళయుక్తంగా ఒక వరుస క్రమంలో పలుకుతూ— వాటిని "త్వష్ట"చేత తిరిగి అనిపిస్తున్నాడు సౌభరి!

త్వష్టకి ఈ మంత్రాలు బాగా నచ్చాయి. "ఓ నాగలీ! మా పొలం బాగా దున్ను-" అనో, "ఓ మేఘమా! తియ్యని నీటిని ధారగాకురిపించు!" అనో దిక్కుమాలిన ఋక్కులు చెప్పేవాళ్ళేగాని, ఇలా ఏ సమయానికి తగిన మంత్రాన్ని ఆ సమయంలో ఆశువుగా చెప్పినవాళ్ళే లేరు.... ఈ సౌభరి మంచిదిట్ట—!" అనుకున్నాడు.

అన్నీ వింటూ, రాతిపూసల్ని సూత్రబద్ధం చేసినట్లు, అర్థంకాని భాషలో అర్థం అయిన భావాల్ని అల్లుకొంటోంది యోజిత.

సరిగ్గా ఇదే సమయంలో పెళ్ళి పందిట్లోంచి పెద్ద కలవరం బయల్దేరింది.

ఏం జరిగిందో అర్థంకాక అంతా అటే చూస్తున్నారు.

ఈ పెళ్ళి అర్ధంతరంగా ఆగిపోతుందా....?

ఏమో...

ఎవరికీ ఏమీ అంతుపట్టడంలేదు!!

స తీరాన రాజర్షి రథవీతి సౌధం—

వడగళ్ళవాన కురుస్తున్నప్పుడు బాటసారులు మహావృక్షం నీడన చేరినట్లు, పంచాపదేశ ప్రముఖులు ఆయన సమక్షంలో సభతీరి కూర్చున్నారు.

"ఇంత జరిగాక ఇంకా ఉపేక్షించడం భావ్యంకాదు- యుద్ధమే శరణ్యం! అందుకు సిద్ధంకండి—" అని ప్రసంగిస్తున్నాడు రథవీతి.

ఆయన ముఖం వివర్ణం అయింది. జరగనున్న విపర్యయాలకు ఆయన గుండె తల్లడిల్లి పోతోంది.

ఏనాడూ యుద్ధం ఆలోచనే చేయని పరమశాంతమూర్తి రథవీతి ప్రభువు ఈ అత్యవసర సమావేశంలో ఉగ్రరూపమెత్తి సమర నినాదం ఇస్తుంటే, అందరూ విస్తుపోయి చూస్తున్నారు.

ఆయన గుండెకోతని అర్థం చేసుకోగల్గిన కొందరు అనుభవశాలురు- అందుకు తీసుకోదగిన విరుగుడు చర్యల గురించి ఆలోచిస్తున్నారు.

"నా ప్రియమైన ప్రజలారా...

హైహయ తాళజంఘాది జాతులు గాంధార రాజైన జిగీషి నాయ కత్వాన ఏకమై మన మహోన్నత సంస్కృతీ వైభవాన్ని నేలమట్టం చేయా లని చూస్తున్నారు.

మహామహుడు ప్రసిన్వతుల వారిని చంపి, ఆయన పుత్రుడు సగర రాకుమారుని తన పాతాళ నూతులలో బంధించి, గాంధారరాజు జిగీషి-మనకు పక్కలో బల్లెంలా తయారైనాడు—

పంచాప పౌరులారా!

జిగీషి ఇప్పుడు అనేక విధాలుగా బలసమీకరణ చేసుకొంటున్నాడు.

నేడో, రేపో యుద్ధం తథ్యమయ్యే పరిస్థితులు ముంచుకొస్తు న్నాయి—

ముందుగా ఈ అంశాలన్నీ గుర్తించవలసిందిగా ఘనమైన ఈ మహాసభను అభ్యర్థిస్తున్నాను-" అన్నాడు రథవీతి ప్రభువు.

సభలో ఎవరూ ఏం మాట్లాడలేదు. అందరూ భరించలేని ఉత్కం ఠలో పడిపోయారు.

ఈ సభ చివరికి ఏ నిర్ణయం తీసుకుంటుందో....ఏమో??

"నేనా వృద్ధుణ్ణి! నా ఆలోచనలన్నీ రాగవైముఖ్యంతో నిండి పోయాయి-దివ్య పురుషుడైన ఆ సూర్యభగవానుడిలో ఏక్షణాన లీనమై పోతానో....!!

ప్రస్తుత విపత్కర పరిస్థితులలో జిగీషి మూకకు వ్యతిరేకంగా వివిధ ఆర్య అనార్య జాతులను సమీకరించి సంలీనం చేయగల వీరుడూ, జ్ఞానీ అయిన యువకుడెవరైనా ముందుకువచ్చి ఈ రాజ్యపాలనా భారం స్వీకరించి—మానవాళిని సంఘటిత పరచవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

సింధువుల మధ్య ఆర్య అనార్య భేదాలను రెచ్చగొట్టి-మనుషుల మధ్య వర్ణ-మతాల తారతమ్యాలను పెంచి పోషించి, అల్లకల్లోలం సృష్టిం

వడం ద్వారా తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవాలనుకునేవాళ్ళని ధైర్యంగా ఎదిరించగల వీరునికి స్వాగతం పలుకుతున్నాను-" అన్నాడు రథవీతి-రాజ్య సభకు సవినయంగా నమస్కరిస్తూ!

ఆయన సుదీర్ఘ ప్రసంగం విన్న సభాసదుల నేత్రాలు అశ్రుపూరితాలైనాయి.

ఎవరూ ఏమీ మాట్లాడలేకపోయారు.

రథవీతికన్నా వృద్ధుడైన ఒక పౌరుడు లేచి, ఆయనకు వందనం చేశాడు

"ప్రభూ! ఈరోజున పంచాప పౌరులు ఇతర జాతులకన్నా ఉన్నతులుగా ఎదిగారంటే, అది మీ ఆలోచనా పటిమా-మీ శౌర్య సంపదల వలనే సాధ్యపడిందని మాకు తెలుసు-

అటు అనార్యుల సింధు నాగరికతా సరస్వతినీ, ఇటు ఆర్యుల ఆర్ష విజ్ఞానాన్నీ-రెండింటినీ సమ్మిళితపరచి, ఆర్య అనార్యుల మధ్య ఐక్యత సాధించి, జాతుల సంఘర్షణని నివారించిన ఘనత మీదే!!

మీకన్నా నాయకులు మాకు ఇంకెవరున్నారు....?

మీ ఆదేశానుసారం నడవడానికి మాలో ప్రతిఒక్కరం సన్నద్ధంగా ఉన్నామని ఈ సభ పక్షాన ప్రతిజ్ఞ చేస్తున్నాను-" అన్నాడు.

సభలోంచి ఒక్కొక్కరే లేచి, రథవీతి పాదాలకు తమ వీరఖడ్గాలను ఆన్చి, వందనం చేశారు.

నాయకునిపట్ల విశ్వాసం ప్రకటించి, తమ ప్రాణాలను ఆయనపరం చేయడానికి పంచాప పౌరులు ఎప్పుడూ సిద్ధమే!

అందరికన్నా చివరగా అప్సర తన తండ్రి పాదాలముందు మోకరిల్లింది.

"యుద్ధాన్ని వ్యతిరేకించే నువ్వుకూడా సమరానికి సన్నద్ధమౌతున్నావా తల్లీ....?" అడిగాడు [illegible] ంత విస్మయంగా!

అప్సర తలవంచుకుని వినయంగా అంది—

"రాజకీయ కారణాలతోనో, స్వార్థపూరిత కారణాలతోనో జరిగే యుద్ధాలకు నేను వ్యతిరేకినే తండ్రీ! కానీ ఆత్మరక్షణ కోసం, మాతృభూమి సంరక్షణకోసం రక్తం చిందించటం పరమ పవిత్రమైన కార్యంగా భావిస్తాను—"

అప్సర మాటలకు ఉప్పొంగిపోయాడు రాజర్షి రథవీతి! జయజయ ధ్వానాలు చేసింది సభ!

"ఇంతటి పవిత్ర కార్యాన్ని ఎన్ని వ్యయప్రయాసలకైనా ఓర్చి, సంఘటితంగా విజయం సాధించాలని నాదేశం యావత్తూ పూనుకొంటుంటే మనసు ఉత్తేజితమై జలపాతంలా దుముకుతోంది-

మీదపడ్తోన్న వృద్ధాప్యాన్నిసైతం మీ ఆదరాభిమానాలు మరపించి వేస్తున్నాయి.

నాలో కొత్తనెత్తుటు పుట్టుకొస్తోంది. అణువణువునా వ్యాపించిన దేశభక్తి-నాడీమండలాన్ని చైతన్యవంతం చేస్తోంది...

పంచాప పౌరులారా....

అందరం కలిస్తే విజయం మనదే!" అన్నాడు రథవీతి రాజర్షి!

సభ కరతాళధ్వనులతో మిన్నుముట్టింది.

ప్రత్యేక ఆహ్వానితునిగా విచ్చేసిన బుధ మహర్షిని ప్రసంగించవలసిందిగా కోరాడు రథవీతి.

సభను గౌరవంగా సంబోధించి గంభీరంగా మాట్లాడసాగాడు బుధ మహర్షి.

"యుద్ధానికి ముందుగా జరగవలసింది బలసమీకరణ! బలం ధన రూపంలో వుంటుంది-జనరూపంలో వుంటుంది-ఆయుధాల రూపంలోనూ వుంటుంది. ఈ మూడూ సమృద్ధిగా వుంటేనే మనం బలసంపన్నులం అవుతాము.

అందుకు చక్కని ఉపాయాన్ని భగవాన్ ఆత్రేయులవారు సూచించారు. వారి సందేశాన్ని ఈ సభకు నివేదించడానికే నేను వచ్చాను.

మహా సదస్యులారా....

వివిధ దేశ రాజన్యుల్నీ, మహర్షుల్నీ వివిధ గణాల అధిపతుల్నీ ఒకచోట సమావేశపరిచి, మనకు అనుకూలంగా తిప్పుకోవడానికి సత్ర యాగాన్ని నిర్వహిస్తే ఎంతో ఉపయుక్తంగా వుంటుందని ఆత్రేయుల వారి సూచన-

వచ్చే పూర్ణ చంద్ర పర్వదినం అనంతరం చీకటయ్యే ఏడు రోజులకు యాగకార్యంప్రారంభించి మళ్ళీ పూర్ణచంద్ర పర్వదినంతో పరిసమాప్తి అయ్యే ఆ మహాక్రతువుకు ఆత్రేయులవారే స్వయంగా యాగబ్రహ్మగా విచ్చేయనున్నారు....

వారి నేతృత్వంలో మనం సత్రయాగం నిర్వహించడం నిజంగా మన అదృష్టం...." అని ప్రసంగించాడు బుధమహర్షి!

సత్రయాగ నిర్వహణకు అనుమతి సూచకంగా సభలో యావన్మంది కరతాళ ధ్వనులు చేశారు.

సభ విజయవంతంగా జరిగినందుకు తృప్తిగా గాలి పీల్చుకున్నాడు రాజర్షి రథవీతి.

సభానంతరం సభాసదులు ఒక్కరొక్కరే నిష్క్రమించసాగారు. బుధమహర్షి మాత్రం సాలోచనగా తన ఆసనంమీద కూర్చుండిపోయాడు.

ఒకనాడు గాంధారరాజు జిగీషి-తనను బంధించి హింసించిన సంఘటన ఆయన స్మృతిపథంలో మెదిలింది....

అప్పుడు కాముకురాలైన జిగీషి భార్యలలో ఒకతె తనను కోరి వచ్చి, చీకటి నూతులలోంచి రహస్యంగా తనను విడిపించింది! ఆమెకు తనతో కామసిద్ధి కలిగేలా తానారోజున ఆశీర్వదించిన సుందరమైన ఆ అనుభూతి స్ఫురణకు వచ్చింది....!!

అదే చీకటి కూపంలో గత పదేళ్లుగా సగర రాకుమారుడు దారుణ యాతనలు అనుభవిస్తున్నాడు. అతనికి ఇరవై వసంతాలు నిండివుంటాయి-

ఆ చిరంజీవిని తనలాగే ఏ స్త్రీ అయినా రక్షిస్తే, ఆమె స్త్రీత్వానికే నమస్కరిస్తానని మొక్కుకున్నాడు బుధమహర్షి -

ఆయన అలా అనుకున్నాడో లేదో-"బుధ మహర్షికి అభివాదాలు—" అంటూ అప్సర నమస్కరించింది.

కళ్లుతెరచి ఆమెవంక చూశాడు బుధమహర్షి.

ఆమె వలన మానవ నాగరకత వికసిస్తుందని ఎందుకో అనిపించిందా క్షణంలో....బుధ మహర్షి కి!

"దీర్ఘ సుమంగళీభవ! ప్రపంచ విజేతకు పట్టపు రాణివై ప్రజల్ని కన్నతల్లి లా పాలించు తల్లీ!!" అని ఆశీర్వదించారాయన-తనకు పాదాభి వందనం చేసిన అప్సరను లేవనెత్తుతూ!

భవిష్యత్ కార్యాలకు సాక్షీభూతుడైన సూర్యభగవానుడు తథాస్తు అంటున్నాడా....అన్నట్లు వెండిలేత కిరణాలు రాజ్యసభాప్రాంగణం లోంచి ఆమె ముఖపద్మంపైన ప్రసరించాయి.

పాలకడలి పొంగినట్లు సరస్వతీనది మందహాసం చేసింది!!

*　　*　　*　　*

నీలా నదీ తీరం...

అల్లకల్లోలంగావున్న పెళ్ళిపందిరి.

దూరంగా జనం గుంపుగా మూగి గుండెలు బాదుకొంటూ పెద్దగా శోకాలు పెడుతున్నారు.

పందిట్లో కూర్చున్న పెద్దలంతా ఆతంగా అటే పరిగెత్తారు. వియ్యంకుడినన్న విషయాన్నే మరిచిపోయి, జిగీషి కూడా ఈతనేర్చినవాడు నీటిని తోసుకొంటూ ముందుకు దూకినట్లు- గుంపులోకి చొరబడ్డాడు.

గుంపుమధ్య ఓ ప్రౌఢ... అర్ధనగ్న శరీరంతో అపస్మారక స్థితిలో పడివుంది.

కొద్దిగా తెరిచివున్న నోట్లోంచి నురగవస్తోంది. ఈలలాంటి గురక విన్పిస్తోంది.

"ఎవరావిడ....? ఏం జరిగిందీ??" బిగ్గరగా అరిచాడు జిగీషి. ఆయనేం అడుగుతోందీ, ఆ భాష తెలియని ఆ జనానికి అర్థం కాలేదు.

తెలివిగల ఓ అమ్మాయి పాముకరిచిందన్నట్లు సైగ చేసింది. అది చూసి ఇర్యాదేశ ప్రభువు తలేవా తల్లడిల్లి పోయాడు.

స్పృహ కోల్పోయిన ఆ ఆడది ఆయన ముద్దుల భార్య కాబోలు... జిగీషి వెంటనే ఆమె నాడి పుచ్చుకు చూశాడు. విషయం కొంత అర్థం అయింది.

"మీ దేశంలో వైద్యులే లేరా....?" సందేహంగా అడిగాడు.

"ఉంటేమాత్రం ఏం చేస్తారు....? దెబ్బలు తగిలితే ఆకుపసర్లు పూస్తారు- జ్వరం వస్తే నీళ్ళలో ముంచి పైకి లేపుతారు. పాము కరిస్తే ఎవరు మాత్రం ఏం చేయగలుగుతారు....? అది 'రా' దేవుడిచ్చిన శాపం—" అన్నాడు నిస్సహాయంగా తలేవా!

గ్రహణ సమయంలో సూర్యుణ్ణే మింగే ఆ మహా నాగు ఎవరిని కాటు వేసినా వైద్యం వుండదనే వాళ్ళ నమ్మకాన్ని అర్థం చేసుకున్నాడు జిగీషి.

"ఈమెను నేను బ్రతికిస్తాను" అంటూ ఆమెను భుజాని కెత్తుకుని పరుగులాంటి నడకతో దగ్గర్లోనే వున్న నీలానదీ తీరానికి మోసుకు పోయాడు.

నదీ ఒడ్డున విస్తృతంగా మొలిచిన తుంగమొక్కల్ని గుప్పెళ్ళతో పెకలించి వాటి వ్రేళ్ళకు వేలాడుతున్న తుంగ ముస్తల్ని తెంచి గట్టిగా నలిపి, ఆ రసాన్ని ఆమె గొంతులో పిండసాగాడు.

గిట్టకరుచుకుపోయిన ఆమె పళ్ళను బలవంతాన విడదీయవలసి వచ్చింది.

ఈ జిగీషి ఆమె బొందిలో ఊపిరూదుతున్నాడని విస్తుపోయి చూస్తున్నారు జనం....

తుంగముస్తల స్వరసంతో వైద్యం పూర్తయ్యాక, ఆమెను తిరిగి మండుతున్న నెగళ్ళవైపు మోసుకొచ్చాడు.

రాజోచితమైన తన వేషభూషణాలన్నింటినీ దూరంగా విసిరేసి అంగవస్త్రంతో సర్పనృత్యం చేయసాగాడు.

కండలు తిరిగిన అతని శరీరాన్ని చూస్తే, 'పెళ్ళీడుకొచ్చిన కొడుక్కి తండ్రి' అని ఎవరూ అనుకోరు.

ఆశ్చర్యంలోంచి జనం ఇంకా తేరుకోక మునుపే, సింధువుల పాటేదో అందుకున్నాడు. అమృతమైన లయతో జిగీషి పాడే పాటకు అనుగుణంగా వాద్యాలు ఒక్కసారి వెర్రిగా మ్రోగాయి.

ఆడవాళ్ళు కొందరు చొరవగా ముందుకొచ్చి, జిగీషి చుట్టూ చేరి అతన్ని అనుకరిస్తూ ఆడసాగారు.

ఆటను మధ్యలో ఆపి "అసురాణాం దుహితాసి" అంటూ బిగ్గరగా అరిచి, కణ కణ మండే నిప్పుకణికల్ని అరచేతిలోకి తీసుకుని, తిరిగి మంటల్లోకి విసిరేశాడు.

అతనితో ఆట కలుపుతున్న ఇర్యా వనితలుకూడా అలాగే నిప్పు కణికలు తీసి అగ్ని గుండంలో వదిలేశారు.

ఆశ్చర్యం!! జిగీషి సృష్టించిన వీరావేశ ప్రభావంలో పడిపోయిన వాళ్ళ చేతులు కాలలేదు.

"దివస్పృథివ్యాః సంభూతా....
సాచకర్ధార సంవిషమ్—"

అంటూ కొంచెం మట్టి తీసి, స్పృహతప్పిపోయిన ఆమె నుదుట వుంచాడు.

"ఓ నాగదేవరా.... ఓ పాప దేవరా...." అంటూ మొలలో వున్న చురకత్తిని లాగి నిప్పుల్లో గుచ్చాడు. కత్తి ఎర్రగా కాలింది.

కాలిన ఆ కత్తిని ఆమె చుట్టూ ఏడు సార్లు తిప్పి, చర్మపు తిత్తిలో వున్న నీళ్ళలో ముంచాడు. నీళ్ళు చురచురమన్నాయి. ఆ నీళ్ళను ఆమె ముఖంమీద అభిషేకించాడు.

జలమహిమో.... మంత్ర జల మహిమో.... ఆమె ఒక్కసారిగా లేచి నిల్చుంది-

అందరి కళ్ళూ ఆనందంగా మెరిశాయి. అందరి కాళ్ళూ ఆనందంగా వూగాయి. అందరి నడుములూ ఉత్సాహంగా ప్రకంపించాయి-

ఆమె నడుం చుట్టూ చెయ్యివేశాడు జిగీషి! అపూర్వమైన ఆ మహావీరుని స్పర్శకు పులకించిపోయిందామె!

తన ప్రియురాలు బ్రతికిందన్న సంతోషంతో తలేవా- "చిన్నరాణీ! పామెక్కడ కరిచిందీ....??" అని అడిగాడు.

ఆమె ఏం చెప్పిందో ఆ వాద్యాల మోతలో తలేవాకు విన్పించలేదు.

తలేవాని విదుల్చుకుని, జిగీషితో కలిసి నృత్య సంరంభంలో చేరిపోయిందామె!

ఈ పెళ్ళి వేడుకలలో రాత్రి తెల్లవార్లూ తెగతాగి, మత్తెక్కువై, మదాత్యయం వచ్చి స్పృహ తప్పిన చిన్నరాణిని జిగీషి కొంత భేషజం.., కొంత ఆర్భాటమూ కలిపి తెలివిలోకి తీసుకు వచ్చాడని తలేవాకు ఈ జన్మలోనే కాదు, ఉంటే మరు జన్మకూడా అర్థంకాదు-

అర్థం అయితే అతను తలలేని వాడెలా అవుతాడు!!

  

పర్వతాలను గుట్టలుగా పోసినట్లు గాంధారం రాజ్యాలన్నింటిలోకి తన ఆస్తిగా విశాలంగా పరుచుకుంది.

అక్కడక్కడా చంద్రుడిలో మచ్చల్లా పంటచేలూ ఉన్నాయి. మూరెడంత నేలకు బారెడంత పర్వతాలు కంచెగా వేసినట్లు వాటిచుట్టూ అమరి వున్నాయి.

పర్వతాలకు అల్లంత దూరాన అన్నీ చిన్నచిన్న పల్లెలే!

మనుషులంతా అసిధారా వ్రతం పూనినట్లు నిత్య ఖడ్గధారులు.... ఒక్కడూ నేలపైన నడపడు. అందరూ అశ్వికులే!

సాటికి నిండైన నేల కాకపోవడంతో, ఏరోజు పరజాతి వాడిని దోచుకుంటే, ఆరోజే తిండి వాళ్ళకి.

వేటాడిన జంతువుల చర్మాల్నీ, అడవులలో దొరికే ఆహార పదార్థాలనూ పణ్య ప్రదేశంలోకి [సంత] తీసుకుపోయి, వాటికి బదులుగా వాళ్ళకి అవసరమైన వస్తువులు తెచ్చుకోవడం వారి నిత్యకృత్యం.

ఆ మారుమూల ప్రాంతంలోకి ఏనాడూ వ్యాపారులు ఎవరూ బైట నుంచి వచ్చిన జాడలేదు. స్థానికంగా వుండే వారిదే పైచేయి అక్కడ. వారు చెప్పిందే వెల!

నగరాలలో వ్యాపారుల మధ్య పోటీ పెరగడంతో, ఒకసారి— చీనా వ్యాపారుల కళ్ళు ఈ ప్రాంతంపైన పడ్డాయి. వాళ్ళు ధైర్యంచేసి, విలువైన వస్తు సామగ్రిని పుచ్చుకుని మొదటిసారిగా పర్వాలిటువైపు!

ఆ చీనా వ్యాపారుల్నీ, వాళ్ళు తెచ్చిన వస్తువుల్నీ, గిరిజనులు ఎగబడి వింతగా చూస్తున్నారు.

"ఈ బాణం గట్టిగా వుంటుందా....? దీని ములుకు రాతితో చేసింది కాదుగదూ....?" అడిగాడు గిరిజన నాయకుడు రుద్రుడు.

"అవును! ఇది శిలాముఖి కాదు. రాగి! రాయికన్నా గట్టిగా వుండే లోహం ఇది...." సమాధానం చెప్పారు వ్యాపారులు.

"లోహమా....?"

"అవును! రాగి ఒక లోహం"

"ఇంకా లోహాలున్నాయా....? అవి కూడా రాయికన్నా గట్టివా?"

"ఓ! ఉన్నాయి!! ఇత్తడి, వెండి, బంగారం.... ఇలా చాలా వున్నాయి. అన్నీ రాయికన్నా గట్టి లోహాలే! బంగారంతో నగలు చేస్తాం. ఇవిగో చూడండి... !"

"ఇదిగో ఇది ఇనుప లోహం. అన్నింటికన్నా గట్టిది - ఇది ఇనుముతో చేసిన నాగలి.... దీనికి తాళ్ళను కట్టి, మీ గుర్రాలకు తగిలిస్తే ఎలాంటి నేలనయినా ఇట్టే దున్నేస్తాయి" అంటూ వాళ్ళు తీసుకొచ్చిన ఆయుధ సంపత్తిని చూపించి వివరిస్తున్నారు వ్యాపారులు.

"మేం రాతి గొడ్డలినే వాడతాం. ఈ ఇనుప గొడ్డలితో చెట్లు తెగుతాయా....??" రురుడు సందేహంగా అడిగాడు.

వాళ్ళ ప్రశ్నలన్నింటికీ ఓపిగ్గా సమాధానం చెప్తున్నారు వ్యాపారులు.

ఎన్ని చూసినా ఆ కొండజాతి యువకుల దృష్టంతా పదునైన బాణాల మీదే వుంది.

వాళ్ళ చూపుల్ని గ్రహించిన ఓ వ్యాపారి—రాగి ములుకు బాణాన్నొకదాన్ని సంధించి, దూరంగా ఉన్న చెట్టుకు గురిచూసి వదిలాడు. బాణం రివ్వున వెళ్ళి మానులో దిగబడింది.

"ఇలాంటి బాణాలతో వేటాడితే, ఎనుబోతుల డొక్కలు ఈమూల నుంచి ఆ మూలకి చీరుకుపోవూ....?" అంటూ వాళ్ళను ఉత్సాహపరుస్తున్నాడా వ్యాపారి.

తమదగ్గరున్న రకరకాల ఆయుధాలను వాళ్ళకు పరిచయం చేస్తున్నారు వ్యాపారులు.

"దీన్ని మా భాషలో 'కో' అంటాం." అంటూ నాగలి ఆకారంలో వున్న బల్లెంలాంటి శస్త్రాన్ని చూపించారు. "దీని మొన దిగబడితే తిరిగి పెకలించడానిక్కూడా వీలవదన్నమాట" అన్నాడు ఇంకో వ్యాపారి.

"రథంమీద నుంచుని సింధూ ఆర్యులైతే ఈ ఆయుధాన్ని అద్భుతంగా ప్రయోగిస్తారు—ఇది తగిలితే బ్రతకడం కల్ల" వాళ్ళని మరీ రెట్టించ సాగారు వాళ్లు.

"రథాలా?" సందేహంగా అడిగాడు ఓ చిన్నోడు.

"రథాలంటే గుర్రపుబళ్లలేరా...! మనం నేలమీద నిలబడి అడ్డొచ్చినోణ్ణి ఏసేస్తాం....ఆళ్ళు రథాలమీద తిర్గ్గా కూకోని ఎత్తులా పైఎత్తులా ఏసుకొంటారు—" చిన్నోడికి సమాధానం చెప్పాడు రుద్రుడు.

"అది సరేగాని కట్టుకోవడానికేనా ఈ రంగు రంగుల బట్టలు?" మాటమారుస్తూ అడిగాడు మరో గిరిజన యువకుడు-

"ఇవి చాలా విలువైన బట్టల్లే," కొంచెం విసుగ్గాఅన్నాడువ్యాపారి.

"నాకూ మీలాగే ఈ బట్టలేసుకొని గొప్పగా తిరగాలనుంది...." దీనంగా అన్నాడు చిన్నోడు.

"అలాగేం? గొప్పగా తిరగడానికి మీకు ఎన్ని ఆవులున్నాయి?"

"మాకు ఆవులూ, గుర్రాలూ, ఒంటెలుకూడా వున్నాయి-"

"అయితే ఈ బట్టల్లో నీకు నచ్చిన ఒక జత తీసుకో-బదులుగా ఓ 'పాడి ఆవు' ఇస్తావా?"

"ఆవునే....? అమ్మో! మా నాన్న తంతాడు!!"

"ఏం? ఆవు ఈ బట్టలకన్నా విలువైందా....?"

"కాదామరి...? మా ఆవు ఇంకా పదేళ్ల పాలిస్తుంది. మీ బట్టలు మురికిపట్టి ఏడాదికే చిరిగిపోతాయి—" రెట్టించాడు చిన్నోడు.

విసిగిపోయారింక వ్యాపారులు.

"బాబూ....!!మీకూ, మీ ఊరికీ ఒక నమస్కారం. బుద్ధి తక్కువై మీ దగ్గరకొచ్చాం.... ప్రొద్దున్నుంచీ వాగినవాళ్ళం వాగుతూనే ఉన్నాం. అమ్ముడుపోయిందిమాత్రం శూన్యం—" విసుక్కున్నాడో వ్యాపారి.

ముఖం మాడ్చుకున్నాడు చిన్నోడు.

"చూశావా తాతా....! వీళ్ళకెంత పొగరో....!! మన దగ్గరికొచ్చి మనల్నే వెక్కిరిస్తున్నారు-" అన్నాడు రురుడితో-

చూద్దాంలే! ఆ పొగరెంతసేపు నిలబడుద్దో...." రౌద్రంగాచూస్తూ అన్నాడు రురుడు. ఆ చూపులో అర్థాలు చాలావున్నాయి. వాటి పర్యవసానం ఆ రాత్రికే తేలిపోతుంది....!!

రాత్రి మూడుఝాములు గడిచిపోయాయి!

జొలికోడి కొక్కొరోకో.... అంది.

మంచుతెరలలో కొండప్రాంతం నిస్తబ్దుగా వుంది-

సేనా వ్యాపారులు విడిదిచేసిన శిబిరాలకు దూరంగా, చెట్లచాటున రాతి విగ్రహాల్ని చెక్కినట్లు రురుడి మనుషులు చెట్టుకొకరుగా నిలబడి వున్నారు.

ఆకు కదుల్తున్న అలికిడి లేదు-

దోపిడీ విద్యలో ఆరితేరిన రురుడి మనుషులు ఊపిరి ఆడే శబ్దాన్ని కూడా వినబడనీయరు.

అందరికన్నా ముందుగా, పెద్ద మర్రిచెట్టు చాటున రురుడు నిలబడి పరిస్థితి అంచనావేస్తున్నాడు.

వ్యాపారుల శిబిరాలు మంచులో తడిసి వెన్నెల కాంతికి తెల్లగామెరుస్తోన్నాయి. కానీ....ఆశ్చర్యం.... శిబిరాలకు వెలుపల ఏ ఒక్కడూ కావలి కూడా లేడు!!!

ఆయుధాలున్నాయన్న ధీమాతో లోపల మత్తులో తూగుతున్నారా? లేక ఏదైనా రహస్య స్థావరంలోంచి తమను గమనిస్తున్నారా....?? లోపలికి దూసుకుపోవడమా....వెనక్కి మరలిపోవడమా....??? శక్తివంతమైన వాళ్ళ ఆయుధాలను తన నోట గొడ్డళ్లు ఎదుర్కొనగలవా...? ఏమైనా తెగించక తప్పదు...!!!

ఒక నిర్ణయానికి వచ్చి—తన అనుచరులవైపు తిరిగి 'హుర్రే' అంటూ అరిచాడు.

అతని వెంటే అతని అనుచర బృందం ముందుకు దూసుకుపోయారు.

కన్ను మూసి తెరిచేలోగా, రాతిగొడ్డళ్ళతో చర్మ శిబిరాలను చీల్చి లోపలకు దూకారు...

విచిత్రం...లోపల ఆయుధాలూలేవు-వ్యాపారులూ లేరు...

మళ్ళీ నిశ్శబ్దం...నిస్తబ్దత.. నిర్లిప్తత...కొన్ని రెప్పలపాటు భయంకర విరామం...

ఆశ్చర్యంలోంచి తేరుకోలేకపోయాడు రురుడు - చీనా వ్యాపారులు ఏమైపోయారు...?

అంతలోనే శిబిరాల వెలుపలనుంచి పెద్దగా అరుపులు వినిపించాయి- "మమ్మల్నే మోసం చేయగలర్రా" అంటూ బిగ్గరగా అరుస్తూ దగ్గరగా వున్న చెట్లమీంచి కట్టలుగా కిందికి దూకారు వ్యాపారులు.

వాళ్ళ చేతుల్లోంచి భయంకరమైన రాగిములుకు బాణాలు వింటినారిని తన్నుకుని రివ్వున గుడారాల్లోకి దూసుకుపోయాయి.

లోపల్నుంచి రురుడి మనుషుల హాహారవాలు...కొండల్ని తాకి ప్రతిధ్వనించాయి—

"అందరూ నేలకు బల్లుల్లా కరుచుకుపోండి—" అరిచాడు రురుడు.

అప్పటికే వ్యాపారుల శరపరంపరకు కొందరు ఆహుతైపోయారు. వాళ్ళ శవాలను మీదవేసుకుని నేలకు అంటుకు పడుకున్నారు రురుడి మనుషులు—

కొన్ని క్షణాలు బాణాలహోరు నిరాఘాటంగా సాగింది.

మళ్ళీ నిశ్శబ్దం....

ఇలా జరుగుతోందో లేదో... గుడారం బైటనుంచి పెద్ద కలవరం విన్పించింది. అప్పటివరకూ వికటాట్టహాసాలు చేసిన చీనా వ్యాపారులు హాహాకారాలు చేయసాగారు.

"ఇంక లేపండ్రా....!" హుషారుగా అన్నాడు రురుడు—

గుడారాలమీద దాడిచేసేప్పుడు తన మనుషుల్ని రెండు బృందాలుగా విభజించాడు రురుడు. మొదటిబృందాన్ని రురుడే స్వయంగా గుడారాలవేపు నడిపించుకువెళ్ళాడు. రెండో బృందం చెట్లచాటున నక్కి అక్కడే వుండి పోయింది.

రురుడు ఇంత ముందుజాగ్రత్తపడతాడని ఊహించని వ్యాపారులు అమాయకంగా చెట్లమీంచి దిగి బాణాలు ప్రయోగించారు. తమ వెనుక మృత్యువు పొంచివుందని వాళ్ళు గమనించేసరికే అంతా అయిపోయింది....

రాతిగొడ్డళ్ళముందు రాగిబాణాలు తలలువంచాయి.

అధిక లాభాలకోసం అత్యాశతో ఇక్కడకు చేరిన ఆ వ్యాపారులు తలలు తుంచుకు నేలకొరిగారు.

ఎక్కడో చీనాదేశంలో పుట్టి-దేశాలబట్టి తిరుగుతూ ఇంతదూరం వచ్చిన ఆ నాగరకతా వ్యాపారులకథ....ఈ కొండరాళ్ళ మధ్య ఇలా పరి సమాప్తమైపోయింది.

తమవెంట తెచ్చిన విలువైన ఆయుధసంపత్తిని వ్యాపారులుఎక్కడ దాచారోనని ఆత్రంగా వెదుక్కోసాగారు రురుడి మనుషులు—

మర్నాడు పగలంతా వెదికినా వాళ్ళకి వాటిజాడ తెలియలేదు—

విసుగూ విరామం లేకుండా చెట్టూ-పుట్టా అన్నీ వెదకారు—

మహత్తరమైన ఆయుధాలరహస్యం ఆ వ్యాపారులతో నేభూస్థాపితం అయిపోయిందని రురుడు గమనించేసరికి సూర్యుడు అస్తమించాడు!!

*　　　*　　　*　　　*

"చరిత్రలో మనిషి ఆ విధంగానే ఎందుకు ప్రవర్తించాడంటే, ఇందు కని.... చెప్పడం ఒక్కోసారి కష్టమే అవుతుంది— మరో రకంగా ఎందుకు చేయలేక పోయాడో.... అనుకుంటాం!

చెట్టుమీద పిడుగు పడుతుంది. చెట్టు తగలబడ్తుంది— ఆ మంటల్ని గాలి ఎగదోస్తుంది. ఆ గాలి అడివినంతా దావానలంలా దహిస్తుంది. అంతా బూడిదై మిగుల్తుంది. నేల సారవంతమై పంటలు వెర్రిగా పండుతాయి.

కానీ, అక్కడితోనే ఈ కథ ఆగదు—

చెట్లు పోవడం వలన వరదలొస్తాయి—పండిన పంట చేతి కంద కుండా కొట్టుకు పోతుంది. సర్వం నాశనం అవుతుంది.

ఇదంతా అనుపల్లవిలా జరిగిపోవడం లేదా....?

మానవ చరిత్ర కూడా అంతే!

ఈ అపరిపక్వ అపరిష్కృత చరిత్ర గమనంలో మనిషొక బిందువు. బయల్దేరిన చోటికి చేరడమే అతని గమ్యం...." అన్నాడు బుధమహర్షి. ఆ మాటలంటున్నప్పుడు ఆయన నయనాలు అశ్రు పూరితా లైనాయి—

ఆయన చెప్తున్న మాటలు వింటూ, సందేహాలు తీర్చుకొంటోంది అప్సర.

"అయితే ప్రజా పాలకులైన రాజులూ — మహర్షులూ— వీళ్ళంతా ఈ నియతిలో ఒక భాగమేనా....? సమాజంలో అరాచకానికి వీళ్ళ బాధ్యత లేదంటారా మహర్షీ....?" వినయంగా ప్రశ్నించింది అప్సర.

బుధమహర్షి చిన్నగా నవ్వి అన్నాడు—

"రాజుల్నీ, మహర్షుల్నీ ఒకే సూత్రం బంధించలేదు తల్లీ....! రాజుకీ, మహర్షికీ—జిగీషికీ, మీ తండ్రి రథవీతికీ ఉన్నంత తేడా ఉన్న దమ్మా....!'

జాతులు అనాగరికంగా వుండిపోయి, కిరాతకులుగా తయారవడానికి వాళ్ళనాయకులే—లేక రాజులే కారణం! కొందరు ప్రభువులు.... పోనీ, యజమానులు.... తమ ప్రజల్ని ఎదగనీయరు. ప్రజలు చైతన్య వంతులైతే పాలకుల ఆటలు సాగవని వాళ్ళ భయం!

రాచరికం విషవృక్షం వంటిదమ్మా! అది సమూలంగా నాశనం అయి, ప్రజలే పాలకులుగా వుండే వ్యవస్థని రూపొందించ చేస్తే గాని మాన వాళికి విముక్తి లేదు—"

మహర్షి మాటల్లో ఆవేదనని అర్థం చేసుకుంటో, మౌనంగా వింటోంది అప్సర — మానవజాతి మారణహోమం జరగబోతోందని మహర్షి మనసు కలవర పడ్తున్నట్లు గ్రహించిందామె!

"నరుడు మానవుడై, మానవతా వికాసాన్ని, పొందే అవకాశమే లేదంటారా మహర్షీ....!" బాధగా అడిగింది అప్సర.

దీర్ఘంగా నిట్టూర్చాడు బుధమహర్షి —

"ఈ సృష్టి మొదలై ఎంత కాలం అయిందో తెలియదు. మనకు తెలిసినంత మేర దృష్టి సారిస్తే మనందరం పుట్టిన ఈ పవిత్ర భూమి ఆదినించీ కర్మభూమి.... అని గ్రహించగల్గుతాం!

ఈ నేలను పుట్టిన వాళ్ళు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలతో ధర్మబద్ధులై వుంటారు. అది సింధూమాత మనకు ప్రసాదించిన వరం తల్లీ!!

పవిత్ర చరిత్ర కలిగిన సరస్వతీనదీ కరుణా కటాక్ష వీక్షణాల వలన మరే జాతీ సంతరించుకోలేనంత అత్యున్నత నాగరికతా విశేషాలు ఈ నేల పైన పరిఢవిల్లుతున్నాయి—

అయితే, పంట చేలలో కలుపు మొక్కలూ వుంటాయి. మానవ చరిత్రలో విషవిందువు జిగీషుడు — ఇలాంటి వాడు ప్రతి యుగంలోనూ ఒక్కడైనా వుంటాడు...." అన్నాడు.

అప్సర వింటోంది—

"మీరన్నది నిజమే స్వామీ! అడవే తల్లిగా, సెలయేరే చెల్లిగా, కొండయే తండ్రిగా, చెట్లు చెలులుగా వన దేవతలా బ్రతికిన ఆనాటి మానవులు ఎంత స్వేచ్ఛను అనుభవించారో....!

నగరాలలో, రాతి సౌధాలలో మనల్ని మనం బంధించుకుని, మనసును సంకుచితం చేసుకుంటున్నాం—

మన వర్ణం వాడుకాదనీ, మన వర్గం వాడుకాదనీ సాటి మనిషిని చులకనచేసి, బానిసగా ముద్రవేసి నీచంగా చూస్తున్నాం....

ఏదో ఒక రోజు ఈ బానిసలందరూ ఏకమై తిరుగుబాటు చేయరా మహర్షీ....?" ఆవేశంగా అంది అప్సర.

ఈ జాడ్యం ఇలానే కొన్ని శతాబ్దాల పాటు ఈ దేశాన్ని పీడిస్తుందేమోనన్న ఆందోళన ఆమె మాటల్లో స్పష్టంగా కన్పిస్తోంది—

"నువు సరిగానే ఊహించావు పుత్రీ! వాడు కిరాతకుడైనా, అనార్యుడైనా, కృష్ణత్వక్ అయినా, మనం గౌరవించి సముచిత స్థానాన్ని కల్పించి నాగరికతా ఫలాల్ని సమానంగా అందించలేనంత కాలం మన జాతి అజ్ఞానాంధకారంలోంచి బైటపడలేదు తల్లీ!

మనుషులంతా సౌమనస్యంతోనూ, సౌహార్దంతోనూ, సంయమనంతోనూ వ్యవహరించ గల్గిన నాడు ఈ కల్లోలాలూ, దారుణ హాహాకారాలూ వుండవమ్మా...." అన్నాడాయన.

మహర్షి మాటలు వింటూ, మనుషుల మధ్య మానవతా బంధాలు ఏర్పడడానికి తనవంతు కర్తవ్యం గురించి ఆలోచిస్తోంది అప్సర—

(6)

"కుమారీ! నరుడు మానవుడు కావాలంటే అతను జ్ఞానాన్ని సంతరించుకోవాలి—పాప పుణ్యాల వ్యత్యాసాన్ని గ్రహించడమే జ్ఞానం! మానవతను పెంచుకోవడమే జ్ఞానం!! అలాంటి జ్ఞానాన్ని నువ్వు పది మందికీ పంచగలవా అమ్మా...." అనునయంగా అడిగాడు బుధ మహర్షి —

"తప్పకుండా చేస్తాను ఆర్యోత్తమా! అందుకు కావలసిన మానసిక శక్తిని పొందేలా ఆశీర్వదించండి—" అంటూ మహర్షి పాదాలను స్పృశించింది అప్సర—

"ఒక వీరుడికి భార్యగా, మరొక వీరుడికి తల్లిగా ప్రపంచ శాంతికి నీవంతు కర్తవ్యం నిర్వర్తించు తల్లీ—" అన్నాడు ఆశీర్వదిస్తూ మహర్షి బుధుడు.

"కానీ, ఆ వీరుడు అటువంటి రాజుగానో, లేక మరో ప్రజా పెదకుడుగానో ఉండడు స్వామీ! పూర్తి ఆటవికుడైన ఒక అనాగరిక యువకుడికి భార్యగా, దాసిగా, మంత్రిగా, సహచారిగా నావంతు ధర్మాన్ని నేను నిర్వహిస్తాను! అతన్ని ప్రపంచ విజేతను చేస్తాను — సమస్త మానవాళినీ ఒక ఏలుబడికింద తెచ్చి జాతుల మధ్య వైషమ్యాలు లేకుండా నివారిస్తాను. పంచభూతాల సాక్షిగా నేనిదే ప్రతిజ్ఞ చేస్తున్నాను—" అని లేచి నిల్చుంది అప్సర!

ఆమె మాటలకు అవాక్కయి, ఏమని చెప్పాలో అర్థం కాక, ఆమె వెడుతున్న మార్గాన్నే చూస్తుండి పోయాడు బుధుడు.

విధి విచిత్రమైంది. కార్య కారణాలు అను వల్లవిలా జరిగిపోతుంటాయి.

ఎవరు ఎప్పుడు ఎందుకు ఎలా ప్రవర్తిస్తారో విశ్లేషించి వివరించడం కష్టం అందుకే!!

* * *

ఇర్యా దేశపు పెలమేళ్ళ సమూహాలు వాగుల్లై, వంకల్లై ప్రవహించినట్లు కన్నెపిల్లల ఊరేగింపు గలగలా సాగిపోతోంది—

పెళ్ళి వారికి వీడ్కోలు చెప్పడానికి దేశం దేశమే ఊరేగి కదుల్తోంది—

ఏడు తెల్లని గుఱ్ఱాలను పూన్చిన రథం మీద కొత్త పెళ్ళికూతురు యోజితను తీసుకుని తన దేశానికి బయలుదేరాడు 'త్వష్ట'.

రథానికి ముందు కన్నెపిల్లలు శృంగార గీతాలు పాడుతూ నృత్యాలు చేస్తూ సాగిపోతున్నారు. వాళ్ళను అనుసరిస్తూ వాద్యాలు విచిత్ర నాదాలు చేస్తున్నాయి.

హంసలా నడవడం అంటే వీళ్ళనే చూడాలి—

కొమ్మల మీంచి పాదాలదాకా శరీరానికి అంటుకు పోయేలా తొడిగిన చర్మపు అంగీలు వడి వడి నడకని అడ్డుకొంటుంటే, అడుగులో అడుగులు వేసుకొంటూ సాగిపోతున్నారు వాళ్ళు!

పాటా, వాద్యమూ— వెరసి రెండింటి కోలాహలమూ జలపాతం ఉరుకుతున్నట్టే వుంది—

విశాలమైన రథంమీద గుండ్రని చర్మ శిబిరం వేశారు— అప్పటికి వాళ్లకి తెలిసిన సమస్త సుగంధ ద్రవ్యాల్నీ తెచ్చి ధూపం వేశారు. పట్టి వేళ్లతో శిబిరాన్నిచుట్టూ మూసివేశారు.

లోపల తెరలు వ్రేలాడుతుండడంతో, పట్టివేళ్ల సందుల్లోంచి తొంగిచూసే ఆ ఆడపిల్లలకు లోపల ఏమీకన్పించడంలేదు.

కళ్ళారా—ఆ త్వష్ట వీరుని అంగ సౌష్ఠవాన్ని మరొకసారి.... మళ్ళీ ....మళ్ళీ.... చూసుకోవాలని వాళ్ల ఆశ....

రాగిరంగు శరీరం.... పసిడి నేత్రాలు ... వల్లని ఒంకీలజుట్టూ.... అరదాన్ని మరిపించే బలమైన రొమ్ములూ....ఉండీ లేదనిపించే వడుమూ... నడుముకు అంటుకు పోయినట్లున్న సన్నటి కడుపూ.... ఎత్తయిన భుజాలు

.... మోకాళ్లను దాటిన చేతులూ.... "భారతీదేవి ముద్దుల పుత్రుడు–ఈ త్వష్ట...." అనుకుంటున్నారు ఆర్యా పడుచులు!

త్వష్ట దృష్టిలో పడాలని, అతన్ని ఆకర్షించాలని ఈ పెళ్ళిమూడు రోజులూ శ్రమపడని ఆడది లేదక్కడ!

జిగీషికి అనంతమయిన గౌరవాలతో ప్రత్యేక రథాన్ని ఏర్పరిచారు. దానిమీద అందరినీ ఆశీర్వదించే సూర్యభగవానుడిలా దర్శనం ఇస్తూ కూర్చున్నాడు జిగీషి. అతనికి తోడుగా అతని చిరుతపులి బుద్ధిగా పాదాల దగ్గర పడుకుని వుంది.

"ఉంటే ఇలాంటి నాయకుడు ఉండాలి... బ్రతికితే ఇలాంటి ప్రభువు రాజ్యంలో బ్రతకాలి..." అనుకుంటున్నారు జనం! దూరపుకొండలు నునుపు- అందుకే! వాళ్ళ అమాయకత్వాన్ని చూస్తే జిగీషికే నవ్వొచ్చింది!

సూర్యాస్తమయం అవుతోంది...

"ఇంక ప్రయాణం ఈ పూటకి చాలించి విశ్రాంతి తీసుకుందాం..." అన్నాడు తలేవా!

మరోపూట ప్రయాణిస్తేగాని సముద్రంరాదు- సముద్ర తీరంవరకూ వాళ్ళని సాగనంపి, నావనెక్కించిగానీ వెనక్కిపోవడానికి ఎవ్వరూ ఇష్టపడడంలేదు. చేసేదిలేక శిబిరాలు వేయించి, భోజనాది ఏర్పాట్లు సిద్ధంచేయమన్నాడు తలేవా.

గుర్రాలను పచ్చికబయళ్లలోకి వదిలి విశ్రాంతిగా కాస్త నడుం వాల్చారు పురుషులు.

రాత్రి ప్రొద్దుపోతోంది- ఇంకా వంటలు సిద్ధంకాలేదు. ఒక్కొక్కరే సన్నగా కునుకు తీస్తున్నారు. ఆ అలసటమీద పులొచ్చినా, సింహం వచ్చినా పట్టించుకునే స్థితిలో లేరెవరూ...!

ఆడవాళ్ల పరిస్థితి మరీ ఘోరంగావుంది. త్వష్టవీరుడి దర్శనం కూడా కాలేదనే నిరాశ ఒకవైపు- అందనంత ఎత్తున కూర్చుని జిగీషి తమను క్రీగంటనైనా చూడలేదనే బాధ ఇంకొకవైపు- ఏకధాటిగా నడిచీ నడిచీ ప్రాణాలు సోలిపోవడం మరోవైపు... ఒకరి కాళ్లను ఇంకొకళ్లు నొక్కుకుంటూ, మనసులో దిగులుని చెప్పుకొని పరస్పరం ఊరడిల్లచేసు కొంటున్నారు. 'త్వష్ట' ఒక్కసారిఅలావచ్చి కన్పిస్తే అన్ని దిగుళ్ళూ ఇట్టే మాయమైపోతాయి..!

అందరూ అలా నిద్రలోకి జారుతూండగా-

ఏదో జలపాతం ఒక్కసారి లోయలోకి పడుతున్నట్టు పెద్దపెట్టున అరుపులూ కేకలూ విన్పించాయి. అంతవరకూ కేరింతలాడిన ఆడవాళ్లు గగ్గోలు పెట్టసాగారు· నడిచీ నడిచీ అలిసిపోయిన సైనికులు ఓపిక కూడగట్టుకుని వీలయినంత వేగంగా పారిపోసాగారు.

పెళ్ళి ఊరేగింపు అల్లకల్లోలం అయిపోయింది.

తలేవా ఉలిక్కిపడి తన శయ్యమీంచి లేచినిల్చుని బిత్తరపోయి చూశాడు!

"ఏం జరిగిందిరా! చెప్పి చావండిరా!!" అని గుండెలు బాదుకొంటూ అరవసాగాడు-

జిగీషి తన ఒరలోంచి చటుక్కున పొడవాటి కత్తినిలాగి చీకట్లోకి పరిగెడుతూ "త్వష్టా! బైటకు దూకెయ్!" అని అరిచాడు. జిగీషిని అనుస రిస్తూ, అతని పెంపుడు పులి కూడా అతని వెనకే దూకింది.

తలేవా ఇంకా అక్కడే నిలబడి, "ఏం జరిగిందో నాకైనా చెప్పి చావండిరా" అంటూ పారిపోతున్న ఒక్కొక్క సైనికుణ్ని ఆపి బతిమాల సాగాడు. వాళ్ళు విసుగ్గా అతన్నిత్రోసి రాజని చెల్లాచెదురుగా పరిగెత్త సాగారు.

"ఏం జరిగిందో నేను చెప్తాన్రా! ఇటు చూడూ!" అంటూ వికటాట్ట హాసంచేసి తలేవా మీదకు దూకాడు తర్షి!

తలేవా ఆజన్మ శత్రువు తర్షి! తలేవాని తుదముట్టించి, అతని రాజ్యాన్ని కబళించేందుకు చాలాకాలంగా అదనుకోసం వేచివున్నాడతను- ఇన్నేళ్ల తర్వాత ఇలా, ఈ రాత్రివేళ- కూతురు పెళ్ళి ఊరేగింపులో నిరాయుధంగా దొరికిపోయాడు తలేవా.

తర్షి ని చూస్తూనే, "ఏనుగు కలగన్నట్లు... "అయ్యబాబోయ్-" అని అరుస్తూ ఒకేఒక ఉదుటున చీకట్లోకి దూసుకుపోయి మాయమైపోయాడు తలేవా! అతన్ని వెన్నాడుతూ తర్షి కూడా ఆ చీకటిలోనే పరిగెత్తాడు. ఎంత వెదికినా తలేవా జాడ తెలియలేదు!!

ఇది ఇలా జరుగుతుండగా... చీకటిలోకి తప్పుకున్న జిగీషి చెట్టూ పుట్టా చాటుచేసుకుంటూ, నెమ్మదిగా అడుగులువేస్తూ ముందుకు కదులుతున్నాడు. దూరంగా మేస్తున్న గుర్రాలమీదే వుంది అతని ధ్యాసంతా!

ఒక్క గుర్రం చేతికందితే ఆ హైహయ నాయకుని అపగలిగే వాడెవ్వడూ లేడు.

కానీ, విధి వేరే విధంగా వుంది. వాన్ని జిగీషిలాంటివాడు తప్పించ గలగడం అసాధ్యం!

ఈత నేర్చినవాడు ఏటిలోనే పోతాడన్నట్లు— చీకటిలో తారట్లాడుతున్న జిగీషి ఓ మామూలు సైనికుడికి దొరికిపోయాడు!

ఆకలిగా వున్నప్పుడు ఆహారాన్ని చూసిన భల్లూకంలా జిగీషిని గట్టిగా పట్టుకుని "ముసలి కుక్క దొరికాడు...." అని బిగ్గరగా అరిచాడు.

ఆ సైనికుడి పట్టు బలంగా వుంది. విదుల్చుకుని కత్తి దూసేంత అవకాశం దొరకడంలేదు.... చాలా ఖంగారుపడిపోయాడు జిగీషి. ఇలాంటిది జరగడం ఆయన జీవితంలో ఇదే ప్రథమం!

"మెరుపుదాడులుచేసి ఇలా ఎందరు రాజుల్ని నేను మట్టుపెట్టలేదూ? నూరుగొడ్లను తిన్న రాబందులా అయిపోయాను...." అనుకున్నాడు జిగీషి.

కానీ, అది స్మశాన వైరాగ్యమేగానీ....పరివర్తనో, పశ్చాత్తాపమో కాదని అతనికి తెలుసు! అందుకే తప్పించుకునే ఉపాయాల గురించి దిక్కులు చూస్తున్నాడు.

ఇంతలో ఎక్కడినించి వచ్చిందో తెల్లని గుర్రంపైన ఓ దేవతా మూర్తి.... ఎప్పుడు నేర్చిందో ఖడ్గాన్ని ఒడుపుగా పుచ్చుకోవడాన్ని.... ఎలా సాధించిందో ఒకే వేటుతో మనిషిని నిలువునా చీల్చేయడాన్ని....

సంభ్రమాశ్చర్యాలతో చూస్తూండగానే, ఆమె నేర్పుగా వేసిన కత్తి వేటుకు జిగీషిని పట్టిన సైనికుడు రెండుగా చీలిపోయాడు.

"చిన్నరాణీ....! నువ్వా....?!" మసక చీకటిలోనే ఆమెను పోల్చుకున్నాడు జిగీషి.

ఆలస్యం చేయకుండా చిన్నరాణి తన గుర్రపు కళ్ళాలను జిగీషి చేతికి అందించి వెనక్కి జరిగింది. కళ్ళాలను అందుకున్నాడు. రయ్యిన ఎగిరిదూకి ఆ అశ్వరాజాన్ని అదిలించాడు.గుర్రం నాలుగుపాదాలా గాలిలోకి లేచింది

జిగీషి, తలేవాలను వెన్నాడుతూ వస్తున్న 'తర్షి' సైన్యం దూరం నుంచే బాణాలూ, శూలాలూ గుప్పిస్తున్నారు. వాటిని తప్పించుకొంటూ జిగీషి చాకచక్యంగా గుర్రాన్ని నడుపుతున్నాడు.

సరిగ్గా అదే సమయానికి తన యజమానిని వెదుకుతూ అక్కడికి వచ్చింది జిగీషి పెంపుడు పులి! వస్తూనే భీకరంగా అరుస్తూ తర్షి సేనకు ఎదురు నడిచింది.

అంతటి మహావీరులూ చీకటిలో పులి అరుపు విన్పించేసరికి ఒక్క-క్షణం బి_త్తరపోయి ఆగిపోయారు. ఆ కా_స్త వ్యవధిలోనే ఎవ్వరికీ అందనంతదూరం వెళ్ళిపోయారు జిగీష....చిన్నరాణీ....!

"నాకు ప్రాణదానంచేసి నన్ను ఋణగ్రస్తుణ్ని చేశావు చిన్నరాణీ!" అన్నాడు జిగీషి. చిన్నరాణి మాట్లాడలేదు. గుర్రం వేగంగా దూసుకుపోతోంది. అతన్ని కావులించుకుని ఆ స్పర్శలోని మాధుర్యాన్ని అనుభవిస్తోందామె!

అతన్ని బిగిగా కౌగిలించుకున్న ఆమె పట్టు క్రమేణా సడలిపోసాగింది.

ఆమె మౌనంగా వుండిపోవడంతో ఆందోళనగా వెనక్కి చూశాడు జిగీషి-

స్తంభించిపోతున్న శరీరంతో ఆమె అతని ఒడిలోకి ఒరిగిపోతోంది. ఆమె వెన్నులో పిడిబాకు దిగబడి నెత్తురు చిమ్ముతోంది-

"రాణీ!" బిగ్గరగా అరిచాడు జిగీషి- రాణి పలకలేదు.

తనతోకలసి వచ్చేస్తూన్న ఆ చిన్నరాణి వెన్నులో బాకు నాటినవాడు... చీకట్లో ఓ గోతిలో నక్కి- అంతా గమనిస్తున్న 'తలేవా'యేనని జిగీషికే కాదు- ఎవరికీ తెలియదు.

జిగీష్టి కౌగిలింతలో స్పర్శని తనివితీరా పొందడంకోసం, తన ప్రాణాలను ఎంతసేపు ఉగ్గబట్టుకుందో.... ఆ ప్రేమలోకపు చిరంజీవి....!!

అది ఆమెకు మరణం కాదు- జీవితం....!!

# 2

సరస్వతీ తీరంలో సత్రయాగం ప్రారంభం అయింది-

బ్రహ్మర్షులు, రాజర్షులు, వివిధ రాజన్యులతో యాగవాటిక కిటకిట లాడిపోతోంది-

విభు, ప్రభు, బహు, భూయాః పూర్ణ, పూర్ణత, రాక్షితులనే ఏడు రకాల ధాన్య సంపుటిని యాగ సమయంలో సోముడికి అర్పించేందుకు సిద్ధం చేశారు-

సోముడు రాజుగా ఓషధుల్ని భూమిలో ప్రవేశపెట్టాడని వారి నమ్మకం!

ఋక్మంత్రాలను "స్తోత్ర సంఘం" గానం చేస్తోంది.

భగవాన్ ఆత్రేయులవారు యాగ కార్యాన్ని ప్రారంభించారు.

యాగం నిరాఘాటంగా సాగిపోతోంది....

ఆరోజు సాయంకాలం-

సాహితీ గోష్ఠి నిర్వహించుకోవడానికి అనువైన సమయం కావడంతో సాహితీ ప్రియులైన మహర్షులు కొందరు విడిగా సభతీరి కూర్చున్నారు-

సభలో మహర్షులకు దీటుగా ప్రకాశిస్తున్న స్త్రీలు కూడా వున్నారు- రోమశ, లోపాముద్ర, అదితి- అపాల, శిఖండిని, ఘోష, దక్షిణ, వాగ్దేవి, శ్రద్ధ.... ఇలా ఎందరో నారీ రత్నాలు.... ఎన్నెన్నో దేశాలనుంచి వచ్చిన వారు.... అందరూ అన్నో ఇన్నో ఋక్కులకు కర్తృత్వం నెరపినవారే!

ఎత్తయిన వేదికపైన ఆత్రేయమహర్షి అధ్యక్ష స్థానాన కూర్చున్నాడు-

సభారంజకత్వం గొప్ప కళ! ఆ కళలో నిష్ణాతులైన మహర్షులు తమ ఋక్కులను చదివి ప్రశంసలు పొంది వేదిక దిగి వస్తున్నారు-

మైత్రావరుణుడైన వశిష్ఠమహర్షి "తానీ దహానీ బహులాన్యా సన్నా...." అంటూ ఒక ఋక్కును గానం చేశాడు-

అందులోని భావ గాంభీర్యానికి ఆత్రేయుడు ముగ్ధుడైనాడు. "వేశ్యాలోలుడే అయినా భర్తని పతివ్రత విడిచి పెట్టదు కదా.... ఓ ఉషోదేవీ! నిన్ను నిర్లక్ష్యంచేసి నీ భర్త సూర్యుడు ఇంకా "రాత్రి కాంత"తో కులుకుతూనే వున్నాడు.... అయినా అతనికోసం ఇంకా ఎదురుచూస్తూనే వున్నావా...??" అని చెప్పిన ఈ ఋక్కులో ఎంతో కవిత్వం వుందని మెచ్చుకొన్నాడు ఆత్రేయుడు-

వశిష్ఠులవారి మార్గాన మరికొందరు మహర్షులు ఉషస్సును వర్ణించి ప్రశంశలు పొందారు-

ఆ ఆనందంలో మైమరచిపోయిన మరొక మహర్షి ఉత్తర ధ్రువంలో చాలాకాలం విడువకుండా కన్పించే దీర్ఘ ఉషస్సును కీర్తించ సాగాడు-

"దేవయాన మార్గం నాకు కన్పిస్తోంది- ఉషఃకాంతకు కిరీటమై మెరుస్తోన్న తేజస్సు [అరోరా బోరియాలిస్] తూర్పు దిక్కున నన్ను మురిపిస్తోంది-" అంటూ రాగయుక్తంగా పాడి విన్పించాడు-

ఆయన తన ఋక్కును పూర్తి చేశాడో లేదో- ఆగ్రహంగా ఓ మహర్షి లేచి నిల్చుని- "ఇది అశాస్త్రీయంగా వుంది" అని అరిచాడు!

"ఆర్యా! భూమికి నడినెత్తిన ఉత్తరధ్రువం వుంది. అక్కడ్నించి చూస్తే సూర్యుడు దక్షిణంనించి ఉదయిస్తున్నట్లు కన్పిస్తాడుకదా.... కానీ, ఈయన తూర్పున కన్పించినట్లు వర్ణిస్తున్నాడు. మనందరం చప్పట్లు చరుస్తున్నాం.... ఇది ధర్మమా?" అని విమర్శించాడు-

కొందరికి ఈ సంశయం అసలు అర్థమే కాలేదు. కొందరికి నిజమే ననిపించింది- కొందరు పట్టించుకోలేదు-

"ఆర్యోత్తములారా! మనం ఆరాధించేది శబ్ద శక్తినేగాని, భావ శక్తిని కాదు.... శబ్దానికి ప్రాధాన్యతనిచ్చి, భావాన్ని పట్టించుకోవద్దని నా మనవి...'!" అన్నాడు మధ్యేమార్గం ప్రతిపాదిస్తూ మరో మహర్షి -

"ఇదంతా ఎందుకు-? ఆ మహర్షి తన బుక్కును ఉపసంహరించు కొంటే పోలా....??" రెట్టించాడు. ఇంకో మహర్షి !!

"ఇవ్వాల్టికి వదిలేస్తే రేపు మళ్ళీ మరో సభలో ఇలాగే చదివి తేనో...???" ఇలా ఎవరికి తోచిన రీతిలో వారు వ్యాఖ్యానిస్తున్నారు-

సభలో గందరగోళం చెలరేగింది. అందరూ ఒకేసారి లేచి మాట్లాడాలని ప్రయత్నించడంతో ఎవరు ఏం మాట్లాడుతోందీ తెలీడంలేదు-

అధ్యక్ష స్థానంలో వున్న అత్రేయులవారికి జరుగుతున్నదేమిటో అర్థంకాలేదు- సభలో కావాలని కొందరు గలభా సృష్టిస్తున్నారేమోనని అనుమానించ సాగాడు! అదుపు తప్పిన ఈ ఉన్మాదాన్ని లొంగదీయడం ఎలాగా.... అని ఆలోచిస్తున్నాడాయన-

ఇంతలో "ఆర్యా!" అంటూ, ఓ కమనీయ కోయిల స్వరం విన్పించింది- అప్పటి వరకూ మౌనంగా వున్న స్త్రీ సమూహంలోంచి ఎవరో స్త్రీ మూర్తి ఏదో చెప్పబోతోందనే సరికి సభ కొంచెం సద్దుమణిగింది! అపే చూశారంతా!!

నిండా ఇరవై వసంతాలు నిండని అప్సర...

అత్రేయ మహర్షి చిద్విలాసం చేసి- ఆమెకు మాట్లాడేందుకు అనుమతిచ్చాడు-

"పుణ్య పురుషులారా....! దిక్కుల్ని సూర్య గమనాన్నిబట్టి నిర్ణయిస్తారు- సూర్యుడు ఏ దిశన ఉదయిస్తాడో అదే తూర్పు! ఉత్తర ధ్రువంలోనో- మరోచోటో- సూర్యుడు దక్షిణంనించి ఉదయించాలని ఇంద్రుడు ఎన్నడూ శాసించలేదు! ఆ మహర్షి చెప్పిన బుక్కు శాస్త్రీయమే...!

తప్పులు మాట్లాడితే మన్నించండి-" అని వినయంగా సమస్కరించి కూర్చుంది అప్సర!

"ఇంత పాండిత్యం తగలబడీ సూర్యుడు దక్షిణాన ఉదయిస్తాడని ఎలా అనుకున్నామా...." అని నాలిక్కరుచుకున్నారు అంతవరకూ విరుచుకుపడ్డ మహర్షులు!

ఆత్రేయుడు ఆమె సమాధానానికి నివ్వెరపోయాడు "స్త్రీలకు సౌకుమార్యంతోపాటు- వినయాన్ని, విజ్ఞానాన్నీ అరుదుగా ప్రసాదిస్తుంటాడు. ఇంద్రుడు-!!" అనుకున్నాడాయన-

అప్పుడే ఆయన మనసులో ఓ ఆలోచన మెదిలింది-"అప్సరవంటి అనుకూలవతి తనకు కోడలైతే అంతకన్నా అదృష్టం ఏముందీ....?" అని రథవీతితో సంప్రదించి తన ఆలోచనలకు ఓ రూపం ఇవ్వాలనుకున్నాడు.

ఆత్రేయుని మనసులో పుష్పిస్తున్న ఈ ఆలోచనా కుసుమాలు అప్సర కంఠాన్ని అలంకరిస్తాయో లేదో.... ఆమె భవిష్యత్తు సరిగ్గా ఇదే విషయంమీద ఒక కొత్త మలుపు తీసుకోబోతోందన్న సంగతి ఆమెకు తెలియదు,

విధి లీలలు ఎవరూహించగలరు....??

* * * *

గాంధార దేశం....

ధనికులు మాత్రమే నివశించే పుష్కలావతీ నగరంలోమదనోత్సవం మహా ఉత్సాహభరితంగా సాగిపోతోంది.

త్వష్ట రాకుమారుడి పెళ్ళి సందర్భంగా రాజధానీ నగరం పుష్కలావతిలో వేడుకగా మదనోత్సవం జరుపుకొంటున్నారు.

అర్థ కామాలే తప్ప ధర్మ మోక్షాలెరుగని ప్రజల ఆనాటి ఆనందానికి ఆడా మగా తేడాలేదు.

మదపతులు బలిష్టుల్ని ఎంచుకుంటున్నారు. ఏ మగాడిలో ఎంత శక్తి దాగుందో నిర్ణయించగల నేర్పు ఆడదానికేవుంది.

ఆ రాత్రి భర్త ఎవరో....భార్య ఎవరో....

ఆ ఆనందం ఆ ఒక్కరాత్రే....మర్నాడు అంతా మామూలే! ఎవరి కాపురాలు వారివి! ఎవరి పాతివ్రత్యం వారిది! ఎవరి బానిసత్వం వారిది!!!

ఒకనాడు ఈ గాంధారుల చేతిలో తమజాతి ఓడిపోయినప్పుడు. .. తమ మొగుళ్ళ పక్కల్లోంచి తమను పీక్కె లేనదీసుకొచ్చినప్పుడు....తమ జాతి స్త్రీలంతా ఒకళ్ళమీద ఒకళ్ళు గుట్టలుగాపడి ఏడ్చిన విషాద స్మృతుల్ని ఈ ఒక్కరాత్రి ఏ బానిస స్త్రీ మనసులోకి రానీయడంలేదు.

ఉత్సవంలో యజమానీ-దాసీ భేదంలేదు. అందినచోట ఆనందాన్ని అందినంత అందుకోవడమే....!!

మట్టికుండల నిండా సురని నింపి తాగిస్తుంటే రెచ్చిపోయి ఇంకా ఇంకా పచ్చి శృంగారం ప్రదర్శిస్తున్నారు ఆడవాళ్ళంతా!

స్త్రీ సుఖం ఇదే మొదలయిన కుర్రాళ్ళకిది వింత అనుభూతి....ధన వంతుల ఇళ్ళలో గొడ్డుచాకిరీ చేస్తున్న దాస స్త్రీలకిది అపురూపమైన అవ కాశం....!!

ప్రజలు తమ కష్టాల్ని మరిచిపోతారనే - అప్పుడప్పుడూ జిగీషి ఇలాంటి మదనోత్సవాలను నిర్వహిస్తుంటాడు....! మనుషులంతా ఐక్యం గానూ ఆనందంగానూ వుండాలని ప్రబోధిస్తూ ఈసారి మదనోత్సవాన్ని ప్రారంభించాడు జిగీషి!

జిగీషి ఇలా ధర్మపన్నాలు కొత్తగా మొదలుపెట్టాడంటే, ఎవరికో ఏదో ప్రమాదం ముంచుకొస్తున్నట్లే!!

"విదేశీరాజెవడైనా గాంధారంమీదకుదండెత్తివస్తున్నాడంటావా...?" సందేహంగా అడిగాడు ఆలోచనాపరుడైన ఓ గాంధార పౌరుడు.

"అలాంటిదేదో మన ప్రభువులవారే ప్రారంభిస్తున్నారని నా అను మానం" అన్నాడు ప్రతిగా ఇంకో పెద్దమనిషి!

"మీ ఇద్దరూ చెప్తున్నదాంట్లో రెండోదానికే అవకాశం ఎక్కువగా కన్పిస్తోంది....!" మధ్యలో కల్పించుకొని అన్నాడు ఇంకో వృద్ధుడు.

మొత్తంమీద జిగీషి ఉపన్యాసం ఎక్కువమందిని ఆలోచింప జేసింది. ఒకవైపు మదనోత్సవంలో పడి వయసులో వున్నవాళ్లు ఆనందిస్తుంటే....వయసుడిగిన పెద్దలు వీధుల్లో సాగుతున్న పచ్చి శృంగారాన్ని తమ కళ్ళతో చూడలేక దూరంగా పోయి రాజకీయాలు చర్చించు కొంటు న్నారు.

ఈ రాజకీయాలాట తెలియని అమాయక ప్రజలు మూక ఉమ్మడి ఆవేశంలోపడి ఊగిపోతున్నారు.

"ఇంతకీ త్వష్ట రాకుమారుడు ఎక్కడా కన్పించలేదేమిటి....?" ఆరా తీయసాగాడు మరో ముసలాయన.

"ఊరంతా వేడుకల్లో మునిగిపోతుంటే, అసలైన వ్యక్తి లేకపోవడం ఏమిటి....? ఆయన కోసమేగదా ఈ మదనోత్సవం... !" అనుమానంగా అడిగాడు ఇందాకటి పెద్దమనిషి.

"త్వష్ట రాకుమారుడు లేనిలోటు స్పష్టంగా కన్పిస్తోంది కదూ....!"

"కొత్త పెళ్ళికొడుకుగదా....! అంతఃపురంలోనే ఉన్నాడేమో....!"

"నీ బొంద! ఆయనేమన్నా మనబోటి సామాన్యుడా....? ఒక పెళ్ళాంతోనే వేగలేక చావడానికి! ఆయనగారికోసం ఎందరాడవాళ్ళు ఎదురు చూస్తున్నారో నీకేం తెలుసు?"

"పిచ్చివాడా! రాజులు వీదినపడి తిరుగుతారని ఎలా అనుకొంటు న్నావ్....! ఆయన పనిలో ఆయన ఉండేవుంటాడు—" అని బిగ్గరగా నవ్వాడు జవసత్త్వాలుడిగిన ఓ బోసితాత. ఆ తాతతో కలిసి అందరూ ఘొల్లున నవ్వారు.

అలా ఎవరి కేరింతల్లో వారుండగా....

భూమి కంపించేలా పెద్ద పెద్ద అడుగులు వేసుకొంటూ పాతాళ కూపాలవైపు దారితీశాడు త్వష్ట!

యువరాజు త్వష్ట ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో ఎవరికీ తెలియదు. అతనింత రాత్రివేళ పాతాళ నూతుల దగ్గరికి ఎందుకు వచ్చాడో కూడా అర్థంకాలేదు

జిగీషికి అగర్భ శత్రువైన ఒక ఆర్య వంశాంకురం అక్కడి చీకటి నూతిలోవుంది.... అది మొగ్గతొడిగి విచ్చుకోక మునుపే వాన్ని కాళ్ళకింద నలిపివేయాలి... అందుకే అంత ఆవేశంగా నడుస్తున్నాడు త్వష్ట!

తమ రాజరికాన్ని వ్యతిరేకించిన వాళ్ళనీ.... తమ ఆధిపత్యాన్ని అంగీకరించని వాళ్లనీ.... తమ ప్రమేయంలేకుండా స్వంత ఆలోచనలు చేసేవాళ్లనీ....నేరస్థులుగాప్రకటించి ఈ చీకటినూతుల్లోకితోయించి వినోదించడం జిగీషి త్వష్టలకొక ఆట...!

ఇంతరాత్రివేళ త్వష్ట అకస్మాత్ ఆగమనంతో కూపశిక్ష అనుభవిస్తున్న ఎవరో పుణ్యాత్ముడికి మూడిందనేది రూఢీ అయిపోయింది.

ఎవరో ఆ మహాత్ముడు...?

త్వష్టుడు కూపాలవైపు రాగానే గౌరవవందనం చేశారు భటులు.

నిర్లక్ష్యంగా వాళ్లవంక చూసి ఒక నూతివైపు నడిచాడు త్వష్ట.

ద్వారాలు తెరిచి, కాగడాతో దారి చూపించసాగాడు ఓ భటుడు. నూతిలోపల కటిక చీకటిలో మ్రగ్గుతున్న బంధితుల మధ్య నిలబడి—కత్తి దూసి— "సగరుడంటే ఎవడ్రా..." అని అరిచాడు త్వష్ట-

రెండు అగ్నిశిఖలు ఆ చీకటిలోంచే అతన్ని చూశాయి.

భటుని చేతిలో కాగడా వెలుతురు నెమ్మదిగా అటు మళ్ళింది...!

* * *

సరస్వతీ తీరం....!

సత్రయాగానికి విచ్చేసిన అతిథి దేవులకు ముమ్మరంగావిడిదివేర్పాట్లు చేశాడు రథవీతి.

ఉదవ్రజ, కీకట, కృత్యన్, గాంగ్య, గంగు, చుర్గ, యవు, రుశ్మ వేతంసు, అంగ, అంతదేశ, ధన్వ, పటూర్, బాహ్లిక, మగధ, మహ ముంజవత్, రుమ, రుషత్, విశ్వర, సోంత.... మొదలైన అనేక దేశనాయ కులు రథవీతి ఆహ్వానాన్ని మన్నించి సత్రయాగానికి విచ్చేశారు.

సరస్వతీ నదీ తీరాన శరత్కాలపు వెన్నెలలో ఆరుబయట విశాల మైన శిబిరాలు వేయించి, చుట్టూ గట్టి కావలిపెట్టించాడు రథవీతి.

దూరంగా ఎత్తయిన దేవదారు వృక్షాలు దట్టంగా అల్లుకున్నాయి.

చెట్లమీంచి ఒకవైపూ, నదిమీంచి ఇంకొకవైపూ చల్లని వాయు తరంగాలు ముమ్మరంగా వీస్తుంటే, హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నారు

చెట్లకూ, శిబిరాలకూ మధ్య విశాలమైన పచ్చిక మైదానాలు....

రథవీతి సాధించిన పచ్చదనంమీదే అందరికళ్ళూ ఉన్నాయి.

"ఈ రథవీతి ఇంత అభివృద్ధి ఎలా సాధించాడంటారూ...?" అని అడిగాడు ఓ గణనాయకుడు.

"మహర్షిఅయినవాడు రాజైతే దేశం బాగుపడ్తుందండీ ఇలాగే..." అంటూ సన్నగా గొణిగాడెవరో మధ్యలోంచి! దాంతో ఆ ప్రశ్న వేసిన రాజుగారు మారుమాట్లాడలేదు.

"ప్రకృతి సహకరించందే మానవ మాత్రులం మనం మాత్రం ఏం చేయగలం చెప్పండి....! ప్రకృతి శక్తుల్ని వశంచేసుకోగలవాడు ఇంద్రు డొక్కడే...." అంటూ సమర్థించాడు మరో నాయకుడు.

"దేనికైనా తెలివితేటలుండాలండీ! మనకేవో లేదనీ, వీళ్ళకేవో ఉందనీ మనం బాధపడకూడదు. మన దేశాలలో దొరికే సుగంధద్రవ్యా లంటే ఈ సింధువులకు తగని ప్రీతి....వాటినితెచ్చి ఇక్కడ మనం అమ్ము కొని బదులుగా కావలసినంత పచ్చదనం తీసుకువెళ్తే సరి...." అన్నాడు చిటికెలువేస్తూ బాహ్లికదేశ ప్రభువు.

"అవునవును....!సుగంధ ద్రవ్యాలిచ్చి యవలూ, గోధుమలూ తీసుకుంటే సరి...." కాంభోజరాజు సమర్థించాడు.

"ధాన్యాలేం కర్మ! మన కొడుకులకు బలమైన పెళ్ళాల్ని కూడా తెచ్చుకోవచ్చు...." అంటూ నవ్వాడు రామఠ దేశాధిపతి.

అందరూ ఇలా చతురోక్తులతో కాలక్షేపం చేస్తూవుండగా, దిగువ బాహ్లీకానికి చెందిన గణ నాయకుడు "మిత్రులారా!" అంటూ ప్రసంగించటం ప్రారంభించాడు.

"వ్యాపారానికి తెలివితేటలు కావాలి. సప్తసింధులో ఉన్న అనేక నాగరిక గణాలను ఆహ్వానించి, ఏ వశిష్ట మహర్షి చేతో మనం కూడా ఓ యాగాన్ని - పోనీ ఇలాగే సత్రయాగాన్ని - నిర్వహింబామనుకోండి.... వాళ్ళొస్తారు....మన సుగంధ ద్రవ్యాలను రుచి చూస్తారు. . కావలసినవి కొనుక్కొంటారు....ఏమంటారు....?" అన్నాడు—

"యాగమో-యజ్ఞమో అంటేగానీ ఈ సింధువులు కదలరులేండి" అని నవ్వాడు మగధ రాజు.

అందరికీ ఈ ఉపాయం బాగా నచ్చింది. యాగాలవలన ఉపయోగం ఏమిటోకూడా అర్థంఅయ్యిందిప్పుడు. అందరూ కలిసి సత్రయాగమే చేయాలని ఏకగ్రీవంగా తీర్మానించారు. కాని ఎక్కడ చేయాలనేది పెద్ద ప్రశ్న అయింది! అది తేలక తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

దిగువ బాహ్లీకదేశపు మంత్రి తన రాజుగారి చెవిలో మెల్లిగా గొణుగుతూ అన్నాడు—"రాజా! మనం చెయ్యగల్గిందేదో గుట్టు రట్టుకాకుండా చేస్తే బావుండేది....ఇప్పుడు చూశారా....అందరూ యాగాలు చేయాలనే ఆలోచిస్తున్నారు....అందరూచేస్తే మనకు ఒరిగేదేముంటి....?" అని!

బాహ్లీకరాజు అనవసరంగా బైటపడిమాట్లాడినందుకు నాలిక కరుచుకుని గతుక్కుమన్నాడు. మంత్రి రాజుగారిని ఓదార్చాడు.

(8)

"ప్రభూ! సింధూ ఆర్యులు అమాయకులు. లోహాన్ని కమ్మరి కరిగిస్తే, వడ్రంగి నాగలి చెక్కితే. బుధమహర్షి లాంటివాళ్లు దగ్గరుండిపొలం దున్నిస్తే పంటలు పండుతున్నాయిగాని, యజ్ఞమో యాగమోచేస్తే వాటికవే మొక్కలు మొలుచుకొచ్చి పళ్ళూ పూలూ ధాన్యం ఇవ్వడంలేదు. ఇస్తాయని వీళ్ళ నమ్మకం. ఆ నమ్మకాన్ని ఉపాయంగా మనం ఉపయోగించుకోవాలి....అపునంటారా....?" అని ఆగాడు మంత్రి.

"అయితే కానివ్వు, ఉపోద్ఘాతం వద్దు-విషయంచెప్పు-" అని కసురుకున్నాడు రాజు.

"నేను చెప్పొచ్చేదేమంటే, ఒక నమ్మకాన్ని ప్రచారంలో పెడితే ఈ సింధువులు తేలికగా నమ్మేస్తారని....

కుభా [కాబూలు] నదీతీరంలో దొరికే ఇంగువంటే వీళ్ళకి చాలా ఇష్టం. మనం ఆ ఇంగువ దుష్టమైనదని, అనారోగ్యం చేస్తుందనీప్రచారం చెయ్యాలి...." అన్నాడు మంత్రి!

రాజు గుండెలు ఒక్కసారి అదిరినట్లయ్యాయి. "కుభా ఇంగువని తయారు చేసేదెవరో తెలుసా....జిగీషి! అతనితో విరోధం తెస్తానంటున్నావు....నీకేమైనా మతిపోయిందా? బ్రతకాలని లేదా....??" అన్నాడు కోపంగా!

దానికి మంత్రి కొంచెం వక్రంగా నవ్వి అన్నాడు.

"మహారాజా! ఈ యాగానికి మీరు తరలివచ్చారంటేనే, జిగీషి శత్రుశిబిరంలో జేరిపోయారని అర్థం. ఈ రథపతి సత్రయాగం ఎందుకు చేస్తున్నాడనుకొంటున్నారూ....తన బలాన్ని ప్రదర్శించి జిగీషిని హెచ్చరించడానికి...." అని మళ్ళీ వక్రంగా నవ్వాడు.

బాహ్లీకరాజు తల తిరిగింది.

మళ్ళీ ఓనార్చాడు మంత్రి!

"రాజా! వ్యాపారంలోనూ, రాజకీయాలలోనూ పోటీ వుంటుందిగాని, శత్రుత్వం వుండదు. మన వస్తువుల్ని మనకు తోచిన రీతిలో అమ్ముకుంటాం.

అదలా వుంచండి—

మీరు మూడో కంటివాడ్కూడా తెలియనివ్వనంటే ఒక పథకం చెబుతాను...." అంటూ ఆయన చెయ్యి పుచ్చుకుని దూరంగా తీసుకువెళ్ళాడు.

"ప్రభూ! ఇంగువ చెట్టుకు గీతగీసి, పాలుతీసి ఎండబెట్టగా వచ్చిన జిగురునేకదా.... మనం ఇంగువ అంటున్నాం.... జిగీషి తన ఇంగువని వణులద్వారా ఇక్కడ అమ్మిస్తున్నాడు. వణులు అతనికి నమ్మినబంట్లు! వాళ్ళు మన ముఖం చూడరు. అందుకని మనమే స్వంత పద్ధతులద్వారా వ్యాపారం చేసుకోవాలి....

కాబట్టి....

వెల్లుల్లినీ, యవలపిండినీ మెత్తగా కలిపి దానిమీద ఇంగువ నీళ్ల చల్లి ఎండబెట్టి వణులు పట్టుకొస్తున్నారనీ, దానికి ఇంగువ వాననేతప్ప ఇంగువ గుణాలులేవనీ మనం ప్రచారం చేయాలి.... ఇంక సందేహించకండి...." అన్నాడు మంత్రి.

రాజు కళ్లు మైకం కమ్మినట్లయ్యాయి. "మనం చెబితే నమ్మేదెవడయ్యా?" అన్నాడు—

"మహారాజా! అసత్య ప్రచారాన్ని సింధుపులు తేలికగా నమ్ముతారు. ఈ రహస్యం తెలిసినవారు ఈ దేశంలో వ్యాపారులు అయ్యారు. రాజకీయ నేతలయ్యారు...." అన్నాడు బాహ్లీక మంత్రి మళ్ళీ వక్రంగా నవ్వుతూ-

రాజు కొంచెం తేరుకున్నాడు—

"నువ్వు చెప్పింది బాగానే వున్నదయ్యా! జిగీషి అంటే వీళ్లకికోపం కాబట్టి మనం చెప్పింది తేలికగానే నమ్ముతారని నాకూ అనిపిస్తోంది. నువ్వు ఇందాక చెప్పిన వెల్లుల్లి యవలపిండి దుర్మార్గాన్ని ఆ తర్వాత మనవే చేసెయ్యొచ్చు.... ఏమంటావ్....?" అన్నాడు రాజు గంభీరంగా!

రాజు ఆలోచన గ్రహించిన మంత్రి నిర్ఘాంతపోయాడు.

* * *

రాత్రి ప్రొద్దుపోతున్నా అత్రేయుని మందిరంలో దీపకాంతి ఇంకా తేజరిల్లుతూనేవుంది.

రథవీతి అత్రేయుడితో రాచకార్యాలు చర్చిస్తున్నాడు-

ఇర్యాదేశంలో జిగీషి భంగపడినవార్త తెలిసి బుధమహర్షి ఉప్పొంగి పోయాడు.

"ఆర్యా! పాపపుణ్యాలెరగని కర్కోటకుడు జిగీషికి ఆ 'తర్షి' వీరు డెవడోగానీ భలే గుణపాఠం చెప్పాడు—" అన్నాడు సంతోషంగా!

"వెన్నుపోట్ల మొనగాణ్ని వెన్నుపోటుతోనే జయించగలం! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి—" అన్నాడు రథవీతి బుధమహర్షి తో గొంతు కలుపుతూ!

అత్రేయుడు వాళ్లకు ఏదో చెప్పబోయి, లోపలికివస్తున్న అప్సరను చూసి ఆగిపోయాడు. ఆత్మీయంగా.... "రామ్మా! వచ్చికూర్చో—" అంటూ ఆహ్వానించాడు ఆమెని.

మహర్షులకు అభివాదాలు చెప్పి, అపుపాలను బంగారు పాత్రలలో పోసి ముగ్గురికీ అందించింది అప్సర.

"ఏదో తీవ్రమయిన రాచకార్యాలు చర్చిస్తున్నట్లున్నారు. నాకు అనుమతి ఇస్తే నిష్క్రమిస్తాను-" వినయంగా అన్నదామె.

"రాచకార్యాలేమీ లేవు! ఉబుసుపోని విషయాలే! ఇర్యా దేశంలో జిగీషి భంగపడిన వైనం నీదాకా వచ్చిందా అమ్మా....?" అడిగాడు అత్రేయుడు. ఇలాంటి విషయాలలో కొత్తతరం అభిప్రాయాలు ఎలావుంటాయో తెలుసుకోవాలనిపించిందాయనకి!

కొద్దిగా నిట్టూర్చి, గంభీరంగా అంది అప్సర. "విన్నాను మహాత్మా! కానీ, ఆ వార్త నాకు సంతోషదాయకంగా లేదు—" అంది.

ఆత్రేయుడితోపాటు అందరూ ఆమె మాటలకు విస్తుపోయారు.

"మన శత్రువు దెబ్బతిన్నాడన్న వార్త నీకు సంతోషదాయకం కాక పోవడమేమిటి తల్లీ!" ఆశ్చర్యంగా అడిగాడు రథవీతి.

"క్షమించండి నాన్నగారూ! మనం ఆదర్శవంతమయిన రీతిలో ప్రజాపాలన జరగాలని కోరుకుంటున్నాం. వెన్నుపోట్లుపొడిచి, రాజ్యాలలో అల్లకల్లోలం సృష్టించి, ప్రజాజీవనాన్ని అస్తవ్యస్తంచేస్తున్నాడని, జిగీషిని మనం వ్యతిరేకిస్తున్నాం. ఆ పనిని జిగీషేకాదు, ఎవరు చేసినా అలాగే వ్యతిరేకిస్తాం!! కేవలం దారిదోపిడీలకు తప్ప 'తర్షి' తీసుకున్న చర్యలో గొప్పతనం నాకు కన్పించలేదు. అందుకే హర్షించలేకపోతున్నాను—" అన్నది అప్సర.

ఆమె సమాధానానికి నివ్వెరపోయాడు ఆత్రేయుడు. "నువ్వన్నదీ నూరుపాళ్ళూ నిజం తల్లీ .... జిగీషిపైన దాడిని నేనూ ఖండిస్తున్నాను" అన్నాడు. కొంతసేపు మౌనం పాటించి— "రథవీతీ! ఇంత వివేకంకల్గిన అప్సరను నా కోడలిగా చూసుకోవాలని మనసు ఉవ్విళ్ళూరుతోన్నదయ్యా" అంటూ అప్సరను మెచ్చుకొంటూ, రథవీతి భుజాలమీద చేతులువేసి, తన అనురాగాన్ని ప్రదర్శించాడు.

ఆత్రేయుని మాటలకు కృతజ్ఞతా పూర్వకంగా చిద్విలాసం చేశాడు రథవీతి!

"సాక్షాత్తూ భగవత్స్వరూపులు.... తమరు దయతలచి ఇచ్చిన వరాన్ని కాదనగలనా స్వామీ....? నా జన్మ ధన్యమైందనుకుంటాను...." అన్నాడు రథవీతి. కృతజ్ఞతాభావంతో ఆయన ముడుచుకుపోయాడు.

కానీ, భూమి కంపించినట్లయింది అప్సరకు!

పంచభూతాల సాక్షిగా బుధమహర్షి ముందు తాను చేసిన ప్రతిజ్ఞలు ఏంకావాలి....? ఆటవికుడినే పెళ్ళాడతానంది.... అతన్ని మహావీరుణ్ని చేస్తానంది.... అతని శౌర్యంతో, తన మేధాశక్తితో ప్రపంచాన్నే జయించి

సమస్త మానవాళినీ నీతం చేస్తానందీ.... ఇప్పుడు అన్నీ మరిచిపోయి, ఓ మామూలు మహర్షి ని పెళ్ళాడి సాధారణ యువతిలా సంసారం చేసుకొంటూ బ్రతకగలదా....???

ఇందుకేనా ఇన్నాళ్లూ విజ్ఞాన సాధనచేసిందీ....?

ఇందుకేనా ఇన్ని ప్రతిజ్ఞలుచేసి ఉన్నత ఆదర్శాలను పెంపొందింప చేసుకొందీ....?

కానీ, ఆత్రేయుడి కోరికని తిరస్కరించగలగడం సాధ్యమా....? ఆయనకు ఏం సమాధానం చెప్పాలి....?

అప్సర మౌనాన్ని అర్థం చేసుకున్నాడు బుధమహర్షి! కానీ, ఎవరికి ఏం సమాధానం చెప్పాలో ఆయనకూ తోచలేదు!

"నా కోడలిగా మా ఇంటిని పావనం చేయి తల్లీ!" అంటూ వేడుకొంటున్నవాడిలా ఆమె చేతులుపుచ్చుకున్నాడు ఆత్రేయుడు.

అప్సర కళ్లవెంబడి ధారాపాతంగా నీరు ప్రవహించింది.

బుధమహర్షి కరిగిపోయాడు....

తనవేపే బేలగా చూస్తూ, ఈ గండం గట్టెక్కించమని ప్రార్థిస్తోంది అప్సర—

ఇంక తాను ఏదో ఒకటిచేయాలనే నిర్ణయించుకున్నాడుబుధమహర్షి . .

కొన్ని క్షణాలు మౌనంగా ఆలోచించి—

"బ్రహ్మర్షి గౌరవం ఉన్న యువకుడినే పెళ్లాడాలని అమ్మాయి మనసులో ఉన్నట్టుంది...." అని చిన్నగా నసిగాడు.

"భళి! పుత్రీ!! బ్రహ్మర్షినే పెళ్ళిచేసుకోవాలని ఉన్నదా తల్లీ ....?? మా వాడు కుమార మహర్షి పట్టుదలగలవాడే... ! వాడూ నూరుసూక్తాలు ప్రకటించి త్వరలోనే బ్రహ్మర్షి అవుతాడు....అయ్యాకే చేసుకొందువుగానీ సరేనా....??" అన్నాడు ఆత్రేయుడు చిరునవ్వు నవ్వుతూ....

అప్సర తనకు తెలియకుండానే 'సరే' అని తలఊపానని గమనించుకోలేదు—

అదే ఆమె పాలిట శాపం అవుతుందేమోకూడా ఆమె ఊహించుకో లేదు!!!

విధిలీలలు ఇలానే వుంటాయి!!

"యేత్రి షప్తాః పరయన్తి విశ్వా రూపాణి బిభ్రతః
వాచస్పతి ర్బలా తేషా తన్వో అద్యధాతుమ్"

అంటూ భగవాన్ ఆత్రేయుడు రెండవరోజు యాగాన్ని ప్రారంభించాడు.

అగ్నులకు అత్యంత ప్రీతి పాత్రమైన పాలనీ, తేనెనీ, నేతినీ, హవిస్సుల్నీ, మాంసాన్నీ, సోమాన్నీ- ఋక్సామ గీతాలతో కీర్తిస్తూ హోమ గుండంలో ధారపోస్తున్నారు.

తన ముఖంలో వేల్చిన ఆ ఆహుతుల్ని దేవతలకు అందజేస్తాడు అగ్ని.

అగ్ని దేవదూతఅందుకే!

సప్తహోతలతో యాగం అప్రతిహతంగా సాగిపోతోంది.

యాగాన్ని ఆచరించే యజమాని, ఋక్కుల్ని పఠించే హోత, సోమగానం చేసే ఉద్గాత, హవిర్ద్రవ్యాల్ని సమకూర్చే పోత, హవిస్సుని అగ్నిలో వేసే నేష్ట.... వీరందరిపైనా పర్యవేక్షకుడైన యజ్ఞబ్రహ్మ.... యాగరక్షకులైన రాక్షసులు.... ఈ ఏడుగురి పూనికతో యాగకార్యం ప్రారంభం అయ్యింది.

[వేదకాలంలో యాగ రక్షకులుగా వ్యవహరించిన రాక్షసులు- తర్వాతి కాలంలో యాగ విధ్వంసకులుగా ఎలా మారారో తెలియదు!!]

యజ్ఞబ్రహ్మ- భగవాన్ ఆత్రేయులవారి పర్యవేక్షణ వలనే ఈ యాగం వైభవోపేతంగా సాగుతోందనుకొంటున్నారు చూడవచ్చిన జన సందోహం.

వేలాది జనం ఒకేసారి కూర్చుని యాగకార్యాన్ని చూడడంకోసం యాగవాటికని కొంచెం ఎత్తుగా నిర్మించారు.

ముందుపరుసలలో రాజాధి రాజులు, గణాధిపతులూ, ధనికులూ ఆశీనులైనారు. వారికి ముందు భాగంలో మహర్షులు తమ ఆచారాలననుసరించి జింక, పులి చర్మాలను విశాలంగా పరుచుకుని కూర్చున్నారు. అందరికీ వెనుకగా వేలాది జనం!!

ఆత్రేయులవారు యాగకార్యం నిర్వహిస్తున్నారు.... నిర్విఘ్నంగా యాగం సాగిపోతోంది....

అంతలోనే, యాగవాటికలోంచి కొద్దిపాటి కలవరం విన్పించింది విషయం అర్థంకాక, రథవీతి ఆ శబ్దాలు వినవచ్చిన వైపుగా వచ్చాడు.

"ఏమయ్యా రథవీతీ.... ఇదెక్కడి అన్యాయం.... ఈ యాగంలో నరబలి లేదటగా.... అసంపూర్తి యాగంతో ఎవరిని మభ్యపెడతారూ...?' అన్నాడు ఆగ్రహంగా ఓ మహర్షి రథవీతిని నిలదీస్తూ.

"బలిదానం లేని యాగం ఏమిటండీ....?" అంటూ కసురుకున్నాడు మరో మహర్షి.

"వచ్చిన దగ్గర్నుంచి చూస్తున్నాను. అన్నీ అవక తవకలే! బొమ్మలాటలా ఉన్నట్లుంది మీకు సత్రయాగం అంటే!" కొందరు మహర్షులు రథవీతిని చుట్టుముట్టి విమర్శలు గుప్పించసాగారు.

దూరంగా కూర్చున్న ఓ మహర్షి లేచివచ్చి వాళ్ళని శాంతించమని ప్రార్థించాడు. రథవీతివైపు తిరిగి, "ఆర్యా! మనకు తెలిసి నూట ఎన్మై ఆరుమంది దేవతలున్నారు. వాళ్ళలో ఉత్తములున్నారు- మధ్యములున్నారు- అధములు ఉన్నారు. దేవతల యోగ్యతనిబట్టి మనం ఆయా జాతి పురుషుల్ని విధిగా వధించవలసిందేకదా.... లేకపోతే, 'యాగం' అనే మాటకు అర్థం ఏముంది చెప్పండీ-?" అన్నాడు.

"యాగంలో పాల్గొంటే వాలు యాగ ఫలం దక్కుతుందన్న ఆశతో మీరు పిలిచిందే తడవుగా బయలుదేరి అంతంత దూరాల నుండి

వచ్చాం! మీరు మహర్షి వ్యవస్థను అవమాన పరిచారు-" అని ఆగ్రహిం చాడు ఇంకో మహర్షి.

వాళ్ళందరూ మాట్లాడే మాటలన్నీ వింటూనే ఉన్నాడు యాగ బ్రహ్మస్థానంలో కూర్చున్న ఆత్రేయుడు. యాగం సాగుతూనే ఉంది. ఆయన మౌనం వీడలేదు-

"రథవీతి రాజర్షీ! వారి మాటకేమొచ్చిందిగానీ, యాగ యజమాని మీరు కాబట్టి మీకు తప్ప ఇంకెవరికి చెప్తాము....?

దృఢమైన యువకుడి ప్రాణ పంచకాల్ని వాయుదేవునికి అర్పిస్తాం. నేత్రద్వయాన్ని సూర్యుడికీ, మనస్సుని చంద్రుడికీ, ఇంద్రియాలను దిక్కులకూ, జీవాత్మని ప్రజాపతికీ సమర్పించాలని మన 'అనువాకం' శాసిస్తోంది కదా.... అన్నీ ఎరిగిన తమరే ఇలా అపౌరుషేయమైన ఋక్కుల్ని అతిక్రమిస్తే ఎలా....?" అన్నాడు కొంచెం వినయంగానే ఓ మహర్షి —

రథవీతి ఏదో సమాధానం చెప్పబోయేలోగా, మొదటి ఋషి బిగ్గరగా అరిచాడు- "ఇదంతా ఏదో కపట నాటకంలా ఉంది. మనల్నందరినీ పిలిచి ఏదో స్వార్థ ప్రయోజనాన్ని పొందాలని ఈ రథవీతి చూస్తున్నట్లు తోస్తోంది.... మహర్షి మిత్రులారా- మేల్కోండి...."అని!

రథవీతి తల దిమ్మెత్తిపోయింది, వీళ్ళు నిజంగా మహర్షులేనా.... లేక యాగ విధ్వంసానికి పనిగట్టుకు వచ్చిన గూఢచారులా....??

యాగం ఆపుచేయాల్సి వస్తుందేమోనని భయపడ్డాడు రథవీతి-

యాగ వాటిక భీభత్సంగా ఉంది. ఇక్కడిదాకా వచ్చాక యాగ కార్యాన్ని నిలుపుచేయడం శ్రేయస్కరం కాదనిపించింది....

ఇంక ఆలస్యం చేయదలచుకోలేదు. నరబలి జరుగుతుందని ప్రక టించడానికే నిశ్చయించుకుని "మహనీయులారా! శాంతించండి-" అన్నాడు రథవీతి.

(9)

నరబలి విషయంలో తన నిర్ణయాన్ని ప్రకటించబోయేముందు ఆత్రేయులవారి అనుమతి తీసుకోవాలన్న నియమాన్ని కూడా ఆయన పాటించదలచుకోలేదు.

"మీవంటి మహానీయులు ఒకచోట కలిసినప్పుడు సున్నితమైన విషయాలుకూడా వివాదాస్పదమై భేదాభిప్రాయాలు తల ఎత్తడం సహజం. ఈ సభలో అత్యధికులైన మహర్షుల కోరిక ననుసరించి నరమేధం జరుగుతుంది.... జరుగుతుంది.. ." అంటూ వెనక్కి విరుచుకు పడిపోయాడు రథపీతి.

శుభముహూర్త పంచనే ఆయనను- ధారాళంగా గాలి వీచేచోటికి తరలించాడు. ఇంత జరిగిన ఆత్రేయుడు తన మౌనంవీడలేదు.

నరబలికి రంగం సిద్ధంచేయడానికి ఏర్పాట్లు చకచకా జరిగిపోతున్నాయి-ఒక నిండు ప్రాణాన్ని బలిచేయడాన్ని ఆపడం ఎవరి తరమూ కాదక్కడ!

* * *

త్వష్ట రాజకుమారుని సౌధం....

"విజయం సాధించాం ప్రభూ...." అంటూ అంగలారుస్తూ వచ్చారు మహర్షి వేషాలలో ఉన్న గూఢచారులిద్దరూ...!

"విజయం మనదే నంటే నమ్మండి...." అంటూ వందనం చేశారిద్దరూ.

రథపతి సత్రయాగం విధ్వంసమే ధ్యేయంగా అక్కడ నానా అలజడులూ సృష్టించిన వైనాన్ని త్వష్ట రాకుమారుడికి వివరించసాగారు వాళ్ళు.

తన సౌధంలో చిరాగ్గా అటూ ఇటూ పొర్లుతున్నవాడల్లా గూఢచారుల్ని చూసి ఆత్రంగా లేచి కూర్చున్నాడు త్వష్ట!

వాళ్ళ మాటలు వినేసరికి అతని కళ్ళు కాంతివంతంగా మెరిశాయి. ఎగిరి కౌగలించుకున్నంతపని చేశాడు.

"ఆ రథవీతి నరబలికి ఒప్పుకున్నాడా....? బలికి మనం పంపిన వాడినే ఏర్పాటు చేశారా!..?? అంతా అనుకున్నట్లే జరిగిందా....?? పొరబాట్లేమీ జరగలేదు కదా...???" ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించాడు.

వాళ్ళ సమాధానం విన్పించుకోకుండానే ఆ ఇద్దర్నీ జబ్బలు పుచ్చుకొని రహస్య మందిరంలోకి లాక్కెళ్ళాడు.

"ఇప్పుడు చెప్పండి గూఢచారులారా! యాగం అంతా ఆగం ఆగం చేశారా....? చెప్పండి...? ఎలా విజయం సాధించారో చెప్పండి!" అన్నాడు వాళ్ళ భుజాలు పుచ్చుకుని కుదుపుతూ.

"మహాప్రభూ! ఆ రథవీతి సత్రయాగం మూరుపాళ్ళా విఫలం అయినట్లే...." అన్నారు ఏకకంఠంతో ఇద్దరూ!

ఆ మాటలకు ఆనందంగా మెడలోంచి రత్నహారాలు రెండు తెంపి వాళ్ళమీదకు విసిరేశాడు త్వష్ట!

ఎదురుగా పొగలు కక్కుతున్న వేడి మాంసం ముక్కలు రెండింటిని తీసి వాళ్ళిద్దరి నోళ్ళలో కుక్కాడు. వాటిని మింగలేక వాళ్ళిద్దరూ గుడ్లు వెళ్ళగక్కుతుంటే హాయిగా నవ్వాడు.

"తమరు వేసిన పథకం ప్రకారమే కోతిగోలచేశాం ప్రభూ! అక్కడ మేం చెయ్యని అరాచకం లేదంటే నమ్మండి ..."అన్నారు వాళ్ళు.

"భళి భళి!" అన్నాడు త్వష్ట మరి రెండు మాంసం ముక్కలు వాళ్ళ దగ్గరికి విసిరేస్తూ.

"రథవీతి అవునంటే మేం కాదనేవాళ్ళం....వాళ్ళు నరబలి లేదన్నారు. మేం కావాలన్నాం. పట్టుబట్టి పోట్లాడి సాధించాం. చివరికి రథవీతి 'నరబలి జరుగుతుంది' అని ప్రకటించి మూర్ఛవచ్చి విరుచుకు పడిపోయాడు. ఆతర్వాత బతికాడో చచ్చాడో తెలియదు."

"అప్పటికప్పుడు బలికి మనుషులెక్కడ దొరుకుతారుచెప్పండి....?"

"బలికి పనికొచ్చే బలిష్టుడైన యువకుడు ఎక్కడైనా దొరుకుతాడేమోనని వెదకడానికి, వాళ్ళ 'ప్రజాపతి' బయలుదేరాడు. వాడి వెనకేవెళ్ళి

వాణ్ణి నెమ్మదిగా మాటల్లోపెట్టి, మీరు చెప్పిన సగరుడనే కుర్రాణ్ణి చూపించాం. ఇలాంటివాడైతే యాగానికి బాగా పనికొస్తాడని చెప్పాం....
ఆ కుర్రాణ్ణి చూడంగానే ఎగిరి గంతేశాడంటే నమ్మండి-ఆ ప్రాజపతి...."
అంటూ సంబరంగా విషయ నివేదన చేసుకొంటున్నారు గూఢచారు లిద్దరూ!

తన జీవితంలో ఇంత ఆనందాన్ని ఎప్పుడూ పొందలేదు త్వష్ట. ఒకే ఎత్తుతో రెండు కార్యాలు సమకూర్తున్నాయి. తనకు వ్యతిరేకంగా జనసమీకరణ చేస్తున్న రథవీతి అల్లరిపాలయ్యాడు. ఆ యాగాన్ని దగ్గరుండి జరిపిస్తున్న బుధమహర్షి కళ్ళముందే సగరుడు బలి అవుతున్నాడు. అందుకే సంతోషం పట్టలేకపోతున్నాడు త్వష్టడు.

తదుపరి కథను సవ్యాఖ్యానంగా చెప్పుకుపోతున్నారు గూఢచారులు.

* * *

బలిపీఠం సిద్ధం అయ్యింది!

మేరుపర్వత సమానుడైన సగరుడిని వెంటబెట్టుకువచ్చాడు ప్రాజపతి—

మూర్ఛిల్లిన రథవీతికి ఉపచారాలుచేస్తూ రాజమందిరంలోనే ఉండిపోయాడు బుధమహర్షి.

భగవాన్ అత్రేయుడు మౌనదీక్ష విడువలేదు.

నరబలికి రంగం సిద్ధం చేస్తున్నారు చకచకా!

సగరుడికి రకరకాల వాసస్సుల్ని (వస్త్రాల్ని) తొడిగారు. గుండెల మీద ప్రకాశవంతమైన ద్రాపి (కవచం)ని అమర్చారు. కంఠానికి రుక్మలు (బంగారు హారాలు) అలంకరించారు. కుడిచేతికి సునిష్కం (కంకె)తొడిగారు. భుజాలకు వాదీ (భుజకీర్తులు) పాదాలకు రుష్టు (కడియం), శిరసుకు శిప్రశీర్షం (తలపాగా) అలంకరించారు.

సమస్త భూషణాలంకారాలతో శోభిల్లుతున్న ఆ సగరుణ్ణి చూస్తుంటే సాక్షాత్తూ ఇక్ష్వాకు వంశోద్ధారకుడు పురుచక్రవర్తిలా అన్పించాడందరికీ!

వృషభుడూ, యువకుడూ, తుదీగ్రీవుడూ అయిన ఇంద్రుడిలా ఉన్నాడీ బలిపురుషుడు....అని కీర్తింపాడో ఋషి.

హిరణ్యకేశి, కంసనుడు, శీఘ్రగామి, శుభ్రప్రకాశయుతుడు అయిన అగ్నిలా ప్రకాశిస్తున్నాడని వర్ణింపాడింకో మహర్షి.

సగరుడిని యూప స్తంభం దగ్గరకు తీసుకువెళ్ళారు.

మహర్షులు ఒక్కరొక్కరే బలిపురుషుడికి సాష్టాంగపడి నమస్కరించారు. బలిపురుషుడు ఇంద్రుడికన్నా పవిత్రుడు. అగ్నికన్నా పునీతుడు.... వరప్రదాత....అని!

మంగళవాద్యాలు కర్ణపేయంగా మ్రోగుతున్నాయి.

బలి తతంగం పూర్తికాగానే సోమరసం తెచ్చి అందరికీ పంచి పెడతారు. అందుకోసం "కుశనకుడు" సిద్ధంగా ఉన్నాడు.

నరబలి జరగంగానే సోమపానం చేయడానికి అగ్నిగుండంలోంచి యజ్ఞపురుషుడు ఉద్భవిస్తాడు. యజ్ఞపురుషుడు రాగానే అగ్నిగుండం ఉప్పున ఆరిపోతుంది. మంటలు చల్లారాయంటే, యజ్ఞపురుషుడు వచ్చినట్టే.

ఇంక బలికి కొన్నిక్షణాలే ఉంది!

బలి పురుషుడి తల తెగిపడగానే "వషట్" అని ఉచ్చరించటానికి సిద్ధంగా నోళ్లు తెరుచుకొని చూస్తున్నారు కొందరు మహర్షులు.

సూర్యకాంతితో ప్రకాశించే ఆ యువకుడిని బలిచేయడానికి ఈ మహర్షులకు మనసెలా ఒప్పిందో.... అర్థంకాని జనం ఆ బలిపురుషుడి కోసం కన్నీరు మున్నీరైనారు.

తలారులిద్దరూ వజ్రంలాంటి అంచులుగల కత్తులతో యూప స్తంభం దగ్గర చెరొకవైపు నిల్చున్నారు. వారికి తలలు నరకడం స్ఫూర్తి. వారి వృత్తిధర్మం వారి దృష్టిలో పవిత్రమైనదే!

అంతా ఊపిరి బిగబట్టి అటే చూస్తున్నారు.

అలా అందరూ చూస్తుండగానే....

మెరుపు తీగ ఒకటి యూప స్తంభంపై పు దూసుకువచ్చింది.

దూసుకువచ్చిన ఆ 'శంపాలత' తనసీరఖడ్గాన్ని ఈ వేపు నుంచి ఆ వేపుకు అర్ధచంద్రాకృతిలో తిప్పుతూ దూసింది.

అంతే! బలి పురుషుడి తలనరకడానికి సిద్ధంగావున్న తలారులిద్దరూ మెడకు తరుసుకుని కుప్పకూలిపోయారు.

చూస్తూండగానే, యూప స్తంభందగ్గర నిలబెట్టిన బలి పురుషుడు, ఆ మెరుపు తీగతో సహా చటుక్కున మాయమైపోయాడు.

అంతా క్షణాలలో జరిగిపోయింది.

సగరుడిని ఎవరో ముసుగు వీరుడు గుర్రంమీద ఎక్కించుకొని తీసుకుపోతున్నాడని వాళ్ళు గ్రహించేసరికి ఆ ఇద్దరూ చాలా దూరం వెళ్ళిపోయారు.

'సగట్' అని అరిచేందుకు నోళ్ళు తెరిచిన పురోహితులు అలానే చూస్తూవుండిపోయారు!

* * *

"అలా సత్రయాగం రసాభాస అయి, అల్లకల్లోలంగా ముగిసిపోయింది ప్రభూ...." అంటూ ఉత్సాహంగా వివరించారు గూఢచారులు!

ఆ మాటలు వింటూనే అదిరిపోయాడు త్వష్ట!

"కొంపలు ముంచారుకదరా" అని, చాచి ఒక్క తన్ను తన్నాడు ఆ దెబ్బకు నేంమీదపడి, నెత్తురు కక్కుకున్నారు గూఢచారులిద్దరూ!

"ఇదన్నమాట మీరు మోసుకొచ్చిన శుభవార్త? సగరుడు తప్పించుకొంటుంటే మీరంతాఏంచేస్తున్నార్రాఅక్కడ....??"అని మళ్ళీఎగిరితన్నాడు వాళ్ళని—

"ఆ ముసుగు మనిషిని వెంబడిస్తూ మన సైనికులు వెనకే వెళ్ళారు ప్రభూ....ఆ సంగతి మీకు తెలియచేయాలనే మేముద్దరం ఇక్కడికి వచ్చాం....మీ బానిసలం....మన్నించండిప్రభూ....అంటూ త్వష్టుడి కాళ్ళపై బడి ఏడవడం మొదలుపెట్టారిద్దరూ!

పెర్రెత్తినవాడిలా అరుస్తూ, వాళ్ళిద్దర్నీ విదుల్చుకుని తండ్రి జిగీషి సౌధంవేపు పరిగెత్తాడు త్వష్ట!

# 3

పెరిగే నాగరికత ఏనాటికైనా విరగక తప్పదన్నట్లు వెల్తురు చీకటిలోకి జారిపోతోంది.

వెన్నెల కిరణాలు ఆకాశంలోంచి గతకాలపు వైభవాల శిధిలాల్లా జలజలా రాల్తున్నాయి—

సగర కుమారుణ్ని గుర్రంమీదికెక్కించుకుని ముసుగువీరుడు తదేక ధ్యాసంగా దూసుకుపోతున్నాడు.

సరస్వతీ తీరాన్ని దాటి తూర్పుకు చాలాముందుకు వచ్చేయడంతో గాలిమార్పు చాలా స్పష్టంగా అవుపిస్తోంది. చలి తీవ్రంగా వుంది.

"ఈ మహా అశ్వికుడెవరో.... తన ప్రాణదాత..... శబ్దానికన్నా వేగంగా గుర్రాన్ని నడిపిస్తున్నాడు...." అనుకున్నాడు సగరుడు.

పది సంవత్సరాల చీకటి కారాశిక్షను అనుభవించిన వాడికి ఈ గాలి.... ఈ వెన్నెల.... ఈ చల్లదనం.... ఈ స్వేచ్ఛ— అన్నీ తన స్వంతమైపోయాయన్న భావన ఆ చలిబాధని దరిచేరనీయడంలేదు.

లోయలోంచి ఎత్తయిన కొండమీదకు నిట్టనిలువునా నిచ్చెన ఎక్కినట్లు భారంగా నడుస్తోంది గుర్రం. బహు దుర్గమమైన దారి....మసక వెలుతురులో ప్రయాణం కష్టంగావుంది.

ఇంతలో, వెనకనించి దూరంగా ఏవేవో శబ్దాలు వినిపిస్తే, గ్రుఱున వెనక్కి తిరిగి చూశాడు సగరుడు.

కొండకు దిగువగా పందలాది సైనికులు తమనే వెంబడిసూ దూసుకు వస్తున్నారు.

సైనికుల నెత్తిమీద కంచు శిరస్త్రాణాలు మసక వెన్నెట్లో కూడా తళుక్కున మెరుస్తున్నాయి. గమనించాడు సగరుడు. తన పట్టుబట్టలూ-ఎర్రని తలపాగా .... ఇవే చీకటిలో తమ ఉనికిని వెల్లడిస్తున్నాయని గ్రహించాడు.

సైనికులు కూడా నెమ్మదిగా నానా అవస్థలూ పడుతూ కొండనెక్కి వస్తున్నారు వెనకనే!

వెంటనే తన శరీరంమీద వున్న పీతాంబరాన్ని, తలపాగానూ ఊడదీసి దూరంగా విసిరేశాడు. ఆభరణాలను వలిచిపారేశాడు. ముసుగువీరుణ్ని విశ్రాంతి తీసుకోమన్నట్లుగా తన ఒడిలోకి లాక్కొని, గుర్రం కళ్ళాలను ఒడుపుగా పుచ్చుకున్నాడు.

హా....హూ....హో....అంటూ బిగ్గరగా అరిచి గుర్రాన్ని అదిలించాడు. గుర్రం నాలుగుపాదాలమీద గాలిలోకి లేచి, పెద్దబండరాయిని ఒకే ఉదుటున దాటి అవలీలగా ఆవలికి దూకింది.

క్షణకాలంలో గుర్రం పర్వతాగ్రాన్ని చేరి, దక్షిణాన విస్తృతంగా వ్యాపించిన మైదానాలవేపు దూసుకుపోయింది.

చీకటిలో అడుగులు సాగక జిగీషుడి సైనికులు గుర్రాలతోసహా కొండ కొమ్ము అంచునైనా ఆగిపోయి వుంటారు. లేక తిరుగు ప్రయాణం కట్టివుంటారు. వారి జాడ ఇంకలేదు!

సగరుడు ఆనందంగా కేకలు పెడుతూ గుర్రాన్ని రాళ్లూ రప్పలూ దాటించసాగాడు.

స్వేచ్ఛ.... స్వేచ్ఛ స్వేచ్ఛ....

గుర్రపు అడుగులు నేలమీదకన్నా గాలిలోనే ఎక్కువగా ముద్రిత మౌతున్నాయి—

ఇది ఏ రాజుకూ చెందని నేల.... ఇది స్వేచ్ఛాభూమి.... ఇక్కడ మొక్కలకు స్వేచ్ఛ— ఇక్కడ మృగాలకు స్వేచ్ఛ— ఇక్కడ ఆ యిద్దరే అయిన మనుషులకు స్వేచ్ఛ—

తెల్లవారేవరకూ ఒనంతమయిన స్వేచ్ఛావాయువుల్ని పీల్చుకొంటూ అలా ప్రయాణిస్తూనే వున్నారిద్దరూ!

నెమ్మదిగా, నిర్భయమయిన ఒక స్థలంలో గుర్రాన్ని ఆపాడు సగరుడు.

ముసుగువీరుడి భుజాలమీద చేతులువేసి, ఆత్మీయంగా, "రక్షకా! ప్రాణదాతా! నీ పేరు—" అని అడిగాడు — కృతజ్ఞతలు నిండిన మాటలు పేర్చుకొంటూ సగరుడు.

చలిని విడుల్చుకొంటూ, ముసుగుతీసి తల ఎత్తి సగరుని వంక చూశాయి ముసుగుమనిషి కళ్ళు!

ఉదయిస్తున్న సూర్యభగవానుని బంగారు కాంతులు ప్రసరించి ఆ ముఖారవిందం తేజోవిరాజితమైంది!

చూసి నిర్ఘాంతపోయాడు సగరుడు—

పసిడి తొడుగు తొడిగిన శిల్పమా.... అది మూర్తినొందిన సింధు కాంత స్వరూపమా....!

తన ఒడిలో వెచ్చగా ఒత్తిగిలినతన విముక్తిప్రదాత పురుషవేషంలో ఉన్న స్త్రీయా....? మతిపోయినట్లయింది సగరుడికి—

ముసుగుతీసి సగరునివంక చూస్తూ— ఆత్మీయంగా నవ్వింది అప్సర—

"నా పేరు అప్సర! రథవీతి రాజర్షి ఏకైక దుహితని!" అని మళ్ళీ నవ్వింది.

విస్మయాల జడివానలో తడిసి ముద్దయిపోయాడు సగరుడు.

తను చీకటి కూపాలలోంచి బ్రతికి బయటపడడమే ఒక విచిత్రం!

ఆ విచిత్రాన్ని వాస్తవం చేసింది ఒక యువతి!

ఇది కలయా.... ఇంద్రుని మాయయా....

ఆమెకు తానెవరినని చెప్పాలి? ఎలా చెప్పాలి....?

(10)

"నా పేరు స....గ....రు....డు...." అంటూ యింకేదో చెప్ప బోయాడు.

"అంటే, ప్రసిద్ధ చక్రవర్తి పుత్రుడూ....?" అని సందేహంగా ఆగింది అప్సర.

"అవును! ఇక్ష్వాకు వంశంలో పుట్టి, పది సంవత్సరాలపాటు బుధ మహర్షి కుమారుడుగా పెరిగాను. నాగేషి చీకటి సూతులలో ఇన్నాళ్ళా కారాశిక్ష ననుభవించి మీ సహాయంతో స్వేచ్ఛనుపొందాను-రాకుమారీ...." అన్నాడు కృతజ్ఞతగా!

"బుధమహర్షి మీ గురించి నాకు అంతా చెప్పారు...." అన్నది కొంత సిగ్గుపడుతూ అప్సర.

ఇద్దరూ కొన్ని క్షణాలు మౌనంగా ఒకరినొకరు చూసుకొంట పుండిపోయారు.

మౌనంలో కూడా ఒక విధమైన పులకరింత వుంటుంది!

*   *   *

వెన్నెలలో విరియబూసిన మల్లె రేకులా వుంది అప్సర-

నీహార యవనికలు ఆమెకు వందనాలు చేస్తున్నాయి.

ఆలోచనల 'నది' 'సాగర' సంగమం కోసం తపస్సు చేస్తున్నట్లు వంటరిగా కూర్చునుంది అప్సర-

సగరుడు ఎక్కడికి వెళ్ళాడో తెలియదు.... అతని రాకకోసం నిరుచూసి ఆకలి తీర్చుకోవడానికి ఏదైనా జంతువు దొరుకుతుందేమోనని వెదుకుతూ అలిసిపోయి కూర్చుంది!

ఆ గంగా లోయలలో అప్సరా సగరులే మనుషులు!

జంతువులే మిత్రులు- జంతువులే శత్రువులు వాళ్ళకి!

పంచాప దేశపు రాచనగరిలో- అంతఃపుర సౌధంలో బంగారులోహ ధగధగల మధ్య పట్టువస్త్రంలా మెత్తగా నిగనిగలాడే ఆమె యవ్వనం ... ఈనాడు యిలా కొండలోయలలో దుమ్మూ ధూళీ సోకి వెలవెల బోతోంది!

ఇన్ని రోజులుగా కేశ సంస్కారమే లేకపోవడంతో, జుత్తు విగిసి జడలు కట్టుకుపోయింది. శరీరం దుమ్ము కొట్టుకు మాసిపోయింది.

నడుముకు తానే స్వయంగా తయారుచేసుకున్న చర్మపు దట్టీ.... దట్టీకో పిడిబాకు.... అదొక్కటే ఆమె ఆత్మరక్షణకు ఆయుధం.

నాగరిక సమాజాన్ని వదిలి ఇలా అడవుల్లోకి వచ్చి ఎన్నాళ్ళయిందో ఆమెకు తెలియదు. వెలిగే సూర్యుణ్ణీ, మెరిసే చంద్రుణ్ణీ లెక్కపెట్టి ఆమె చెప్పగలదు! కానీ, లెక్కలు కట్టదు!

పాతరోజులు మరిచిపోయి, అడవిలో అడవి జంతువులానే సంచరిద్దామంటాడు సగరుడు! లేకపోతే స్వేచ్ఛలోని ఆనందం అనుభవంలోకి ఎలా వస్తుందని అడుగుతాడు!

సగరుడు ఏం చెబితే అదే ఆమెకు అంగీకారం.

మనుషులమనే మాటే మరిచిపోయి, జంతు సౌఖ్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోసాగారిద్దరూ!

"సింహాలా గర్జించి ఏనుగును లొంగదీసుకోగలవా...?" అనడుగుతుంది అప్సర. నూరు సింహాల పెట్టున గర్జించి అడవినే లొంగదీసుకుంటాడు సగరుడు.

నీటి కొలనులో దూకి, చేప పిల్ల లా ఈదుతుంది అప్సర! ఒడ్డున మట్టిలో పడి ఎనుబోతులా దొర్లుతాడు సగరుడు- ఆ ఇద్దరి ప్రేమైక లోకంలో నాగరిక జీవితపు అతిశయాలు లేవు. ఆడంబరాలు లేవు.

వేటకోసం వెళ్ళిన సగరుడు ఎక్కడిదాకా పోయాడో ఏమో.... తినడానికి ఏ జంతువూ దొరక్క చిరాగ్గా తిరుగుతోంది అప్సర.

సరస్వతీ తీరంలో అపురూపమైన స్నాన వాటికలు.... అగరు ధూపాలతో పరిచారికలు చేసే సపర్యలు... అన్నీ ఒక్కసారి జ్ఞాపకాని కొచ్చాయి అప్సరకు!

కానీ, మృగ స్వేచ్ఛా దీక్షలో ఉన్న అప్సర వెంటనే ఆ జ్ఞాపకాలను తుడిచేసుకొంది. నీటిలో మునిగి కొలనుచుట్టూ గిరగిరా ఈదులాడింది.

ముత్యాలు పరచినట్లు తెల్లటి ఇసుకరేణువులు చంద్రకాంతికి మెరుస్తోంటే, ఒడ్డుమీద బోర్లాపడి అలసటగా నిద్రలోకి జారిపోయింది-

ఇంతలో-

ఇదే అదనుగా ఎప్పటినించీ ఎదురుచూస్తూ కాచుకు కూర్చుందో... పెద్ద సింహం... పంజా విప్పి భీకరంగా గర్జిస్తూ అప్సర మీదకు లంఘించింది. రెప్పున అరిచింది అప్సర. కొండలూ, కోనలూ ఆ కేకకు ప్రతిధ్వనించాయి. ఆకాశం దద్దరిల్లి నక్షత్రం రాలిపడినట్లు ఉల్క- ఒకటి రివ్వున నేలకు జారింది.

సింహంతో పెనుగులాడుతోంది అప్సర. బలంగా దాన్ని అవతలకు నెట్టివేస్తోంది....! పడిలేచే కెరటంలా ఆ మృగరాజు జూలు విదిల్చి కసిగా ఆమెపైకి దూకుతోంది.

ఒళ్ళంతా గాయాలతో వెర్రిగా అరిచింది అప్సర. ఆ నిర్జనారణ్యంలో అపురూపమైన నరమాంసం దొరికినందుకు గర్వంగా గర్జించింది సింహం. ఒకరిది ఆర్తనాదం. వేరొకరిది రణనినాదం.

విన్నాడు సగరుడు కొండ అంచుమీంచి జారుకొంటూ సింహం వెన్నుమీద పిడుగులా విరుచుకుపడ్డాడు. శతసింహ గర్జనచేసి, దాని డొక్కలో బలమైన ముష్టిఘాతాన్నిచ్చాడు.

ఆ దెబ్బకూ, ఆ అరుపుకూ సింహం బెంబేలుపడి, వెన్ను విరిగి వెనక కాళ్లు ఈడ్చుకొంటూ పొదలమాటుకు పారిపోయింది.

సగరుడు తన ప్రాణసఖిని రక్షించుకుని గుండెలకు హత్తుకున్నాడు. అతని అమృత స్పర్శతో తన గాయాలమాటే మరచిపోయింది అప్సర.

వెలుతురు వెనక నీడ కమ్ముకున్నట్లు స్వేచ్ఛ వెనక ప్రమాదం కూడా పొంచి ఉంటుందని అర్థం అయింది సగరుడికి!

"ప్రాణదాతా!" అని పిలుచుకున్నారిద్దరూ ఒకరి నొకరు.

డోలాయమాన ప్రియభావనలో- సుధాహ్లాదంలో ఆ ప్రేమజీవులిద్దరూ తేలియాడారు.

ఒకరిది సెలయేటి తనం!

ఇంకొకరిది ఆ సెలయేరులో తేలియాడే పుష్పరాగం

అది కనక పుష్యరాగం!!

*　　　*　　　*

కుంభానికి తీరం...

సౌభరి పర్ణశాల - ఇసుకవేస్తే రాలని జనసమూహంతో కిక్కిరిసి పోయి ఉంది.

పరుష్ణి నదీతీరం నుంచి వచ్చిన భరత గణ బ్రహ్మర్షులు కొందరు సౌభరి సమక్షంలో కూర్చుని సామగాన సాధన చేస్తున్నారు.

ఋక్సంహితలో స్వరబద్ధంగా పాడటానికి అనువైన ఋక్కుల్ని కొన్నింటిని ఏరి సామ సంహితను కూర్చే ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నట్లు ఆయనకు వివరిస్తున్నారు.

'శుభం భూయాత్' అన్నాడు సౌభరి.

"ఈ విషయంలో మీవంటి మేధా సంపన్నుల సహకారం మాకు చాలా అవసరం. రాజుల రాజకీయాలకు అతీతంగా శాస్త్ర జ్ఞానం పెరగాలి. అందుకే, మేం చొరవచేసి మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాం..." అన్నారు బ్రహ్మర్షులు.

"మహోన్నతమైన మీ ఆశయానికి నా నమోవాకాలు. బ్రహ్మర్షులారా! నేను చేయగలకార్యం ఆదేశించండి. నా శక్తిమేర నెరవేరుస్తాను..." అన్నాడు సౌభరి సవినయంగా!

"పరుష్ణి, శుతుద్రీ [రావి, సట్లెజ్] నదీ తీరాలలో విజ్ఞాన సాధన చేస్తున్న అహింసావాదులు మా భరతులు....!సామగీతాల్ని అభివృద్ధి చేసుకొని, విలక్షణమైన కొన్ని ప్రక్రియలను సాధించగలిగారు మా భరతగణ శాస్త్రవేత్తలు" అంటూ వివరించసాగారు బ్రహర్షులైన భరతులు!

"ఓగ్నా ఇ! ఆయాహి ఇవో ఇతోయా ఆ ఇతోయా ఆ....ఇ..." అంటూ సామ గీతిక నొకదాన్ని స్వరబద్ధంగా ఆలపించారు వాళ్ళు. ఆ ఆరు

గురు మహర్షులా ముక్తకంఠంతో ఆ ఋక్కును ఆలపిస్తోంటే, పరుష్ణీనదీ ప్రవహిస్తున్నట్లే ఉంది!

స్వరం మీదే మనసు లగ్నంచేసి వింటున్నాడు సౌభరి.

విశాలమైన పర్ణశాలలో మధ్యలో పెద్ద వేదికపైన హార్చుని శాస్త్ర చర్చ చేస్తున్నారు వాళ్ళు.

పర్ణశాల నిండుగా జనసందోహం...

మహర్షులకు రహస్యాలుండవు. వారు చర్చించుకునే శాస్త్ర విషయా లను నిశ్శబ్దంగా హార్చుని వింటున్నారు జనం. వాళ్ళకి అర్థం అయింది కొంచెమే అయినా- భక్తిభావంతో నిశ్శబ్దం పాటిస్తున్నారు-

"ఓం అగ్న ఆయాహి వీతయే! గృణానో హవ్యదాతయే అనే భరద్వాజ మహర్షి ఋక్కును కదా.... ఇప్పుడు మీరు ఆలపించినది...?" కుతూహలంగా ప్రశ్నించాడు సౌభరి.

"అవును మహర్షీ! అది ప్రాచుర్యం గల్గినదే కాక- రాగయుక్తంగా ఆలపించడానికి ఎంతో అనువైన ఋక్కుకూడా .." అన్నారు వాళ్ళు.

ఓ అగ్నా! ఆయాహి ఇవో ఇతాయా! ఆ ఇతోయా ఆఇ....

సా సా స! గాగా గరి మామ మామాగాగ! మామాగాగ

ఇది ఆఋక్కుకు స్వరకల్పన చేసి మేము ఆలపిస్తున్న పద్ధతి.

ఇప్పుడు సామగీతాలు మా భరత గణంలో ఇంటింటా వ్యాప్తిలోకి వచ్చాయి. సామగీతమే మా ప్రజల నోళ్ళలోపడి సంగీతంగా మారి పోయింది. సంగీతం మా భరతులకు జపం, జీవం, దైవం..." అన్నారు బ్రహ్మర్షులు.

యోగ సమాధిలో ఉండి, తన అంతశ్చేతనంలోంచి సామగీత గానామృతాన్ని గ్రోలుతున్నాడు సౌభరి.

"సా సా స! గా గా గరి మామ—మామాగాగ! మామాగాగ ..." అంటూ ఆ స్వరాన్ని మరొకసారి పూర్తిగా ఆలపించాడు సౌభరి.

"ఓహ్! గాన జగత్తునంతటినీ ఇలా స్వరాలలో ఇమిడ్చిన భరత సంతతికి నేను ప్రణమిల్లుతున్నాను—" అన్నాడు నమస్కరిస్తూ సౌభరి.

"అవును స్వామీ! 'స్వరసంపుటి' చెవులకింపైన గానాన్ని ప్రభవించే శ్రుతుల్ని సమకూరుస్తుంది. స్వరాల స్థాయినిబట్టి "మగరిస దనిప" అనే వరుసలో ఏడు స్వరాలను కూర్చాము...." అన్నారు చిద్విలాసంగా బ్రహ్మర్షులు.

సౌభరి ఒక్కసారి కళ్ళు మూసుకుని తన మనోనేత్రంతో ఆ సప్త స్వర సంపుటిని మరొకసారి విశ్లేషించుకున్నాడు.

"ఆర్యులారా! ఆలోచించగా నాకో సవరణ సూచించాలనిపించింది- బ్రహ్మతేజోమూర్తులైన తమకు చెప్పగలవాడను కాను.... తమరు దయతో అనుమతిస్తే విన్నవించుకుంటాను-" అన్నాడు వినయంగా.

"శాస్త్రం చర్చల వలన రాణిస్తుంది మహర్షీ! మీ సూచన వివరించండి—" అన్నారు బ్రహ్మర్షులు.

"మ" స్వరం కన్నా "స" స్వరం తక్కువస్థాయిలో పలుకుతోంది. లలితమైన గీతాలను కూడా ఆలపించడానికి అనువుగా వుండాలంటే, 'సరిగమపదని' అనే వరుస శ్రుతుల అంతరాన్ని స్పష్టీకరించి, కర్ణపేయమైన గానాన్ని ప్రసాదిస్తుందేమో.... ఆలోచించండి" అంటూ బ్రహ్మర్షుల వ్యాఖ్యానం కోసం ఎదురుచూస్తూ ఆగాడు సౌభరి!

బ్రహ్మర్షులు నివ్వెరపోయారు! మగరిసదనిప వరుసకన్నా సరిగమపదని వరుసలో లలితగీతాలకు ఎక్కువన్యాయం జరుగుతుందని వాళ్ళు అంగీకరించారు.

"మిత్రమా! సౌభరీ! మీ అపారమయిన మేథాశక్తికి ప్రణమిల్లుతున్నాం! "సరిగమపదని" వరుసలో ఆరోహణ అవరోహణ క్రమాలలో శ్రుతులను కూర్చి మెరుగులు దిద్దారు మీరు....!

ఒక స్థాయిలోని మొదటి స్థానాన్ని 'షడ్జమం' అంటాం. సప్త స్వరాలలో 'స'ని షడ్జమంగా పేర్కొనడం మీరు చెప్పినట్లు అద్భుతంగా వుంటుంది-

ఇంత చక్కని సూచన చేసి సంగీత శాస్త్రంలో ఒక మలుపును ప్రతిపాదించిన మీకు కృతజ్ఞులం" అన్నారు బ్రహ్మర్షులు.

పులకించిపోయాడు సౌభరి!

"మహాత్మా! మీ గౌరవ సూచకంగా, మీరు పురోహితులుగా ఉన్న ఈ గాంధారదేశ ప్రజల ఆత్మీయతా అనురాగాలకు గుర్తింపుగా "సరిగమ పదని" స్వరాలలో 'గ' స్వరాన్ని గాంధారం అని వ్యవహరించదలిచాం.... దయచేసి అంగీకరించండి!" అన్నారు బ్రహ్మర్షులు.

పర్ణశాలలో అప్పటివరకూ నిశ్శబ్దంగా కూర్చున్న జన సందోహం ఒక్క పెట్టున జయజయధ్వానాలు చేశారు.

"ఇది శాస్త్రం మహనీయులారా! శాస్త్రాభివృద్ధికి మనం చేసే కృషిలో ఒకరికొకరు కృతజ్ఞతలు చెప్పుకొనేదేముంది....?" వినయంగా అన్నాడు సౌభరి!

"వినయం మీ తేజస్సుకు అదనపు శోభనిస్తోంది మహాత్మా! విజ్ఞానం దానికదే తెల్లవారేసరికి పుట్టుకురాదు కదా....! పాలను పెరుగుగామార్చడం మొట్టమొదటి రసాయన ప్రక్రియ....అలాగే, అనేకమంది శాస్త్రవేత్తలు అనేక విషయాలను కనిపెడితేనే ఒక శాస్త్రం రూపొందుతుంది....!

మీరు సూచించిన మార్పు సామాన్యమైన విషయంకాదు....సరిగమ పదని వరుసను కూర్చిన మీకు సంగీత ప్రపంచం శిరసువంచి నమస్కరిస్తుంది మహర్షీ!" అని అభినందించారు బ్రహ్మర్షులు-

"మీ అభిమానానికి ధన్యుణ్ణి మహాత్ములారా—'గ' స్వరానికి గాంధారం పేరు ప్రకటించి మా ప్రజలను చరితార్థుల్నిచేశారు-మా గాంధార దేశం తమకు ఋణపడివుంది—" అన్నాడు సవినయంగా సౌభరి.

చరిత్రలో ఇది ప్రముఖంగా లిఖించదగిన సన్నివేశం! కానీ,ఇక్కడితోనే ఆగదు చరిత్ర....! అది నిరంతర గమనశీలి—!

తన అనంత గమనంలో చరిత్ర సరిగ్గా ఇక్కడే మలుపు తీసుకోవాలనుకోవడమే సౌభరి పాలిట శాపం అయింది....!

అది గాంధార ప్రజల దురదృష్టం!

సరిగ్గా అదే సమయానికి లోపలికి వచ్చాడు జిగీషి....

అకస్మాత్తుగా తన ప్రభువు రావడంతో విస్తుపోయి, నిశ్శబ్దంగా లేచి నిల్చున్నారు జనం....

తన ప్రజలలో ఇంత క్రమశిక్షణా....??? ఇది అపశకునమేననుకున్నాడు జిగీషి—ప్రజలకు సంస్కారాన్ని నేర్పుతున్నాడంటే, ఈ సౌభరి-తిరుగుబాటుకు రంగం సిద్ధంచేస్తున్నాడన్నమాట....!

జిగీషి రాకను గమనించని సౌభరి పద్మాసనంలో యోగముద్ర వేసుకొని, తన మనోనేత్రంతో సప్తస్వర సంపుటిని దర్శించుకొంటున్నాడు—

"సౌభరీ!" రౌద్రంగా అరిచాడు జిగీషి! "సౌభరీ! నీ ప్రభువురాకనే నిర్లక్ష్యం చేసేటంత ఎదిగిపోయావా....?"

జిగీషి చేసిన హుంకారంతో ఉలిక్కిపడి ఈ లోకానికి వచ్చాడు సౌభరి—లేచినుంచుని, చేతులు కట్టుకున్నాడు—

బ్రహ్మర్షులైన భరతులు అవాక్కైపోయారు—

భారతీయమైన సంగీతంలో తృతీయస్వరంగా చరితార్థమైన గాంధార దేశ వాసులు తాము చేయగల్గిందేమీ లేక....ఆ సంగీత మూర్తికోసం రెండు కన్నీటిబొట్లు విడిచారు.

*　　　*　　　*

"సురతి" పర్యవసానం సత్సంతానమేనన్న ఆర్యుల సిద్ధాంతానికి అనుగుణంగా....పుత్రోదయంకోసం తీయని వేదనలనుభవిస్తోంది అప్సర!

నొప్పులు పడుతూ మూల్గుతున్న ఆమె బాధ చూడలేక సగరుడు దగ్గరగావచ్చి, ఆమె పొత్తికడుపుమీద చెయ్యివేసి మెల్లిగా నిమిరాడు.

"నీ సహాయం ఏమీ అక్కర్లేదులే....నీ మూలానే ఇదంతా....పో అవతలికి....ఇంకెప్పుడైనా నా దగ్గరికి వచ్చావంటే చూసుకో....అంది, అంత బాధలోనూ కసిగా అప్సర.

సుఖంవెంట బాధ ఇంత దారుణంగా అనుసరిస్తుందని అనుకోలేదు సగరుడు.

పైగా ఇదంతా తనమూలానే వచ్చిందంటుందేమిటో....!

ప్రసూతి వైరాగ్యం అంటే ఇదేనేమో....!!

నొప్పులు తీవ్రతరంగా వస్తున్నాయి—

ఆమెకు కొంత శీతలోపచారం చేయడానికా....అన్నట్లు చల్లగాలి ఆమెను ఓదార్చదోయింది. సూర్యుడు తన తీక్షణత తగ్గించుకోవాలని మబ్బులచాటుకు పోయి నిల్చున్నాడు. ఆమెకు సుఖ ప్రసవం కావాలని, ప్రకృతి-తన శక్తులన్నింటినీ వేదనోపశమనాన్ని కల్గించవలసిందిగా ప్రేరే పించసాగింది—

"ఓ నారీ! మగబిడ్డను కను!

ఇంకోసారి పుత్రుణ్ణే కను

మళ్ళీ మళ్ళీ పుత్రులనే కను—

ఆ తర్వాత కూడా పుత్ర సంతతినేకను—" అంటూ శతపుత్రసంతతిని ఆశీర్వదించింది ప్రకృతి మాత!

ప్రకృతే ఆమెకు తల్లి -దైవం-పరిచారిక....!!

అప్సర ప్రాణాలు ఉగ్గబట్టుకుని, ఏదో దైవప్రార్థన చేస్తున్నదానిలా మౌనం పాటించి, ఓంకారాన్ని ఆలపించింది.

"యథావాతో యథామనో యథాపత న్తి పక్షిణః" అంటూ ఒక ఋక్మంత్రాన్ని పఠించింది.

"గాలి వీచినంత వేగంగా, మనసు పరుగిడినంత వేగంగా, పక్షి రివ్వున నేలని చేరినంత వేగంగా, పదినెలలు పెరిగిన శిశువా.... వేగు త్రాడుతోసహా త్వరగా బైటకురా.... మావి కూడా త్వరగా పడిపోవు గాక...." అని ప్రార్థించింది అప్సర.

దూరంగా పోయి,ఓ చెట్టుచాటున ఎత్తయిన రాయిమీద కూర్చున్నాడు సగరుడు. అతని గుండె దడదడలాడుతోంది. ఏం జరుగుతుందో.... ఏమిటో.... ఇలాంటప్పుడు ఏంచేయాలో అతనికేమీ తెలియదు.

అంతలోనే మరో విచిత్రమయిన ధ్వనికూడా అప్సర గొంతుకు రోదై వినిపించింది.

ఒక్క-క్షణం బిత్తరపోయి, కళ్ళుమూసుకుని, నెమ్మదిగా చెట్టుచాటు నుంచి తొంగిచూశాడు సగరుడు.

అంతా విచిత్రంగా కన్పించిందతనికి-

"అందమైన బాబు ... అచ్చం తనవలెనే వున్నాడు. అవును- తన వలనే....!! ఎంత బావున్నాడో....ముద్దొస్తున్నాడు-" అనుకున్నాడు-

తనకు దగ్గరగా వచ్చి అయోమయంగా నిల్చున్న సగరుని చూసి, అంత బాధలోనూ సిగ్గుపడి ముఖం పక్కకు తిప్పేసుకుంది అప్సర.

తన ప్రసవాన్ని తానే చేసుకోగల ఆమె నేర్పరితనం సగరుడికే కాదు, ఆమెకూ ఆశ్చర్యాన్ని కల్గించింది. పెళ్ళికిముందే కన్నెపిల్లలకు అన్నీ తెలిసివుండాలని రతనీతి రాజర్షి ఏనాడో నేర్పించిన విద్యలను ఆమె ఎన్నటికీ మరిచిపోదు.

తమ ఇద్దరిమధ్య ప్రవేశించిన ఈ మూడో ప్రాణి ఎవరు....?

తానూ ఓ కొడుకును కన్నాననే ఆనందంలో సగరుడు ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. కాని, ఆ ఆనందం అంతలోనే మాయమైపోయింది. అప్పుడే పుట్టిన ఆ పిల్లవాడి ఏడుపు సగరుడి మనసును కకావికలం చేసింది

అవును.... ఆ ఏడుపే ...! అతని ఆశాసౌధాలన్నీ ఒక్కసారి కూల్చివేసింది! నిశ్చేష్టుడైపోయాడు సగరుడు!

"ఏమిటీ ఈ చిత్రమైన ఏడుపు ... భయంకరమైన సింహం గర్జించి నట్లులేదూ.... ఆ ధ్వని...." అన్నాడు ఆందోళనగా సగరుడు.

"పుడుతూనే సింహగర్జన చేస్తున్న మనబిడ్డ జగజ్జేత అవుతాడు! నువ్వు అనవసరంగా ఖంగారు పడకు—" అంటూ బాధని నెమ్మదించు కుని, ఓపిక కూడగట్టుకొని లేచి నిల్చోవాలని ప్రయత్నించింది అప్సర.

సగరుడు మాత్రం ఆ విధమైన ఏడుపు అపశకునంగానే భావించు కున్నాడు.

ఒకచేత్తో శిశువును భుజాన వేసుకొని, రెండోచేతిని ఆమెకు ఊత మిచ్చి లేపి కూర్చోబెట్టాడు.

"ఆరోజు సింహం నీమీద దాడిచేసిన సంఘటనని మనసులో పెట్టు కొని బాగా ఆలోచించావా....?" అనడిగాడు.

"అదేంలేదు- ఒక వీరుడి భార్యని- ఇంకో వీరుడికి తల్లి ని....నాకు భయాలూ - ఆందోళనలూ ఎందుకుంటాయి.... ఆలోచించడానికి....?" అంటూ నవ్వింది అప్సర.... నీరసాన్ని పోగొట్టుకొని ఉత్సాహాన్ని తెచ్చు కొంటూ.

అప్సరను తన గుండెలకు అదిమి పట్టుకుని, చేతిలోని శిశువును ఆమెకందించాడు సగరుడు.

"మరి— ఈ ఏడుపేమిటి....? ఇంత అసమంజసంగా వుంది!" అన్నాడు మళ్ళీ.

"నూరుసింహాలపెట్టున గర్జించే నువ్వే నా మనసులో ఉన్నావుగా.... అందుకే మనబిడ్డ కూడా సింహగర్జన చేస్తున్నాడు—" అంటూ సంతోషంగా సగరుడి తలనిమిరి నుదుట చుంబించింది అప్సర.

"నువ్వేన్నయినా చెప్పు.... వీడు అసమంజసుడే....!" నిర్ధారణగా అన్నాడు సగరుడు

రెండు తథాస్తు పక్షులు కువకువలాడుతూ సరిగ్గా అదే సమయానికి గాలిలోకి ఎగిరాయి.

అప్సర వాటివంకే ఆకాశంలోకి చూడసాగింది. ఆమె కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

* * * *

సాయం సంధ్య!

సూర్యదేవుని ఆరాధించేందుకు పణులు పర్వతాగ్రం పైకి చేరు కున్నారు.

చీకటిపాలిట వెలుగు సూర్యభగవానుడు! అందుకే రాత్రిపూట సూర్యారాధన చేస్తారు పణులు.

నడిరాత్రికిగాని ఆరాధన ప్రారంభంకాదు.

చంద్రుడికి అభిముఖంగాపున్న దిక్కులో ఎత్తయిన కొండమీద అగ్ని రాజిల్లచేసి, ఆ జ్వాలనే సూర్యుని రూపంగా ఆరాధిస్తారు పణులు.

నెగళ్లువేయడం కోసం పవిత్రమైన దూలాలను కొండపైకి మోసుకు పోయే కార్యక్రమం సాయంత్రంనుంచే ప్రారంభం అయింది.

కాళ్ళనూ, చేతులనూ కలిపి కట్టేసిన లోహశృంఖలాలతో బానిసలు భారంగా దూలాలను కొండపైకి ఈడ్చుకెడుతున్నారు.

జిగీషివంటి రాజులు రాచరిక వ్యవస్థనుకోరి ప్రజాక్షేమాన్ని కాంక్షిస్తూ, వసుధైక కుటుంబ భావనని చిదరించుకొంటూ, తాము దైవాంశసంభూతులమని విశ్రపీసుతున్న రోజులవి....

కాలక్రమేణా ఆయుధ సంపత్తి పెరగడంతో పసుసంపదనీ, పంట సమృద్ధినీ పెంచుకోవడానికి బానిసల అవసరం పెరగడంతో, పనిగట్టుకుని దాడులుచేసి,దొరికినవారిని దొరికినట్లు దాసులుగా మార్చివేస్తున్న కాలం అది.

తమకు దొరికిన బానిసల్ని ఈ పణులకు అమ్మి బదులుగా తమకు కావలసిన వస్తువులను తెచ్చుకునే రాజులు కొందరైతే, తమ విలువైన వస్తువులిచ్చి, ఈ పణులనుంచి బానిసలను కొనుగోలు చేసేవారు ఇంకొందరు. బానిసల్ని కొని అమ్మడం పణుల వ్యాపారం!

కేవలం రెండుభాండాల సురని, నూరుగుర్రాల్ని తీసుకుని బదులుగా, లెక్కలేనంతమంది బలిష్టులైన బానిసల గుంపును పట్టుకు పొమ్మన్నాడు జిగీషి.

"అయితే, ఒక్క ఆన! ఏడుగురు మహర్షుల్ని కూడా వాళ్ళతో పంపిస్తున్నాను. ఆ ఏడుగుర్నీ మీసూర్యారాధన సమయంలో ఆ సూర్యుడికి బలిచేయాలి! మాయోపాయాలతో వాళ్లు తప్పించుకుపోవడానికి వీల్లేదు. అప్రమత్తంగా ఉండండి...." అంటూ ఆదేశించి బానిసలగుంపును కానుకగా ఇచ్చాడు జిగీషి. "మీకు రక్షగా నా సేనను పంపుతున్నాను. చెప్పింది చెప్పినట్లు జరిగిపోవాలి.... సరేనా!" అన్నాడు.

సంతోషంగా అంగీకరించాడు పణినాయకుడు కౌరుపతి.

సూర్యారాధనోత్సవం ఈ ఏటాడి సంబరంగా జరుగుతోంది అందుకే!

కొండలూ లోయలూ ప్రతిధ్వనించేలా వాద్యాలు మ్రోగడం ప్రారంభం అయ్యాయి ధగధగా జ్వలిస్తున్న సెగళ్ళచుట్టూ చేరి సంఘాలు కోలాహలం చేస్తున్నారు. అర్ధరాత్రి అవుతోంది.

కౌరుపతి నెమ్మదిగా తన శిబిరంలోంచి బైటకు వచ్చాడు. అతన్ని చూస్తూనే సంఘాలంతా వెర్రిగా కేకలుపెట్టి చప్పట్లు కొట్టారు. అతని వెనక నలుగురు బానిసలు నిలువెత్తు సురాభాండాన్ని మోసుకురావడం పరిజనం కంటబడింది. వాళ్ళ కోలాహలానికి అసలు కారణం అదే కొపచ్చు- అందరినోళ్ళూ సురని తలచుకొనేసరికి లాలాజలంతో నిండిపోయాయి!

కొండ నడినెత్తిన జ్వాలలు....

జ్వాలలచుట్టూ పరిస్త్రీలు ఎర్రటి వస్త్రాలు కట్టుకునివ ర్తులాకారంలో నిల్చున్నారు.

వాళ్ళకి వెనుకగా ఎనిమిది దిక్కులకూ దిక్కుకు ఏడుగురు చొప్పున తెల్లని వస్త్రాలు కట్టిన పరిపురుషులు వరుసగా నిలబడ్డారు. ఉదయించే సూర్యునిచుట్టూ కిరణాలు ప్రసరించినట్లున్నదా ఆకారిక!

చుట్టూ చీకటి! మధ్యలో అరుణజ్వాల!

సురామైకం బాగానెత్తికెక్కాక, కౌరుపతి నెమ్మదిగా లేచినిల్చుని, ఒళ్ళు తూలిపోకుండా ఒకచేత్తో తన ఉన్నతాసనాన్ని గట్టిగా పట్టుకుని— "మా ఋగీషి ప్రభువులవారికి కోపం తెప్పించిన దేశద్రోహులెవర్రా?" అని అరిచాడు.

మౌనంగా యోగముద్ర దాల్చిన బ్రహ్మర్షులు నుదురు నేలకు ఆన్చి, తమకు జన్మనిచ్చిన పవిత్ర ధరిత్రికి నమస్కరిస్తూ నిశ్శబ్దంగా కూర్చుని వున్నారు.

కాళ్ళకూ మెడకూ కలిపివేసిన లోహబంధనాలు వారి ధ్యానముద్ర కేమాత్రం అవరోధం కల్పించలేకపోతున్నాయి.

తలారులు ఆ బ్రహ్మర్షుల్ని ఈడ్చుకొంటూ జ్వాలల దగ్గరకు తీసుకు పోయారు.

బలికి రంగం సిద్ధం అయింది.

కాలం చరిత్రలోని అన్ని సంఘటనలకూ సాక్షిమాత్రమే! చరిత్ర గమనంతో దానికి ఏవిధమైన సంబంధంలేదు.

లేకపోవడమే ఆ పవిత్ర చరిత్రుల దురదృష్టం!!

ఇక్కడ ఇది ఇలా జరుగుతుంటే, అవతల మృత్యుదేవులిద్దరు ధర్మసంస్థాపనార్థం తమ కర్తవ్యాన్ని నెరవేర్చడం ప్రారంభించారు.

శిశిరం వెన్నెల కాంతుల్ని జలజలా రాలుస్తోంది. సన్నటి చలిగాలి చర్మాన్ని పులకరింపచేస్తోంది. చీకట్లో మిణుగురులు రెప్పల్ని మిటక రిస్తున్నాయి.

రెండు అడవిగుర్రాల్ని మచ్చికచేసుకొని వాటిమీద అప్సర, సగరుడు-ఇద్దరూ పర్వతాగ్రంవేపు నెమ్మదిగా రాసాగారు!

అప్సర భుజాలమీంచి నడుంమీదకు వ్రేలాడుతున్న చర్మవస్త్రంలో చిన్నారి అసమంజసుడు కమ్మగా నిద్రిస్తున్నాడు.

పర్వతం పైనించి కోలాహలం రానురానూ దగ్గరౌతోంది.

చర్మపు దట్టీలోంచి చురకత్తి లాగి సిద్ధంగా పుచ్చుకుంది అప్సర.

"ఆ కొండపైన చూశావా....చర్మశిబిరాలు....ఆ శిబిరాలకుదూరంగా ఇవతలవైపు మినుకుమినుకుమంటున్న కాగడాలు....కాగడాల వెల్తురులోకే దీక్షగాచూడూ-శూలాలు పుచ్చుకుని కాపలికాస్తున్న సైనికులు కన్పిస్తున్నారు! ఇంకా జాగ్రత్తగాచూడు....కాళ్ళూ చేతులూ కట్టేసి గుట్టలుగా పడివున్న మనుషులున్నారు....బహుశా వానినలే అయివుంటారు....వీళ్ళకి దూరంగా అవతలెక్కడో కేరింతలు విన్పిస్తున్నాయి. విజయ గర్వంతో ఎవరో సంబరం చేసుకుంటున్నారనుకుంటాను...." అన్నాడు సగరుడు.

"సుప్రో ఊహించింది నిజమేకావచ్చు. మనం యుక్తిగా ఈదిక్కులో వున్న బానిసల బంధనాల్ని తెంచగలిగితే.... విజయం మనదే...." అంది అప్సర.

"ఏకనాక ఇచ్చిన మహత్తర అవకాశం ఇది. దీన్ని సద్వినియోగం చేసుకోగలగాలి మనం! ఇలాంటి రోజుకోసమే ఇన్నాళ్ళూ జంతువులమధ్య జంతువుల్లా మెలిగింది ..." అన్నాడు సగరుడు. అతని కళ్ళు ఆనందంగా మెరుస్తున్నాయి.

"మనం ఆ బానిసల్ని ఏ ఆయుధ సంపత్తీ లేకుండా రక్షించగలం అంటావా....?" సందేహంగా అడిగింది అప్సర!

"చూస్తావుగా! ఈ సగరుడి సాహసం ఏమిటో...." అన్నాడు హుషారుగా సగరుడు.

"జాగ్రత్తగా ఆలోచించి మరీ అడుగు వెయ్యి" హెచ్చరించింది అప్సర.

"నువు అసమంజుణ్ణి తీసుకొని అలా పశ్చిమంవేపునుంచి కొండ పైకిరా. నేనిటు బానిసలవైపుగా వెళ్తాను-" అంటూ అప్సర సమాధానం వినిపించుకోకుండానే వేగంగా దూసుకుపోయాడు సగరుడు.

అశ్వహృదయం తెలిసిన అప్సర తనకు బాగా మచ్చికైన ఓ అశ్వాని చెవిలో ఏదోచెప్పింది.... "కళ్ళెములు లేవు....ఒక చేతిలో బాలు... ఎలా తీసుకువెళ్తావో....జాగ్రత్తసుమా...." అన్నది కాబోలు—గుర్రం సకిలిస్తూ తలూపింది—దాని శిరసుమీద పేరుకున్న తుషార బిందువులు ఆ ఊపుకు చుట్టూ చిందాయి.

బానిసలవేపు చీకట్లోకి ఒంటరిగా చేరుకున్నాడు సగరుడు-

ఎత్తుగా పొదగా పెరిగిన తంగేడు పూలచెట్టు నొకదాన్ని బలంగా పెకలించాడు. దాన్ని చేతుల్తోపుచ్చుకుని, దానివెనక నక్కి—కహార్చుని చెట్టుని చాటుచేసుకుంటూ, నెమ్మదిగా ప్రాకుతున్నట్లు కదలసాగాడు.

మూడు పొడవైన వెదురుగడల్ని త్రిపాదిలా నేలలోపాతి, వాటి తలభాగాల్ని ఒకటిగా కలిపి కట్టేశారు. ఆ వెదురుగడల చుట్టూ జంతు

చర్మాల్నిచుట్టారు. చూడడానికి చుట్టుగుడిసెలా వున్న ఆ చర్మపు శిబిరాల్లో జిగీషి సైన్యాధికారులున్నారు.

కొన్ని శిబిరాలు ఏకంగా గుర్రపుబండ్లే! ఆ బళ్ళలో బందీలుగా దొరికిన స్త్రీలు....ఆ స్త్రీల సన్నని ఏడుపు ఆ ప్రాంతపు నిశ్శబ్దతని భగ్నం చేస్తోంది.

తంగెడుపూల చెట్టుని చాటుచేసుకుని బందీలవైపు పాకుతూ వస్తున్నాడు సగరుడు.

బందీలకూ, సైనికాధికారులకూ మధ్య జాగరాలు మండుతున్నాయి.

పొదను అడ్డుపెట్టుకుని అదనుకోసం చూస్తున్నాడు సగరుడు.

జాగరా వెల్తురు బందీలమీంచి లీలగా పొదమీదపడ్తోంది. పొద వెనక గొంతుకకూర్చుని పాకినట్లు నడుస్తున్నాడు సగరుడు.

ఇంతలో, చెట్టు నడుస్తున్న ఈ వైనం అటువైపు కావలివున్న ఒక సైనికుడి కళ్ళలో పడనేపడింది.

వాడు ఆశ్చర్యంగా, చక చకా నడిచి వచ్చాడు.

సగరుడికి తారసపడ్డ మొట్టమొదటి దురదృష్టవంతుడు వాడే.... వాడు చూస్తుండగానే చిన్న పొదలావున్న ఆ మొక్క ఆజానుబాహువైన మనిషంత ఎత్తున లేచినిల్చుంది!భూదేవంత విశాలమైన సగరుని హస్తం!! ఒకే ఒక పిడిగుద్దుతో వాణ్ణి నేల కరిపించి వాడి నోరు నొక్కేసింది-

పిడిబాకు వాడిదే....బాలెం వాడిదే....కవచమూ వాడిదే....ఖడ్గమూ వాడిదే....క్షణాలలో వాడి వేషంలోకి మారిపోయాడు సగరుడు.

ఎంతో పేతగా కావలికాస్తున్నవాడిలా చీకటివైపు స్థిరంగా నిల్చున్నాడు సగరుడు. ఇక్కడ కావలి బాగానే వున్నదని, ఒక్కటొక్కడే సైనికులు నెమ్మదిగా ఆడ బానిసలవైపు జారుకోసాగారు.

అదను చూసుకున్నాడు సగరుడు.

అంతే! బంధీకృతులైన బానిస యువకుల లోహసంకెళ్ళు వరుసగా తెంపివేశాడు. అంతకన్నా వేగంగా, గాటకు కట్టివేసిన గుర్రాల తాళ్ళను నరికివేశాడు సగరుడు. బానిస వీరులందరూ అశ్వారూఢులైనారు!

మత్తులో తూలుతూ, శిబిరాలలో విశ్రాంతితీసుకొంటున్న సైనికాధికారులమీద విరుచుకుపడ్డాడు సగరుడు-అక్కడ గుట్టలుగా పోసిన ఆయుధసంపత్తిని అందుకున్నారు బానిస వీరులు. ఆ బానిసల గుంపుకు ఏకైక నాయకుడు సగరుడు. తొలి విజయంతో జీవితాశయసాధనకు మొదటి మెట్టెక్కాడు.

ఇది ఇలా వుండగా, కాళ్లూ, చేతులూ కట్టిపడేసిన ఆడ బానిసలను ఏదో చేయాలని అటుగావచ్చిన సైనికుడు ఎవడూ బ్రతికి బైటపడలేదు.

అక్కడ అప్సర అనే ఆదిశక్తి అండగావుందని తెలియని ఆ సైనికులు మృత్యువును కౌగిలించుకొని వెళ్ళగల లోకాలకు వెళ్ళిపోయారు

విజయోత్సాహంతో విజృంభించారు అప్సరాసగరులు. బానిసలుగా మారిన భరతవీరులను సమీకరించుకుని జ్వాలవైపు కదిలారు.

చిన్ననాటినుంచీ జగీషుడి చీకటి నూతులలో మగ్గిపోయిన అతనికి బానిస బంధాలను తెంచి, వారికి స్వేచ్ఛను ప్రసాదించగలిగినందుకు ఎంతో తృప్తిగావుంది!

సమస్త మానవాళినీ బానిసత్వంనుంచి విముక్తిచేయాలనేదే అతని లక్ష్యం! దాన్ని అందుకోవడానికే అతని ఈ తపన!!

*　　　　*　　　　*

ఇలాతలం-పర్వతాగ్రాన పణి జనం కేరింతలు—

నడుస్తున్న సరస్వతిలా ప్రకాశిస్తున్న బ్రహ్మర్షుల తేజస్సుని చూసి ముచ్చటపడి, తమ పుణ్యం పుచ్చిందనుకున్నాడు పణినాయకుడు కౌరుపతి!

"ఇంక మా వ్యాపారాలను దేవుడు చల్లగా చూస్తాడు-" అంటూ నేలమీద పడివున్న ఒక బ్రహ్మర్షి ముఖంలో ముఖంపెట్టి చూశాడు.

"ఓరి పురోహితుడా.... నువ్వా! నీకేం పోయేకాలం వచ్చిందని జగీషి ప్రభువుకు ద్రోహం తలపెట్టావయ్యా....సాథరీ? అన్నంపెట్టిన చేతినే కరిచేవాడి వనుకోలేదు...." అని తిట్టిపోశాడు.

సౌభరి మాట్లాడలేదు- మౌనంగా తలవంచుకున్నాడు-

"ఇలాంటి విశ్వాసంలేని వాళ్ళని చేరదీయొద్దయ్యా అంటే, ఆ మానవుడు జిగీషులవారు వినరుగదా.... ఎవణ్ణిపడితే వాడిని పురోహితుడుగా తెచ్చుకోవడం.... ఆ వచ్చినవాడు వెన్నుపోటు పొడవడం...." అంటూ తన ప్రభువుని కూడా కీర్తించుకున్నాడు.

సౌభరి కన్నీళ్ళ పర్యంతం అయ్యాడు.

"కౌరుపతీ! నువ్వన్నట్లు నేను విశ్వాసంలేని జంతువునే! కాని, ఈ బ్రహ్మర్షులు ఏ పాపమూ ఎరగని అమాయకులు! పరుష్ణి తీరంనించి వచ్చి, నా కారణంగా మరణ దండన పొందుతున్నారు. కరుణించి, వాళ్ళని విడిచిపెట్టు...." అంటూ ప్రాధేయపడ్డాడు.

"వదిలేయడమే....?" అన్నాడు కౌరుపతి రౌద్రంగా! ఇంతకు మునుపు సగరుడనే వాణ్ణి త్రిత్సులవారు ఇలానే అజాగ్రత్తగా వదిలేశారట... నేనలాంటివాణ్ణికాను- మీలాంటి కుక్కల్ని కుళ్ళబొడిచి చంపిస్తాను-" అని, ముందుగా ఈ సౌభరి తల నరకమని తలారులను ఆజ్ఞాపించాడు కౌరుపతి.

"తలారులు అగ్నిజ్వాలలకు దగ్గరగా సౌభరిని జుట్టుపట్టుకుని ఈడ్చుకెళ్ళారు. తల నరికేందుకు కత్తి ఎత్తారో లేదో .... ఎట్నుంచి వచ్చిందోలోహపు ములుకుగల ఒక బాణం.... రివ్వున ఆ తలారి తలను తాకింది.

చేతులుచాపి, హేళనగా నవ్వుతున్న కౌరుపతి మీదకు ఒరిగిపోయాడు ఆ తలారి.

నిర్ఘాంత పోయారు పణులు. అదిరిపడ్డాడు కౌ[illegible]!

అంతలోనే శతసింహ గర్జన చేశాడు సగరుడు. ఆ అరుపుకు బెదిరి చెల్లా చెదురుగా పారిపోసాగారు పణిజనం.

అందినవాణ్ణి అందినట్లే, గుండెల్లో గునపాలు దింపి లోయలోకి విసిరేయ సాగారు బానిస వీరులు.

కౌరుపతికి ఎదురుగా గుర్రాన్ని దూకించి నిలుచున్నాడు సగరుడు-! చేతిలో పొడవైన శూలం.... కళ్ళలో లోకాన్ని కనుసైగతో శాసించగల

దర్పం.... గుండెల్లో మహాసాగరాన్ని నింపుకోగల వైశాల్యం.... మూర్తీభవించిన మృత్యుదేవతలా కనిపించాడు సగరుడు. అతన్ని చూసూనే పిచ్చెత్తిన వాడిలా అరుస్తూ, కత్తిదూసి మీదకు విసిరాడు!.

గిర్రున గుర్రాన్ని వెనక్కి తిప్పి, రివ్వున క్రిందకు దూకాడు సగరుడు- కౌరుపతి విసిరిన ఆ కత్తి గురితప్పి, తిన్నగావెళ్ళి, విస్తుపోయి చూస్తున్న రెండవ తలారిని తాకింది. వాడు అక్కడి కక్కడే వెనక్కి విరుచుకుని మంటల్లో పడిపోయాడు-

మనిషిలో నక్కిన మునళ్ళను తొక్కేస్తూ, తోడేళ్ళ కప్పుకున్న మనిషి చర్మాన్ని విప్పేస్తూ. కాలకూటాన్ని నింపుకున్న విషపు కోరల్ని విరిచేస్తూ సగరుడి గుర్రం ఒకే ఒక్క కుదుపుతో కౌరుపతిని లోయలోకి తోసివేసింది-

పణుల పటాటోపం అక్కడితో అణగింది-

ఇక్ష్వాకు వంశాంకురమైన ఆ సగర రాకుమారుడికి దీర్ఘాయువును ఆశీర్వదిస్తూ, సమస్త మానవాళినీ తన పాలనలో సమైక్యపరిచే మనో బలాన్ని ప్రసాదిస్తూ బంధ విముక్తులైన బ్రహ్మర్షులు అతన్ని దీవించారు.

"సగర మహా ప్రభువుకు జయ జయ...." అనే నినాదాలు ఆ పర్వత లోయల్ని ప్రతిధ్వనింప జేశాయి!

* * *

# 4

యుద్ధంలో లొంగిపోయిన శత్రువులా తలవంచుకుంది ఆకాశం.

సమరంలో తనువు చాలించడాన్ని వీరమరణం అని ఎవరన్నారో గాని, చావు తప్పదని తెలిసికూడా సగరుడితో యుద్ధానికి తలపడ్తున్నారంటే, గాంధార సైనికులకు వీరమరణం మీద ఎంత వ్యామోహమో....!

బ్రతకడమో- చావడమో తేల్చుకోవడానికి మనిషికి నాలుగ్గేళ్ళ అవకాశం ఇచ్చింది కాలం....

బ్రతికి చావడం నాగరికులైన ప్రజల లక్ష్యం- చచ్చి బ్రతకడం వీరులైన సైనికుల లక్ష్యం....!

సగరుడు గురిచూసి వదిలిన ఒక్కో బాణాన్ని ఒక్కో గాంధార సైనికుడు మనసారా ఆస్వాదించి తన జీవితాశయాన్ని నెరవేర్చుకుంటు న్నాడు- తీవ్రమైన ఆ బాణోత్కర ప్రచండ వేగ నదికి ఎదురీదాలని ఏ మూర్ఖుడైనా ముందుకు దూకితే, వాడికన్నా ముందు దూకిన వాడికి పట్టిన గతే పడ్తోంది!

అది చండ బాణ విన్యాసం- అది బాహుబల విలాసం- అది విస్ఫు లింగ సందోహం....

ధారగా కురుస్తున్న బాణాల వానకు తడిసి, ధారాళ రక్తచ్ఛటా క్రాంతమైన శరీరంతో సరలోకాలకు దారులు వెతుక్కుంటున్నారు గాంధారులు-

సగరుడనే ఆ చీకటి దొంగని సింధూలోయలో పాతిపెట్టి తిరిగి రమ్మని గాంధార ప్రభువు ఆగీషి ఆజ్ఞ.... అతిక్రమించరానిది ఆ ఆజ్ఞ....!

మొదటి వరుసలో ఉన్న కాల్బలం శత్రువును చీల్చుకొని వ్యూహాన్ని ఛేదించుకుని లోపలికి చొచ్చుకు పోవాలి ముందు....

కాని, ధను, ఇషు, నిషంగాలతో భూమ్యాకాశాలను ఏకంచేస్తున్న ఆ మహావీరుణ్ణి పట్టి బంధించడం అంత సులువైన కార్యంగా తోచడం లేదు వాళ్ళకి.

అర్ధరాత్రి.... శత్రుబాణాలు ప్రాణాలు తోడేస్తున్నాయి-

ఇంద్రుడి వజ్రాయుధం వేటుకి తెగిపడిన పర్వతాల రెక్కల్లా చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. . ఆకాశంలో నక్షత్రాలు-

ఆ చీకటి యుద్ధంలో ఆర్భాటంగా వచ్చిన గాంధారసేన కాగడాలు వెలిగించుకుని పోరుకు తలపడ్తున్నారు. సగరుడి బృందం చీకట్లో పొదల

చాటునుంచి అవలీలగా శస్త్ర ప్రయోగం చేయగలుగుతున్నారు! అది గ్రహించిన గాంధార సేనాని కాగడాలను ఆర్పివేయమని ఆజ్ఞాపించాడు.

అంధకార బంధురం అయింది యుద్ధరంగం అంతా....

మెరపు దాడులు చేయగలగడం ఒక్కటే చాలదు- వాటిని ఎదుర్కొగలగడం ఒక కళ! యుద్ధ కళాకోవిదులు ఏకొద్దిమందో ఉంటారు-

ఈ సగరుడు ఈ విద్యను ఎలా సాధించాడు....?

గాంధార వీరుల ధనుపుల అల్లెత్రాళ్ళు ఛిన్నాభిన్నం అయినాయి-

ఏనుగుల కుంభస్థలాలు పగిలి ఘీంకరిస్తున్నాయి. అస్థి సారయుక్త అశ్వ శరీరాలు ముక్కలుగా తెగి నేల కూలుతున్నాయి-

ఇదెక్కడి యుద్ధం....

కొద్దిసేపు ఎదురుగా నిలబడి కత్తులు దూస్తున్నారు. కొద్దిసేపు అదృశ్యరూపంలో అంప వృష్టిని కురిపిస్తున్నారు.... సగరుడి అనుచరులు-

ఎదురు నిలబడడమే తప్ప- ఎదురుదెబ్బతీసే అవకాశమే దొరకడం లేదు గాంధార వీరులకి-

శిశిరంలో చెట్లు ఆకులు రాల్చుకున్నట్లు తన ప్రధాన బలగాన్నే కోల్పోయాడు గాంధార సేనాని. వెర్రెత్తిన వాడిలా కదనరంగంఅంతా కలియ తిరుగుతున్నాడు. తన సేనని ఉత్తేజితంచేసి ముందుకు దూకమంటున్నాడు!- కానీ, ముందుకు దూకిన వాడు ఎవడూ తిరిగి లేవడంలేదు.....

అంతలో, సగరుడు ఆక్రమించుకున్న చీకటిలో ఒక్కసారి నిశ్శబ్దం ఏర్పడింది. ...ఇది మారిన ఎత్తుగడా ...? లేక ఏమారిన స్థితిలో సగరుడి సేన నేలకరిచిందా....??

ఏమైందో- ఏమౌతుందో- ఎవరికీ ఏమీ అర్థంకాలేదు.

గాంధార సేనాని కాసేపు ఆలోచించాడు- ఏదో ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా "ముందుకు దూసుకు పదండి- రథికులారా ... చెట్టూ పుట్టా అన్నీ వెదకండి ... ఆ చీకటి దొంగ ఎక్కడికి తప్పించుకు పోగలడు....?? వాణ్ణి ప్రాణాలతో పట్టి బంధించండి...." అని అరిచాడు.

"సగరుడు మనల్ని మోసం చేస్తున్నాడు జాగ్రత్త ...!" అని హెచ్చరించాడు.

రథాలు కటిక చీకట్లోకి ముందుకు దూసుకుపోయాయి.

చీకట్లో భీషణ సంగ్రామమే జరుగుతుందని రథాలలో ఆయుధ సంపత్తిని సమృద్ధం చేసుకున్నారు ఆ అతిరథ మహారథులు....

సగరుడు కోరుకున్నదీ అదే....తాననుకున్నట్లే తన వలలో పడ్డారు గాంధారులు....

అక్కడే ఎత్తయిన చెట్లమీద నక్కిన సగరుడి అనుచరులు రథాలు అలా ముందుకు పోగానే, జలజలా క్రిందికి దూకారు

గట్టిగా చూస్తే ఏ నూరో- నూటయాభై మందో....అంతకుమించి లేదు సగర సేన ... క్రిందికి దూకీ దూకడమే హుర్రే అంటూ రథాల వెంటపడి పరిగెత్తారు వాళ్ళు....!!

ముందు చూపే కాదు- వెనక చూపుకూడా లేని గాంధారులు తమ రథాల వెనక జరుగుతున్నదేమిటో గమనించుకోగల స్థితిలో లేరు-

భుజ బలమే తప్ప బుద్ధిబలంలేని ఓ గాంధార రథికుడు - తన రథం వెనకనించి మృత్యుదేవత అధిరోహిస్తోందని గమనించేలోపే, వెన్నులోంచి శూలం దిగబడి, పెళ్ళగించుకుని కూలిన మహావృక్షంలా విరుచుకుని నేలకొరిగాడు.

రథమూ వాడిదే- శూలమూ వాడిదే- పోయిన ప్రాణమూ వాడిదే-

లోహ గదాఘాతానికి కపాలం పగిలి, మెదడు పొరలు దూది పింజల్లా గాలిలోకి ఎగిరి- నేలకు కరుచుకుపోయాడింకో మహారథి- తన తలను వేయి ప్రక్కలు చేసిన ఆ "గద" తన రథంలోనిదేనని గ్రహించే వరకూ వాడు మిగిలిలేడు.

"వెన్నుపోట్ల వీరసేన"గా పేరొందిన గాంధారసేన- వెన్నులోంచే దిగిన శస్త్రాలతో- అస్త్రాలతో పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది.

చిన్నగాలికే నేలరాలిన తుమ్మ పూలయ్యారు గాంధారులు-

ప్రతీకారమే ధ్యేయంగా ప్రజ్వలించాడు సగరుడు. విగత జీవులైనారు గాంధారులు-

ఉగ్రనేత్ర ద్వయంతో అతను ఉరిమి చూస్తే ఇద్దరు సూర్యులు ఒకేసారి ఉదయించినట్లుంది....

సూర్యుడు ఆ మహావీరుని ముఖారవిందాన్ని తన కనులారా వీక్షించాలని ఆత్రంగా పైకిలేచాడు-!

తెల్లవారే సరికి గాంధార సేన నిర్జీవంగా మిగిలిపోయింది.

ప్రాణాల మీద ఆశలేని సైనికుడు ఈ నరజన్మను ఛీకొట్టి వెళ్ళిపోయాడు. ఆశ చావనివాళ్ళు తలలు వంచుకుని చేతులెత్తి నిల్చున్నారు-

గాంధార సేనాని ప్రాణాలతో పట్టుబడ్డాడు- వాడివంక వాడిగా చూశాడు సగరుడు-

వాడే వీడు-

పది సంవత్సరాలక్రితం తనను పట్టి- చీకటి నూతులలోకి తోసి, చిత్రహింసలు పెట్టిన కర్కోటకుడు వీడే! పసివాణ్ణని కూడా ఎంచక బాధించిన రాక్షసుడు వీడే!!

ఆనాడు వీడు మామూలు సైనికుడు- తనను బంధించి జిగీషుడి మెప్పుపొంది- ఈనాటికి సర్వసైన్యాధ్యక్షుడైనాడు కాబోలు....

వాణ్ణి చూస్తూనే దశాబ్ద కాలం గుండెలలో అణిగి ఉన్న అగ్నిపర్వతం ప్రజ్వరిల్లినట్టయ్యింది-

కాని, అంతలోనే కరుణార్ద్ర హృదయంతో వాడిని లేవనెత్తాడు సగరుడు.

"సేనాధిపతీ! సైనికులుగా మీరందరూ చేసిన తప్పులకు మీ ప్రభువు జిగీషి బాధ్యుడు! నిన్నిదే క్షమించి వదులుతున్నాను- పో.... పోయి ఆ దుష్ట భ్రష్ట జిగీషులకు చెప్పు....

మహర్షులైన శాస్త్రవేత్తలను హింసించే పనికి ఇంకెప్పుడూ పూనుకోవద్దని-! భూమిని దున్ని పంటలు పండించే కర్షక జనానికి నీటిని అడ్డగించి-నోటిని కొట్టి-బానిసలుగా మార్చవద్దని-!!

యుద్ధం ఒక పరిశ్రమ కాదూ- కాకూడదూ-!!

సేనాపతీ-! పాలకులు ప్రజాపాలన చేయడానికిగాని, ప్రజా పీడనకు కాదని చెప్పు".... అని, చీదరించుకుని వాణ్ణి అవతలకు తీసుకు పొమ్మ న్నాడు-

సగరుడి మాటలు విన్న సౌభరి ఒక్క-క్షణం విస్తుపోయి తేరు కున్నాడు- "ఇరవై వసంతాల అతని వయసులో- చివరి సగభాగం కూప శిక్షలోనే గడిపిన సగరుడి యువక హృదయం ఇంతలో ఎంత విశాలంగా ఎదిగిపోయిందీ...." అనుకున్నాడు!

చిరంజీవీ! సగర కుమారా! జిగీషుడి కొలువులో ఇన్నేళ్ళ పౌరో హిత్యం వెలిగించాను- కాని, ఏనాడూ ధైర్యం చేసి ఇంత హితవు చెప్ప లేకపోయాను.... అతని క్రౌర్యానికి వెరచి మౌనవ్రతుడిగా ఉండి పోయాను-

నాయనా! నీవంటి సంస్కా-రవంతులు పూనుకుని మానవాళిని ఏకం చేసే సమయం ఆసన్నమయింది-

ప్రపంచ జాతులను సంఘటితంచేసి, ప్రజాతంత్ర వ్యవస్థని నెలకొల్పు తండ్రీ.... చరిత్రలో మహాచక్రవర్తిగా విలసిల్లు...." అని ఆశీర్వదించాడు సౌభరి.

ప్రపంచ విజేతగా సుస్థిర సామ్రాజ్యాన్ని నిర్మించే దిశగా తన ఆలోచనలను ముందుకు ప్రసరింపచేస్తున్నాడు మహాసగరుడు!!

*  *  *

సగరుడి ఆదేశం మేరకు నాగళ్ళను తయారుచేస్తున్నారు వడ్రం గులు- వాటికి ఇనుప కర్రును బిగిస్తున్నారు కమ్మరులు- వాటిని లాగేం దుకు పశువుల్ని సిద్ధం చేస్తున్నారు వీరులైన కర్షకులు-

శునం వాహాః శునం నరః శునం కృష్ణ తు లాంగలం ... అని కీర్తించి సౌభరి వ్యవసాయ పనులు ప్రారంభింప చేస్తున్నాడు.

సగరుని అనుచరులుగా మారిన బానిస వీరులు యుద్ధ విద్యలు సాధన చేస్తున్నారు.

కవచాలూ, శిరస్త్రాణాలూ, ఇనుప కత్తులూ కటార్లూ తయారించి, సత్రాలనూ, రథాలనూ యుద్ధాల కనుగుణంగా తీర్చిదిద్దుతోంది అప్సర!

గంగా మైదానంలో అపురూపమైన నాగరికతా విశేషాన్ని రూపొందించడంలో ఆమె తలమునకలుగా ఉంది.

ఈ తరానికి ప్రపంచ విజేత మీరే....! ఈ ప్రపంచం అంతా మీ అధీనంలోకి వచ్చేవరకూ నేను విశ్రమించను....!! అది ఏనాడో నేను చేసిన ప్రతిజ్ఞ!" అన్నది అప్సర గర్వంగా!

సగరుడు నవ్వి ఊరుకున్నాడు-

స్వతంత్ర రాజ్య స్థాపనచేసి, వివిధ గణాలను జయించి, గణ నాయకుడిగా కొంత ఎదిగాక సగరుడు సాధ్యమైనంత తక్కువగా మాట్లాడటం నేర్చుకున్నాడు.

అతని ఈ మౌనవ్రతం అప్పుడప్పుడూ అప్సరకు చిరాకు కల్గిస్తుంటుంది- ఒకరోజు "మీ తండ్రిగారు- మహామహులు ప్రసేనజిత్తులే బ్రతికి ఉంటే మాకే దురవస్థ పట్టేదా.... ఆయన కుమారుల అధీనంలో ఉన్నాం కాబట్టి, భరించక తప్పదుకదా ..." నిష్ఠూరంగా అని ప్రక్కకు వెళ్ళిపోబోయింది కోపంగా అప్సర-

"పోనీ ప్రసేనజిత్తులవారు చేయదలచిందేదో తమరు మాకు సూచించండి మహారాణీ.... నిష్ఠూరాలెందుకు?-" అంటూ వెళ్ళిపోబోతున్న ఆమె చెయ్యి పుచ్చుకుని దగ్గరగా లాక్కున్నాడు సగరుడు-

"మేము మానవ భాషలో మాట్లాడితే, మీరు మౌన భాషలో సమాధానాలిస్తున్నారుగా మహారాజా.... అందుకని.. ." అంది అప్సర-

సగరుడు ముఖం ప్రక్కకు తిప్పుకొని నవ్వును దాచుకొన్నాడు-

"చూడండి గణనాయకా!మనం కొన్ని జీవితాశయాల కోసం బ్రతుకుతున్నవాళ్ళం-యుద్ధ కాంక్షతోనో, అధికార వ్యామోహంతోనో అందలాలు

ఎక్కాలని ఉవ్విళ్ళూరుతున్నవాళ్ళం కాదు. ప్రసిన్వతులవారు వదలివెళ్ళిన కార్యాన్ని మనం నెరవేర్చగలగాలి....” అంది ఒక నిర్ణయానికి వచ్చిన దానిలా అప్సర—

సగరుడు ఇంక నవ్వును వాపుకోదలచలేదు. గాంభీర్యాన్ని సడలించుకొని, ఆమెను గుండెలకు హత్తుకున్నాడు—

“అప్సరా! నా కర్తవ్యాన్ని ఎప్పటికప్పుడు గుర్తు చేస్తూ నువు అందిస్తున్న సూచనలు మహత్తరమైనవి-నా హృదయ సామ్రాజ్యానికి పట్టపు రాణివే కాదు....అప్సరా....భవిష్యత్తులో మనం నెరపనున్న రాజకీయ మంత్రాంగానికి మహామంత్రిణివికూడా నువ్వే....మానవజాతిని ఆదర్శవంతమైన మార్గాన నడిపించు....” అన్నాడు సగరుడు!

అప్పటివరకూ నటించిన కోపాన్ని వదిలేసి దరహాసం చేసింది అప్సర—

“మహామంత్రిణీ అప్సరకూ జయ! జయ!” అంటూ బిగ్గరగా అరిచి చప్పట్లు కొట్టాడు సగరుడు.

“ఆగండాగండి—‘అప్సర’ అనే పిలుపు మీ ఇష్టసఖిగా ఉన్నప్పుడే సుమా....నేను అసురసేనిని—చిన్నప్పుడు మా ప్రజలు అచ్యురసేనీ—అని పిలిచేవాళ్ళుకూడా!....కాబట్టి రాజవ్యవహారాల సమయంలో ‘ప్రధాన మంత్రిణీ అసురసేనీ-’ అని పిలవండి....” అన్నది శాసిస్తున్నట్లు అప్సర-

“తప్పకుండా మహామంత్రిణీ—మేమెప్పుడూ నీ సూచనలప్రకారమే నడుచుకుంటాం....ఏదీ ఆజ్ఞాపించి చూడండి...” అంటూ కవ్వించాడు సగరుడు—

“ఆజ్ఞాపించడానికీ, సూచించడానికీ మధ్య చాలా భేదముంది మహారాజా....!” అంది చురచురా చూస్తూ అప్సర—

“మీరు మా హృదయ సామ్రాజ్యాన్నే ఏలుతున్నవారు. మేం మా హృదయం చెప్పినట్లు నడుచుకుంటాం....అంటే మీరు శాసించినట్లు వినడమే కదా....మహామంత్రిణీ...” అని గట్టిగా కౌగిలించుకున్నాడామెని సగరుడు. ఇద్దరూ ఆ సంభాషణకు పగలబడి నవ్వుకున్నారు-

ఇంతలో - వార్తాహరుడు ప్రవేశించాడు-భరత గణ రాయబారి తమ దర్శనంకోసం వేచివున్నాడని విన్నవిస్తూ—

ప్రవేశపెట్టమని ఆజ్ఞాపించాడు సగరుడు—

సగరుడు స్వతంత్ర ప్రభువుగా గుర్తింపు పొందడంతో, అతని విజయాన్ని కాంక్షిస్తూ, అతని సాయాన్నికోరుతూ అనేకానేక గణాధిపతులు శుభాకాంక్షలు పంపుతున్నారు. ఇప్పుడు సాక్షాత్తూ భరత గణ పాలకుడు ప్రవీరుడే తనవద్దకు రావాలని కోరుతున్నట్లు రాయబారి వర్తమానం మోసు కొచ్చాడు—

నిజంగా ఇది తన విజయపరంపరలో మరో మలుపు—అప్సర ఆలోచనా క్రమంలో మహత్తర విజయం....

లోకోత్తరమైన ఈ కార్యభారాన్ని భుజాన వేసుకున్న ఆ దంపతుల జీవితంలో ప్రారంభమైన ఈ మలుపు ఎటు దారితీసుకుంటుందో....

కాలమే దానికి సాక్షి!!

* * *

సకల రాజలాంఛనాలతో ప్రవీరుడికి స్వాగతం పలికింది అసుర సేని-మహామంత్రిణి!

మంగళవాద్యాలు కర్ణపేయంగా విన్పిస్తుంటే, బ్రహ్మజ్ఞానులైన మహర్షులు ఋక్మంత్రాలు పఠిస్తున్నారు.

ఓషధీయుక్తమైన సుగంధ ధూపాలతో వాతావరణం పవిత్రతను సంతరించుకుంది.

పరిచారికలు పన్నీటిజల్లులు కురిపిస్తున్నారు.

ప్రవీరుడి బృందంతో కలిసి వశిష్టమహర్షి కూడా ఇక్ష్వాకు వంశోద్భవుడైన ఆ సగరుని చూడాలని ఎంతో ఆశగావచ్చాడు.బ్రహ్మర్షి కులానికే తలమానికమైన వశిష్టులవారికి ఉన్నతాసనాన్నిచ్చి ప్రత్యేకంగా గౌరవించారు సగర దంపతులు.

ఆయన పాదాలను ప్రక్షాళనంచేసి నీళ్ళు నెత్తిన చల్లుకున్నారిద్దరూ!

"చిరంజీవీ! సగర కుమారా! నీకు ఆశయసిద్ధి కలుగుగాక!" అని ఆశీర్వదించాడు వశిష్టుడు. సగరుడు మనసారా ఆయన పాదాలను స్పృశించి కళ్ళకద్దుకున్నాడు.

"మానవజాతి కళ్యాణానికి తోడ్పడి - చరిత్రలో మహాసగరునిగా ఆచంద్ర తారార్కం వర్ధిల్లునాయనా!" అని దీవించాడు వశిష్టమహర్షి.

వశిష్టుని తర్వాత భరతగణ పాలకుడు ప్రవీరునికి రాజోచిత సత్కారాలు చేసి సేవించారు అప్సరా సగరులు-

ఇక్ష్వాకు వంశాంకురం సగరుడనే పేరుతో మొక్కయి, మ్రానై, మహావృక్షంగా తయారౌతోందని-అతని జన్మ రహస్యం గురించి కథలు కథలుగా చెప్పుకొంటున్నారు వివిధ దేశాలలోని జనసామాన్యం!

కొందరికి ఈ మహావృక్షం కల్పవృక్షంలా కన్పిస్తోంది. దాన్ని ఆరాధించి పూజిస్తున్నారు వాళ్లు.

కొందరికది గుండెలలో దడపుట్టించి నిద్రపోనీయడంలేదు.

కొందరు తటస్థంగావుండి వేచిచూసే పద్ధతిలో పరిస్థితుల్ని పరిశీలిస్తున్నారు.

ప్రపంచ చరిత్రని నిర్దేశించే దశలో సగరుడు ఒక్కొక్క మెట్టే ఎక్కుతూవుండగా....అదను దొరికితే-ఏదో ఒక మాయోపాయంతో అతన్ని లోబరచుకొని,తన శత్రువులమీదకు ఉసిగొల్పాలని ఆశించి వచ్చారు ..భరత గణపాలకుడు ప్రవీరుడూ-పురోహితుడు అష్టకుడూ.... !

"నాయనా! సగరకుమారా! జిగీషి చేసిన మిత్రద్రోహానికి బలిఅయి, మీ తండ్రి ప్రసిన్వతులవారు మరణించేనాటికి, మీ తల్లి గర్భవతి. ఆమె సహగమనానికి తలపడుతున్నప్పుడు ఉర్వమహర్షి వారించి, ఆమెగర్భంలో జగజ్జేత పెరుగుతున్నాడనిచెప్పి, ఓదార్చి తన ఆశ్రమంలో చేరదీశాడు. నువు పుట్టావన్నవార్తవిని, మేమంతా నిన్నుసంరక్షించుకోవాలని బయలుదేరాం...

కాని, అప్పటికే ఉర్వమహర్షిని కూడా జిగీషి సంహరించాడని విన్నాము.

మీ కుటుంబం ఆ తర్వాత ఏమైందో తెలుసుకోలేకపోయాం— ఇన్నాళ్ళకు నువు విజేతగా ఎదిగావని విని ఆనందం ఆపుకోలేక, నిన్ను చూడాలని ఆత్రంగా వచ్చాను నాయనా!" అన్నాడు—

తన జన్మరహస్యాన్ని నలుగురి ఎదుటా వివరించి, తాను ఇక్ష్వాకు వంశ సంజాతుడననీ, ప్రసేన్వతుని పుత్రుడిననీ బహిర్గతమొనర్చిన వశిష్టుల వారికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్కరించాడు సగరుడు.

తన తండ్రిని వెన్నుపోటుపొడిచి చంపిన జిగీషి కర్కశత్వాన్ని ఈ విధంగా బట్టబయలు చేసినందుకు మనసులోనే ధన్యవాదాలు చెప్పుకున్నాడు!

వశిష్టుడు ఇలా ప్రసంగిస్తూ వుండగా భరత గణ పురోహితుడు అష్టకుడు నెమ్మదిగా ప్రవీరుని చెవిలో గొణగడం మొదలుపెట్టాడు—

"ఈ వశిష్టుడే మనకు నిజమైన శత్రువు. సగరుణ్ణి ఎలా రెచ్చగొడ్తున్నాడో చూశావా....వాడి తండ్రి ప్రసేన్వతుడి తర్వాత భరతగణపాలకులుగా అధికారంలోకి వచ్చింది మనమేనని 'సూచనగా' అందిస్తున్నాడు. సమయానికి మనం ఇక్కడ వున్నాం కాబట్టి సరిపోయింది-లేకపోతే 'భారతీయ సింహాసనం నీదేనాయనా! వచ్చి అధిరోహించు' – అనేవాడే...."

అష్టకుడి మాటలకు ప్రవీరుడి ముఖం కందగడ్డలా ఎర్రగామారింది. అష్టకుడుమాత్రం చిర్నవ్వు పులుముకుని ప్రసన్నతను అభినయిస్తున్నాడు.

ప్రవీరుడి మనోభావాలనీ, అష్టకుని మేధాశక్తినీ లెక్కగడుతోంది మహామంత్రిణి ఆసురసేని! వాళ్ళ చూపులలో ఏదో కుట్రని ఆమె చురుకైన కళ్లు పసిగట్టకపోలేదు-

ప్రవీర సార్వభౌముడు తన క్రౌర్యాన్ని మనసులోనే దాచుకొంటూ తన ఆసనంమీంచి లేచి, ఒక ముత్యాలహారాన్ని సగరుడి మెడలోవేసి అతన్ని గౌరవించాడు. అష్టకుడు ఆయన వెనకేలేచి నిల్చుని, చప్పట్లుచరిచి, "సగర ప్రభువుల వారికి జయం! జయం!" అన్నాడు.

ఆ తర్వాత పళ్ళెరంలో పోసిన మణిరాసులను అప్సరకు కానుకగా అందిస్తూ—"మహామంత్రిణి ఆసురసేని చల్లని చూపులు మా భరతజాతి పైన ప్రసరించుగాక...." అన్నాడు.

"విజ్ఞాన ధనులైన భరతగణానికి పాలకులు ...మీవంటి నాగరకులు మమ్మల్ని ఆశీర్వదించడానికి విచ్చేసినందుకు మ హెంతో గర్వంగావుంది. ఏమియ్యగలవారమో.... మీకు-" అన్నది అప్సర - కానుకలను అంగీక రించకుండానూ- తృణీకరించకుండానూ-

"కానుకలు మా అభిమానంకొద్ది- కార్యం తమరిదయ-" అని మణి రాసుల పళ్ళెరాన్ని ఆమె ప్రక్కనే వుంచాడు అష్టకుడు.

"బీజానికీ వృక్షానికీ సంబంధంలేకుండా ఎలావుంటుంది చెప్పండి అమాత్యా!" అన్నది అప్సర.

"ఒక బీజం ఒక వృక్షాన్నే సృష్టిస్తుంది మహామంత్రిణీ! కాని, మీ వంటి మహావృక్షం- మాబోటి వేలాది ఆర్తులలో ఆశలు మొలకెత్తించ గలదు...." అన్నాడు అంతకంటే తెలివిగా అష్టకుడు.

ఆ యిద్దరూ ఏదో మానవాతీత భాషలో సంభాషిస్తున్నారనిపించింది, అయినా, అప్సరమీది అపార నమ్మకంతో వినోదం చూడసాగాడు సగరుడు.

ఆడది ప్రధానిగా ఉంటే, మణిరత్నాలకు తేలికగా లొంగిపోతుంది లెమ్మనుకున్నాడు అష్టకుడు. వచ్చినతర్వాత, లొంగదీసుకోబోయి- లొంగి పోతామేమోనని భయంపట్టుకుందతనికి.

అప్సర సంభాషణా చాతుర్యానికి మెచ్చుకోలుగా చూశాడు వశిష్ట మహర్షి. జిగీషితో ఈ ఇద్దరికీ రహస్య సంబంధాలున్నాయని ఆమెకు తెలియజేయడం ఎలాగా.... అని ఆలోచిస్తున్నాడు. కాని, ఆ విషయం ఆమెకు ముందే తెలుసన్నట్లుంది ఆమె తీరు-

నగలకు లొంగకపోతే, ఏడుపుతో పని సానుకూలం చేసుకోవడం అవసరంగా భావించాడు అష్టకుడు. వెంటనే గడ్డ్లనీరు కుక్కుకుంటూ, "మహామంత్రిణీ! మా భరతులంటే అహింసావాదులని మీకు తెలుసు- ఈ

చెంపన కొడితే ఆ చెంప చూపుతూవుంటారు. చీమకయినా హాని తలపెట్టని మాపైన- నీచులైన తాళజంఘులు, తుచ్ఛులైన తృత్సులూ యథేచ్ఛగా దాడి చేసి మమ్మల్ని దోచుకుపోతున్నారు. అగ్నిహోత్రాలను అపవిత్రం చేస్తున్నారు. తపోధనులైన మహర్షులకు మా నేలపైన రక్షణ లేకుండాపోయింది. మునివాటికలమీద దాడిచేసి, మునిపత్నులను చెరబట్టి దాసీలుగా అమ్మివేస్తున్నారు—" అన్నాడు.

వింటున్న అప్సర మధ్యలో అందుకుని అడిగింది.

"మునిపత్నుల్ని అపహరించింది మీలోనే కొందరు సంపన్నులని విన్నాం ... నిజమేనా....?" అని!

ఆ ప్రశ్నకు దెబ్బతిన్నా, అష్టకుడు చలించకుండా వెంటనే సర్దుకుని- "అలాంటివారు మాలో కూడా ఉంటే ఉండవచ్చు తల్లీ - హైహయ నాయకుడు జిగీషి అసామాన్యుడమ్మా! మా దేశంలోనే ఏమిటి, ఏకంగా మీ మందిరంలోనే తన మనుషులను కీలక స్థానాలలో నియమించగలడు.... జాగ్రత్త సుమా!" అని హెచ్చరించాడు.

"అవునవును! జిగీషి త్వష్టల విషయంలోనే కాదు- ఇంకా చాలా మంది విషయంలో కూడా అప్రమత్తంగా వ్యవహరించాలని మాకూ తెలుసు—" అంటూ చురక అంటించింది అప్సర.

అష్టకుడు ఇంక మారుమాట్లాడలేదు.

అప్సరే అందుకుని అంది- "అయితే తాళజంఘాది జాతుల్ని అంతం చేయనిదే భరతులకు విముక్తి లేదంటారా....?" అని సంభాషణను కొనసాగించింది.

అవునన్నట్లు తలఊపాడు ప్రధాని.

"మరి, వారికి సహకారం ఇస్తున్న త్వష్ట, జిగీషులమాటేమిటి....?" అని ప్రశ్నించింది అప్సర.

ఆమె మాటలలోని మార్మికత అంతుపట్టలేదు ప్రధానికి.

"తాళజంఘుల్ని జయించాలంటే ముందు త్వష్ట, జిగీషులు అంతం కావాలనుకుంటాను—?" రెట్టించింది అప్సర.

అవునంటే యుద్ధవ్యయం! అంతా మీదేనంటుంది! కాదంటే, వాళ్ళతో నీ సంబంధం ఏమిటని అడుగుతుంది. అందుకని మౌనంగా ఊరుకున్నాడు ప్రధాని అష్టకుడు.

"కాబట్టి, మీకోసం- కేవలం మీ కోరికమీదే- త్వష్ట జిగీషుల నిర్మూలన చేయడానికి మేం అంగీకరిస్తున్నాం.... ఆ తండ్రీ కొడుకుల చావుతో మీ భవిష్యత్తు ముడిపడివుంది కాబట్టి...."

మెలికలుగా వస్తున్న ఆమె మాటలకు ప్రధాని ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. కాస్త ఆలోచించి—

"మా భరతుల అభ్యున్నతికోసం మీరామాత్రం త్యాగం చెయ్యక తప్పదుతల్లీ...." అంటూ వక్రంగా నవ్వాడు.

అతని మాటల్లోని వ్యంగ్యాన్ని వెంటనే తిప్పికొట్టింది అప్సర.

"ఇందులో మా త్యాగం ఏముందీ.... ఆయుధాలు మీవి.... సైనికులు మీవాళ్లు.... యుద్ధవ్యయం అంతా మీదేకదా.... వ్యూహాన్ని రూపొందించి సమర్థవంతంగా నడిపించడం ... అనే చిన్నపని చేసిపెట్టినంత మాత్రాన అరిగిపోతామా.... కరిగిపోతామా...." అని.

అప్సర మాటలకు నివ్వెరపోయారు ప్రవీరుడూ అష్టకుడూ! "భళి భళీ...." అని మెచ్చుకున్నాడు వశిష్టుడు.

తాళజంఘుల మీద దాడికోసం సగరుణ్ని సమ్మెకంగా వరుష్ణీ తీరానికి రప్పించి అక్కడ వంటరిగా చూసి అతన్ని హతమార్చేయాలని జిగీషి పన్నిన పన్నాగంలో భాగంగానే ఇక్కడికి వచ్చారు ప్రవీర అష్టకులు- కాని, వారి పథకం ఇలా ఎదురు తిరిగింది.

అష్టకుడు కాస్త తమాయించుకుని నెమ్మదిగా అన్నాడు-

"త్వష్ట, జిగీషుల నిర్మూలనకు మేము ఒక పథకాన్ని ఈసరికే సిద్ధంగా వుంచాం.... తమరిని మేం కోరవచ్చిందేమంటే, ఆ పథకం ప్రకారం తమరు మా సేననూ, తమ సేననూ కలిపి నడిపించడమే...." అంటూ నసిగాడు.

(14)

వెంటనే రౌద్రంగా మారిపోయింది అప్సర-

"దుష్టజన సంహార కార్యాన్ని మేమే స్వయంగా నిర్వహిస్తాం.... అతి సుకుమారులైన ప్రవీర సార్వభౌములకు శ్రమకల్గించడం మాకు ఇష్టంలేదు- వారు దూరంగ చూస్తూ వుంటారంతే! యుద్ధాన్ని మేమెలా నడిపిస్తామో తమరూ చూడ్డానికిగాని...." అంది అప్సర.

యుద్ధ వ్యయాన్ని భరిస్తూ, గెలిచిన భూ-పశు సంపదలలో భాగ స్వామ్యం కోరకుండా అంగీకరించి, ప్రవీరుడూ, అష్టకుడూ ఇంటిముఖం పట్టారు-

వాళ్ళని రహస్యంగా వెన్నాడుతూ రెండు నీలికళ్ళు ముందుకు కదిలాయి....!

# 5

"హైహయ నాయకుడు జిగీష ప్రభువుకు-

ఇక్ష్వాకు వంశోద్భవుడు సగరుడు హెచ్చరికగా వ్రాస్తున్న లేఖ—

అజ్ఞానంతోనూ, అహంకారంతోనూ నన్ను 'బలి' చేయించాలని మీ తండ్రీ కొడుకులిద్దరూ చేసిన ప్రయత్నాలు నిష్ఫలమైనాయి! దేవతల వరాలతో నేనిప్పుడు స్వతంత్రప్రభువునైనాను.

నిజానికి ఇది మీ చలవే...

ఎందుకంటే, "హైహయ మేధం" చేయాలనేదే నా జీవితాశయం కాబట్టి-! మీ హైహయ వంశ నిర్మూలన కోసమే అహరహం శ్రమిస్తున్నాను కాబట్టి....!!

ఎప్పటికప్పుడు కొత్తతరం పుట్టుకొచ్చి, పాతతరాన్ని నిలదీసి ఇలా ఎందుకుచేశారని ప్రశ్నించడం సహజం....

కాని, మా తండ్రిని ఎందుకు వెన్నుపోటు పొడిచారనో, నన్నెం దుకు కూపాలలో బంధించి హింసించారనో మిమ్మల్ని ప్రశ్నించబోవడం లేదు నేను....!

నాగరికతా విధ్వంసకులైన మీకు అలాచేయడం సహజలక్షణమేనని నాకు తెలుసు!

మనుషుల్లో మానవత్వాన్ని నశింపజేసి, మనుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు తెంచివేసి, బానిస వ్యవస్థను పెంచిపోషించే మీవంటి ఏడ పురుగులలో హితవచనాలతో మార్పు వస్తుందని ఆశించే అమాయకుణ్ని కాదు—

నరుల మధ్య మానవులుగా మెలగలేని మీకిదే నా తుది హెచ్చరిక—

'బలం వున్నవాడిదే రాజ్యం' అని మీరనుకొనేట్లయితే, పరుష్ణి తీరంలో శాళజంఘుల్ని, తృత్సుల్నీ మేము జయించబోతున్నాం....చేతనైతే మీ నమ్మిన బంట్లను రక్షించుకోగలరేమో ప్రయత్నించండి....!!

విజృంభించిన ఉత్సాహంతో మా సేన కరవాలాలతో కరాళనృత్యం చేస్తున్నప్పుడు మిమ్మల్ని ఆదుకోవడానికి మీ త్వష్టులు వేయి మందైనా చాలరు....

ఆలోచించుకోండి....

మానవత్వానికి మీరుచేసిన ద్రోహానికి పశ్చాత్తాపంతో మీరు కుళ్ళి పోయేరోజు సమీపంలోనే ఉంది—

ఇప్పటికైనా, ఈ లేఖను తీసుకువచ్చిన రాయబారులకు మీ లొంగు బాటును ప్రకటించి, మానవ కళ్యాణానికి మనిషిగా మీవంతు కర్తవ్యాన్ని నెరవేర్చుకోండి....

మీరు పెడమార్గానే పోవడానికే సిద్ధపడితే, అది మీతోపాటు, మీ సైనికుల దురదృష్టంగా పరిణమించగలదు—" అని తీవ్రంగా హెచ్చరిస్తూ సగరుడు వ్రాసిన లేఖను పుచ్చుకుని మహర్షులైన ఇద్దరు రాయబారులు జిగీషిని కలిశారు!

త్వష్ట ఆ లేఖను చదువుతున్నాడు- అతని శరీరంలో ఒక్కో రోమం నిక్కబొడుచుకోసాగింది.

పెర్రెత్తినవాడిలా చిందులు తొక్కుతున్నాడు జిగీషి.

"పిల్ల కాకి.... నాకే హెచ్చరికలు పంపుతాడా .... వీడి తండ్రే నా దెబ్బకు అదిరిపోయాడు-వీడా నన్ను లొంగిపొమ్మనేది—?" అంటూ త్వష్ట చేతిలోంచి లేఖగా వచ్చిన చర్మపత్రాన్ని లాగి, చించి ముక్కలుచేశాడు జిగీషి!

"ఉత్సవం చేసుకొంటున్న పణులమీద చీకటిదెబ్బ తీసినంతమాత్రాన మొనగాడిననుకుంటున్నాడా?అర్ధరాత్రియుద్ధంలో మా సేనానాయకుడినిగెలవ గలిగినంతమాత్రాన అదే మహత్తర విజయం అనుకుంటున్నాడా-? గంగా తీరంలో చిన్నచిన్న గణాలను బెదిరించి ఆక్రమించడమే రాజ్యవిస్తరణ.... అనుకొంటున్నాడా?....ఇంతమాత్రానికే అంత అహంకారమా....మెరుపు దాడులు చేయడంలో విశ్వవిఖ్యాతుణ్ని....ఇంక నేనెంత అహంక రించాల....? అంటూ సౌధం దద్దరిల్లేలా పెడబొబ్బలు పెట్టాడు జిగీషి!

కోపంతో ఊగిపోతూ - "త్వష్టా! బయల్దేరు - పరుష్ణి నదిచుట్టూ సైన్యాన్ని మోహరించు-తాళజంఘులు మనవాళ్ళు—భరత గణాధిపతి ప్రవీ రుడు కూడా మనవాడే. తృత్సులు మన శిష్యులు. .. వీళ్ళందరికీ మన 'అభయం' ఉంది....

ఈ యుద్ధనెపంతో భరత సింహాసనాన్ని ఆక్రమించే దురుద్దేశం వాడికేదో ఉన్నట్లు ప్రవీరుడు ఇంతకు ముందే సమాచారం పంపాడు—

పరుష్ణి నది దాటి-వాడు అడుగుపెట్టకూడదు....జాగ్రత్తగా కార్యం సాధించు—" అని ఆదేశించాడు జిగీషి.

ఆ మాటలు వింటూనే ఎగిరి గంతేశాడు త్వష్ట! చాలాకాలం తర్వాత చేతినిండా పని దొరికినందుకు అతనికి సోమపానం చేసినంత సంబరంగా ఉంది—వికటాట్టహాసం చేస్తూ, కండలు చరుచుకొంటూ, మీసం మెలి వేశాడు!

రాయబారం వచ్చిన మహర్షులు మౌనంగా నిలబడేవున్నారు. రాయబారులను నిలబెట్టి మాట్లాడటం ఆర్య సాంప్రదాయం కాదు-అయినా అవమానాన్ని సహిస్తూనే-మానవ కళ్యాణదిశగా మళ్ళమని హితవు చెప్పారు జిగీషికి రాయబారులిద్దరూ!

"జిగీషి ప్రభూ! ఇది నీకూ నీవంశానికీ క్షేమకరంకాదు-వయసులో నీకన్నా వృద్ధులం కాబట్టి చెబుతున్నాం. సగరుడి మాట లక్ష్యపెట్టు! ఈ రోజు బలహీనులను జయించి దోచుకుంటున్నావు-రేపునీకన్నా బలవంతుడు నిన్నూ అదేపని చేస్తాడు. నేనే సర్వస్వం అనుకునేవాడు పతనానికి దగ్గరౌతాడు. ఆలోచించు ప్రభూ....!!" అన్నారు.

ఆ మాటలకు మరీ వెర్రెత్తిపోయాడు జిగీషి. "త్వష్టా" అని అరిచాడు.

యుద్ధ ఉన్మాదంలో మైమరచి ఊగుతున్న త్వష్టుడు కత్తిదూసి నిల్చున్నాడు.

"రాయబారం అంటూ వచ్చి, మనల్ని అవమానిస్తున్న ఈ ముష్కరులిద్దరినీ పుష్కలావతి నడివీధిలో నిలిపి తలలు తెగనరుకు-ఆ సొగరుబోతు సగరుడి ఉత్తరానికి సమాధానంగా ఆ తలల్ని గుర్రాలకు కట్టి వాడికి పంపించు...." అంటూ ఆజ్ఞాపించాడు.

మరొకసారి వికటాట్టహాసం చేశాడు త్వష్ట!

ఆ నవ్వులో మానవతా వికాసాన్ని ముంచెత్తే ఫెళఫెళారావాలు ఉన్నాయి!!

మలయసమీరాలతో కుభా నది [కాబూల్] వెన్నెల వేడుకలు చేసుకొంటూ చల్లగా పరవశిస్తోంది-

ధనవంతుడి సౌధంలో కొవ్వు దీపాల కాంతిలా నదీతరంగాలు తళుక్కుమంటున్నాయి-

సౌధం ఆవరణలో అందంగా అలంకరించి, తీర్చిదిద్దిన ఉద్యానవనంలా నదీ పరీవాహక ప్రాంతం పచ్చగా మెరిసిపోతోంది-

ఉద్యానవనం చుట్టూ జానిసలు కావలి కాస్తున్నట్లు కుభా నది కిరు వైపులా ధనికుల పంటచేలను సైనికుల అదుపాజ్ఞలలో ఉంచారు.

నదికి చాలాదూరంలో, పంటలు ఏనాడూ పండని ఎండుభూములు... వాటిలో అక్కడక్కడా ఒక గుడిసె.... అప్పటప్పటా ఒక పెలిసె....

ఎండు భూములకు ఆవల ఎడారిలాంటి ప్రాంతం.

నర సంచారం కన్నా మృగ సంచారం ఎక్కువగా ఉన్న ఆ ప్రాంతంలో ఒక రాత్రి—

జిగీషి నిర్మించిన పురాల రహస్యాన్ని స్వయంగా తెలుసుకోవాలని, సామాన్య కర్షకుల వేషాలలో గుసపాలు చేతపుచ్చుకుని, గాంధారం సరిహద్దుల్లో విడిదిచేశారు - సగరుడూ, సౌభరీ. కొందరు అను చరులూ....

సామాన్య రైతు రూపంలో తలపాగా చుట్టుకుని, మోకాళ్ళ వరకూ మాత్రమే కప్పి ఉంచేలా ధోవతి చుట్టుకుని పై ఉత్తరీయం జారిపో కుండా పొట్ట దగ్గర ముడివేసి కప్పుకున్నాడు సౌభరి!

రైతు నాయకుడిలా ఒక భుజంమీదుగా కండువా వేసుకున్నాడు సగరుడు.

పండు వెన్నెల-

చచ్చిపడిన ఒఖల్లాకపు మాంసంకోసం అడవి మృగాలు ఒకదానితో ఒకటి భయంకరంగా పోరాడుతున్నాయి-

మాంసపు కండ దొరికిన జంతువు దానిని నోటితో కరుచుకుని దూరంగా పోతోంది - దాని నోటికూడును దక్కించుకోవాలని, అసలు మాంసపు గుట్టను అక్కడే వదిలేసి, దాని వెంటపడ్డాయి పది మృగాలు-

తన ప్రాణరక్షణతోపాటు, తన నోటిలోని ఆహార రక్షణ కూడా చేసుకొంటూ వేగంగా పరుగులు తీస్తోంది ఆ మృగం.

పరిగెత్తీ, పరిగెత్తి అలుపొచ్చి, ఒక్క క్షణం ఆగి, గాలి పీల్చు కొని, వెంటనే పరుగు అందుకుంటోంది-

పండు వెన్నెలలోంచి ఆ భీకర దృశ్యం మారానికన్నా స్పష్టం గానే అవుపిస్తోంది. జంతు పోరాటంలోని సామాజిక ధర్మాన్ని పరిశీలిస్తు న్నాడు సగరుడు-

"ఏది మాయ.... మీరు చెప్పండి మహర్షి! కనిపించే ఈ నగ్న సత్యమే మాయ అయితే, కనిపించనిదేదో సత్యం ఎలా అవుతుంది... ? అటు చూడండి మహర్షీ....!" అంటూ ఓ మాంసపు ముక్కను నోటకరిచి పరిగెడుతున్న మృగంపైపు చూపించాడు.

పది జంతువులా దాన్ని వెన్నాడి చివరికి జయించాయి. దాని మీద పడి, దాని నోట్లో మాంసంతోపాటు దాని మాంసాన్ని పెకలించాయి.

మళ్ళీ కథ మామూలే....

వేగం కల్గిన ఏ మృగమో ఇంత మాంసపు కండను నోటకరిచి ముందు పరిగెత్తింది. మిగిలిన మాంసాన్ని అక్కడే వదిలేసి తక్కిన జంతువులు దాని నోటి కూడు కోసం వెంటాడ సాగాయి.

"ఇదీ మాయేనా మహర్షీ....? ఆకలిమాయ కావచ్చు.... కడుపు నింపుకోవడంమాయకావచ్చు కాని,ఆకలి తీర్చుకోవడానికిఇతరులనోటికూడు దోచుకోవడం "మాయ" అనో "మిథ్య" అనో అనడం వలన మానవాళికి తీరని నష్టం చేకూర్తుంది మహర్షి. ..! ఆలోచించండి....!!" అన్నాడు ఆవేశంగా సగరుడు!

తమ ప్రభువు మనసు పాడయిందని గ్రహించిన ఒక భరతుడు నడుముకు చుట్టిన దట్టీలోంచి మురళిని తీసి, తియ్యగా పాడడం మొదలు పెట్టాడు.

అది ఏ రాగమో- దానికి ఏ తాళమో. .. అవన్నీ సది వదగాడ్పు వేసవుల కూప శిక్షలో ఏనాడో మరిచిపోయాడు సగరుడు.

మౌనంగా వేణు నాదాన్ని వింటూ, తన గతంలో- మారుమూల ఎక్కడో మిగిలిపోయిన తీపి జ్ఞాపకాలను వెదుకుతున్నాడు. కొంత శాంతి దొరికినట్లయ్యింది- పైకి ఎగదట్టిన గుండెలు నెమ్మదించసాగాయి.

మురళీరవం అతని మనసును పూర్తిగా కుదుటపరిచాక సౌభరి అందుకుని అన్నాడు....

"అదిగో చూశారా ప్రభూ! అదే పుష్కలావతీ నగరం- అల్లంత దూరంగా- కుభానది ఒడ్డున.... అన్నింటికన్నా ఎత్తుగా, పెద్దదిగా కన్పిస్తున్నది జిగీషుని సౌధం. నది పొడవునా నగరం వ్యాపించి ఉంది గమనించారా ప్రభూ. - పుష్కలావతీ నగరం వివరాలుతెలియజేసుండగా-

ఓ భరతుడు కల్పించుకుని, "మనం ససైన్యంగా వస్తే బావుండేదేమో.... రాత్రికి రాత్రే పుష్కలావతీ నగరాన్ని కూల్చివేసే వాళ్ళం...." అన్నాడు ఉత్సాహంగా!

సగరుడు ఆ సైనికుడ్ని మందలించాడు-

"సేనానీ! శత్రువును తక్కువగా లెక్కగడ్తున్నామంటే, పరాజయానికి మెట్లు కడ్తున్నామన్నమాటే! అటుచూడు- ఆ దుర్గమ ప్రాకారాలను దాటి లోపలికి ప్రవేశించడానికి ఇంద్రుడుకూడా ఏదైనా సూక్ష్మరూపాన్ని పొందవలసి ఉంటుంది-" అంటూ, సౌభరి వైపు తిరిగి "మీరు కొనసాగించండి మహర్షీ ...." అన్నాడు.

"అదిగో- నదినించి ఒక పాయ నగరం మధ్యలోంచి పంటపొలాల వరకూ వచ్చిఆగిపోయింది.... చూడండి. ..

నగరానికి మంచినీరు అందించడానికి త్రవ్విన కాలువ అది! ఈ కాలువలోంచి మట్టి గొట్టాల ద్వారా నీరు నగరం అంతా అందుతుంది. నిజానికి ఇదొక అద్భుతం! ఒకప్పుడు బుధమహర్షి ఈ జిగీషి దగ్గర పురోహితుడిగా ఉన్నప్పుడు కట్టించిన నిర్మాణం ఇదంతా!-" అన్నాడు జిగీషి రహస్యాలు వివరిస్తూ సౌభరి!

పంటపొలాలదాకా వచ్చి ఆగిపోయిన కాలువ వంకే తదేక దీక్షతో చూస్తున్నాడు సగరుడు.

"ఆ పంట పొలాలచుట్టూ కాపలి ఉన్న సైన్యాన్ని చూశారా ప్రభూ? తేనెతుట్టెలో తేనెటీగల్లా ఇంతదూరం నుంచి ఎలా కన్పిస్తున్నారో...." అన్నాడు భరతుడొకడు.

సగరుడు దృష్టి అటు సారించాడు. సౌభరి వివరిస్తున్నాడు-

"వాళ్ళు కావలి కాస్తున్నది ధనికుల భూముల్ని మాత్రమే!! ఆ భూములకు ఇంకా ఇవతలగా పల్లె జనాల బీద గుడిసెలున్నాయి గమనించారా ప్రభూ....! వాళ్ళు ధనికుల పొలాలలో పనులుచేసి బ్రతుకుతారు. వాళ్ళకీ ఇంకా ఎగువన కొన్ని పొలాలున్నాయి. అవి పండవు. నీరు అందదుకదా...? అందుకని....!!"

సౌభరి మంచినీటి కాలువ గురించి చెప్తుండగానే చటుక్కున లేచి నిల్చున్నాడు సగరుడు-

"మహర్షీ! నాకో చక్కటి ఆలోచన వచ్చింది. దాన్ని అమలు జరపడానికి ముందు వూరిచివర నివసిస్తున్న ఆ పల్లెజనాన్ని మచ్చిక చేసుకోవాలి. ఆ తర్వాత పుష్కలావతిలోకి ప్రవేశించాలి.... పదండి,..." అంటూ చకచకా అడుగులువేశాడు!

సగరునివెంట మౌనంగా అనుసరించారందరు..

* * *

తెల్లతెలవార్తోంది!

పల్లెజనం ఇళ్ళలో దీపాలు మినుకు మినుకు మంటున్నాయి.

ఏడాది పొడవునా పొలాల్లో ఊడిగం చేసినందుకు తమ యజమానులు కొలిచి ఇచ్చిన ధాన్యాన్ని ఇంటికి తెచ్చుకొని, ఆనందంగాపండగ చేసుకొనే సంబరంలో ఉన్నారందరూ. నెగళ్లు వేసుకుని, దానిచుట్టూచేరి పాటలు పాడుకొంటూ నృత్యం చేస్తున్నారు.

సామాన్య రైతుల రూపాలలో వున్న సగరుని బృందం నెమ్మదిగా ఆ నెగళ్ళ దగ్గరకు చేరుకున్నారు. ఈ కొత్త మనుషుల్నిచూసి ఆడేవారు కాస్తా ఆగి, చుట్టూ కమ్మేశారు

పల్లె నాయకుడు ముందుకొచ్చి "ఏం పనిమీద ఇలా వచ్చారు బాబులా...." అని అడిగాడు.

"కొండల్లో కోనల్లో బతికేటోళ్ళం బాబయ్యా! ఏదైనా పని చూపించు" అంటూ వృద్ధుడైన ఆ పల్లెనాయకుని కాళ్ళమీద పడ్డాడు సగరుడు సగరుని బృందాన్ని చూసి ముచ్చటపడ్డాడు నాయకుడు.

"ఏం పని సేత్తార్రా మీరు—?" అని సగరుణ్ణి దగ్గరగా తీసుకుని అడిగాడు.

"కాలువలు తవ్వగలం...." ఉత్సాహంగా చెప్పాడు సగరుడు.

ఆ మాటకు పల్లెజనం బిగ్గరగా నవ్వారు!

"కాలువలతో మనకేం పనిరా...." అన్నాడు వాళ్ళలో ఒకడు ఆశ్చర్యంగా.

పల్లె నాయకుడు వాళ్ళని అదిలించాడు. సగరుడివైపు తిరిగి "సూడ బోతే మారాజు బిడ్డలా ముద్దొస్తున్నావు. సిన్నోడివైనా గొప్పపని నేర్చావురా....పదిమందికీ పనికొచ్చేపని!" అని అతని బుగ్గలు నిమిరాడు.

సగరుడు సంతోషంగా చూశాడతని వంక!

"ఆరెవరో సగరులోరంట.... సప్తసింధంతా కాల్వలు తవ్వి పంట చేల్లోకి నముల్ని మళ్ళిస్తాండంట.... అరి కొలువుకుపోరాదంటరా సిన్నోడా" అన్నాడు నాయకుడు.

"ఇక్కడకూడా మీరు కాల్వలు తవ్వించుకోవచ్చుగా... ?" వాళ్ళను ఉత్సాహపరుస్తూ అడిగాడు సగరుడు.

"మాకేటికిరా బిడ్డా.... కాల్వలు?"

"ఏటికనమాక....! అక్కడ ఆ సగరులోరు కాల్వలు తవ్విత్తాంది మనలాంటి జనం కోసం కాదా...." రెట్టించాడు సగరుడు.

నాయకుడు మాట్లాడలేదు. మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

సగరుడు అందుకుని— "శుభానది నుంచి తవ్విన కాలవేనా నగరానికి మంచినీటిని అందిస్తోంది—?" అనడిగాడు.

"అది కాలవ రాజు బిడ్డా! మా జిగీషి ప్రభువు తన మహిమతో భూదేవిని చీల్చి నీరు నగరంలోకి వచ్చేలా చేశాడట.... మా అయ్య చిన్నప్పుడు చెప్పాడు—" అన్నాడు నాయకుడు.

సగరుడు నవ్వి అన్నాడు- "ఏర్చేదేదో మీ పంట పొలాలదాకా చీలుస్తే ఇక్కడా పంటలు చక్కగా పండేవి కదా.... మధ్యలో అడ్డుకట్ట ఎందుకు పోశాడు....?" అని.

"పెద్దోళ్ళ విషయాల్లా అవి ... ఎందుకూ, ఏమిటని అడగరాదులా మనం!" అని సర్దేశాడు నాయకుడు.

"తాతా! దుర్గం బయట పంటపొలాలున్నాయి....! పంట పొలాలకు దూరంగా విసిరేసినట్లు మీ కొంపలున్నాయి. మీకక్కడా పనికిరాని ఎండు భూములు మీకపతల ఎండలకు ఎండి బీటలిస్తున్నాయి....అవునా? మీ కాలవని మీరు త్రవ్వుకుని, మీ పంట మీరు పండించుకొంటే, మీకీ దరిద్రమే ఉండేదికాదుగదా....? ఆలోచించు!" అన్నాడు.

నాయకుడు ఆ మాటకు ఎంతో మురిసిపోయాడు....

"ఒరే కుర్రాడా! నిన్ను చూస్తా వుంటే ఆ సగరులోరిని చూసినట్టే వుందిరా....అయినా నీఅంత కుర్రాడేనంట! మా పుష్కలాపతిలో ఆయన కథలు తెగ సెప్పుకొంటా వుండారు-నువు సెప్పేది ఇన్నాక ఆయన సేసేది నిజమే ననిపిస్తాందిరా....!" అన్నాడు.

"ఆ సగర ప్రభువు మహాత్మ్యమేకాదు-కాలవ మహాత్మ్యం కూడా నిజమే నాయకా! మీరూ మేమూ కలిసి కాలవ తవ్వుదాం. మధ్యలోఅడ్డుగా వున్న ఆ మెరకని నరికేస్తే నదీ మీపొలాలదాకా మళ్ళుతుంది....జాగ్రత్తగా ఆలోచించు తాతా....మీ ఎండుబీళ్ళలో బంగారం పండుతుంది-" అంటూ వాళ్ళని ప్రోత్సాహపరిచాడు సగరుడు.

సౌభరి మధ్యలో కల్పించుకొని, పల్లె నాయకుణ్ని ఒప్పించేందుకు పూనుకున్నాడు-

"నాయకులవారూ! పెద్దవాణ్ని నేనుచెప్పేది వినండి! ఏదో ఆడుతూ పాడుతూ సంబరాలు చేసుకొంటున్నట్లుకన్పిస్తే, మీరు కాల్వలు త్రవ్వుతు

న్నారని ఎవ్వరూ అనుమానించరు—మీ పొలాలదాకా నీళ్ళువచ్చాక ఎవరూ పట్టించుకోరుకూడా....” అన్నాడు సౌభరి!

ఎంతో సంస్కారం ఉట్టిపడుతున్న ఆయన మాటలువిని, నాయకుడు కాదనలేకపోయాడు....

“మాకు ఇంత కూడుపెట్టండి చాలు....మీరూ మేమూ కలిసి పని చేద్దాం....” అన్నాడు సగరుడు.

గునపాలు పట్టుకొని, “బయల్దేరండొరే....” అని అరిచాడు నాయకుడు.

ఎవరి కాలూ ఆగలేదు. అందరూ కదిలారు.

“ఓ పర్జన్యుమా! నీ మహత్తర శక్తితో ఆ మేఘరాసిని కురిపించు-నీ నీటిని కాల్వద్వారా తూర్పుకు ప్రవహింపచెయ్యి....నీ నీటితో భూమ్యాకాశాలను తడుపు-”

“సోమం ఇంద్రునివైపు మరలునట్లు నదీ సముద్రంవైపు ప్రవహించునట్లు-కాలవ పొలాలవైపు పారుగాక-”

అంటూ ఋక్మంత్రాలను పఠించాడు సౌభరి.

పల్లె జనమూ, భరతులూ కలిసి ఉత్సాహంగా, రహస్యంగా కాల్వ త్రవ్వకం కొనసాగిస్తున్నారు-ఇంకా ఒకటి రెండురోజుల్లో ప్రధాన కాల్వ వరకూ త్రవ్వకం అయిపోతుంది.

“నేటికి మూడవరోజు ఉదయమే ప్రధాన కాల్వలోని నీటిని ఈ కొత్తకాలువలోకి ప్రవేశపెట్టేందుకు ముహూర్తం!” అన్నాడు సౌభరి-పల్లె జనం ఉత్సాహంగా కాల్వతవ్వే పనిలో నిమగ్నమైపోయారు....!!

ఇంకా రెండే రాత్రులు....ఈ రెండురాత్రులూ నిర్విఘ్నంగా కార్యం జరిగిపోవాలని నూరుదేవతలకు మొక్కుకుంటున్నాడు సౌభరి!

“ఓ అగ్నీ! శుచిగా వండిన హవిస్సు సిద్ధంగావుంది. ఓ యువక శ్రేష్ఠుడా....దాన్ని స్వీకరించు—” అంటూ అనేక ఋక్మంత్రాలతో దేవతా

ప్రార్థనచేసి హవిస్సు నివేదనచేస్తూ కాల్వపని నిరాటంకం కావాలని దేవత లను వేడుకొంటున్నాడు సౌభరి!

కాల్వపనితో చెకచెకా జరిగిపోతోంది కాలం....అలా....హాయిగా!!

ఈ పల్లె జీవనానికి వచ్చినదగ్గర్నుంచీ, సగరుడికి ఈ జీవితాలు ఎంతో ముచ్చటగా అవుపించాయి.

అంతా స్వేచ్ఛ! అనవసరపు కట్టుబాట్లు లేవు. అర్థంలేని ఆచారాలు లేవు. అందరూ కలిసి కష్టిస్తారు. అందరూ సమానంగా పంచుకుంటారు. ఒకరి ఎక్కువాలేదు- వేరొకరి తక్కువాలేదు - యావత్ పల్లెప్రపంచం ఐక్యంగా కష్టసుఖా లనుభవిస్తోంది.

బానిసత్వంలో మ్రగ్గిన జాతితిరుగుబాటుచేసి అధికారాన్ని చేజిక్కించు కున్నప్పుడు ఓడిపోయినవారిని తిరిగి బానిసలను చేస్తోంది....ఎందుకని ...? మరొకఅభ్యుదయకరమైన నవీన వ్యవస్థ లేదుకాబట్టి...పగలకు మూలకారణ మైన అనైక్యతాభావం-మనుషులంతా ఒక్కటే అనే తత్వాన్ని అలవరచుకో నీయదు కాబట్టి....!! ఈ పరిస్థితి మారాలి!

తాను నెలకొల్పదలచిన అభ్యుదయ వ్యవస్థ గురించే ఆలోచిస్తూ ఆ పల్లెలో కాలంగడుపుతున్నాడు సగరుడు.

కానీ, సగరుడివెంట వచ్చిన భరతుల పరిస్థితి వేరుగావుంది!

తన దేశాన్నీ, తన ప్రభుత్వాన్నీ, తన ప్రజల్నీ, తన సుఖభోగాల్నీ వదిలి, ఇలా శత్రురాజ్యంలో సామాన్య రైతులా కాల్వలుత్రవ్వకొంటున్న తమ ప్రభువు సగరుని మనసులో ఉన్న పథకంఏమిటో వాళ్ళకు బోధపడ లేదు. బోధపడింది సౌభరి కొక్కడికే!

కానీ, ఆయన బైటపడడు!!

ఇలా ఎన్నాళ్ళుండాలి....? జిగీషి చేసిన హెచ్చరికలు ఏమై నాయి ..?తాళజంఘులకు రక్షగా బయల్దేరిన త్వష్ట ఏమైనాడు? ఆ విషయం గూఢచారులద్వారా తెలిశాకే సగరుడు రైతు వేషాలలో గాంధార భూముల్లో కాలవ పనులకు పూనుకొన్నాడు. ఇదేమి రాజనీతో అర్థంకాలేదు వాళ్ళకి.

పనులు పాలించి, రాత్రికి ఇళ్ళకువచ్చిన కొందరాడవాళ్ళు తమ అలసటను పోగొట్టుకునేందుకు కొంచెం సురసుత్రాగి, నెగళ్ళచుట్టూవలయా కారంగా చేరి నృత్యంచేస్తుంటే, వాళ్ళతోచేరిపోయి ఆడసాగాడు సగరుడు-అతన్నిచూస్తే మతిపోతోంది భరతులకి!

ఇంతలో పయసుమళ్ళిన నాయకుడి భార్య వచ్చి, "ఈపూట మా ఇంటికి భోజనానికి రావోయి...." అంటూ పిలుచుకు పోయింది.

ఆమెతో ఆ మాటలూ ఈ మాటలూ చెబుతూ, చక్కగా వండిన లేడి మాంసం ఆరగించి తన ప్రపంచాన్నే మరిచిపోయాడు సగరుడు.

సురని ఎవరికివాళ్లు ఇళ్ళలోనే తయారుచేసుకుంటారు ఈ పల్లెజనం

ధాన్యాన్ని అన్నంగా వండి, మట్టికుండలో నిల్వపుంచి, వాసెనకట్టి భద్రంగా దాచిపెడతారు. కొన్ని రోజులకి ఆ అన్నంలోంచి, పల్చటిద్రవం పైకి తేరుకొంటుంది. అదే 'సుర' వాళ్లకి!

ఖర్జూరం పండు రసాన్ని కూడా ఇలానే మట్టికుండలలో వాసెనకట్టి పులపపెట్టి, 'వారుణి'ని తయారుచేస్తారు. వాన్ని తమ ప్రభువులకు సమర్పించుకొంటారు. అది రాజ పానీయం!!

అలాంటి వారుణిని కొంచెం తెచ్చిఇచ్చింది నాయకుడి భార్య.... అతనిమీద ప్రత్యేక అభిమానంతో!

ఆ మాటకొస్తే అక్కడ సగరుణ్ణి అభిమానించందెవరూ....?

సగరుడి వెంటవచ్చిన భరతులకు అదే పెద్ద బాధ అయిపోయింది! ఈ పల్లెసీమకు వచ్చినదగ్గర్నుంచీ తాగడం, ఆడడంతోనే కాలం గడిచి పోతోందాయె!!

అసలీ కాలపగోల ఏమిటో వాళ్ళకి ఎంతకీ అంతుపట్టలేదు!

రోజంతా ఇలా మత్తులో తూగుతున్న తమ ప్రభువుమీద ఎవరైనా దుస్సాహసంచేస్తే....? సగరుడు ఇవేమీ పట్టించుకోడేం....?

అక్కడికి ఉండబట్టలేక సౌభరికి విషయం నివేదించి పరిష్కారం సూచించమన్నారు.

"అన్నిటికీ ఆ ఇంద్రుడే ఉన్నాడు-" అని నిట్టూర్చాడు సౌభరి!

భరతులకి పిచ్చెక్కినట్లయ్యింది-ఏంచెయ్యాలో తోచక-ఏమీ చెయ్య కూడదని నిర్ణయించుకొని బుద్ధిగా కాల్వపనుల దగ్గరికి వెళ్ళిపోయారు.

పల్లె నాయకుడి ఇంట్లో,గొంతుదాకా శ్రేష్ఠమైన వారుణి తాగి,మెదడు మొద్దుబారిపోయి, అలాగేపడి నిద్రపోతున్నాడు సగరుడు.

నాయకుడి భార్య అతడిని నెమ్మదిగా పడకగదలోకి లాక్కుపోయి, శయ్యమీదకు చేర్చి విశ్రాంతిగా పడుకోబెట్టింది-

మత్తులో మునిగిపున్నాడని నిర్ధారించుకున్నాక, నెమ్మదిగా అడుగులు బైటకు వేసింది. తలుపులు దగ్గరగాలాగి, అన్నంమూటపుచ్చుకొని చీకట్లోకి వెళ్ళిపోయింది.

పల్లెనాయకుడు కాల్వదగ్గర త్రవ్వకం పనిచేయిస్తున్నాడు. సౌభరి కూడా అక్కడే వున్నాడు. భరతులంతా అక్కడేవున్నారు. ఇక్కడ ఈ పూరిగుడిసెలో సంటరిగా-ఒళ్ళుతెలియని స్థితిలో సగరుడొక్కడే....!!

అప్పుడే అర్ధరాత్రి అవుతోంది.

తెల్లవారడానికి ఆట్టేసమయంలేదు. సౌభరి పెట్టిన ముహూర్త సమయం దగ్గరపడుతోంది. ఇంకా కొద్దిగా మెరక కొట్టివేయాలి. ఆ మెరకని నరికేస్తే పాత కాల్వలోంచి నీళ్ల పరదలా కొత్తకాలవలోకి,పంట చేలదాకా వచ్చేస్తాయి....ఇంక బంగారు పంటలు....తిండికి ముఖం వాచి పోవాల్సిన పనేలేదు.. .అనుకొంటున్నారు పల్లెజనం!!

అందరి దృష్టి ఆ మెరకమీదే వుంది. ఎవరో తెచ్చి కావాలనిపోసిన మట్టిగుట్టలా వుంది ఆ మెరక.

అపతలెక్కడో కాపలిపున్న సైనికులు కాగడాల వెలుతురులో ఈ పల్లెమనుషులు ఏదో చేస్తున్నట్లు గమనించారు.

కానీ, పనీపాటా లేనప్పుడు ఎక్కడపడితే అక్కడ మంటలుచేసు కొని ఆడుతూ పాడుతూ ఉంటారులెమ్మని బద్ధకంగా ఊరుకున్నారు. మెర కని కొట్టివేసే కార్యక్రమం నిరాఘాటంగా సాగిపోతోంది.

ఇక్కడ—

పల్లెనాయకుడి ఇంట్లో-

మత్తుగా పక్కమీద పడి దొర్లుతున్నాడు సగరుడు. నిద్ర పట్టినట్లే పట్టింది.కానీ అకస్మాత్తుగా మెలకువ వచ్చింది.

లేచి చుట్టూ చూశాడు.

ఆ గుడిసెలో ఒంటరిగా తానొక్కడే ఉన్నట్లు గమనించాడు

మనసు ఉద్రేకంతో గింజుకొంటోంది- వారుణి ప్రభావం పూర్తిగా ఆవహించిందతన్ని.

నిద్రపట్టక పిచ్చిగా పక్కమీద పడుకుని అటూ ఇటూ దొర్లాడు.

మనసు అప్సర మీదకు మళ్ళింది.

కోరికతో నవనాడులూ కృంగదీసుకు పోతున్నాయి. అలాగే కళ్ళుమూసుకుని ముసుగదీసుకుని పడుకున్నాడు. నిద్రపట్టడంలేదు. వారుణి మైకం అతని నరాల్ని రెచ్చగొడ్తోంది. గిలగిలా కొట్టుకొంటోంది ప్రాణం.

పక్కమీంచిలేచివెళ్ళి, మూసెలో మండుతున్న వత్తిని 'ఉఫ్'న ఊదేశాడు. అయినా తాపం చల్లారలేదు.

మనసుని పిండుకుని, అలాగే మూల్గుతూ శయ్యమీద నడుంవాల్చబోయాడు.

చేతికేదో మెత్తగా తగిలింది.

అతని మెదడుకన్నా ముందే అతని చేతులు ఆ తగిలినదేమిటో గ్రహించి, పెన్నిధానం దొరికినట్లు ఉత్సాహంగా ఊగాయి-

అతన్ని శయ్యమీదకు— మీదకు లాక్కుని, తిరగబడి, బలంగా అతని గుండెల్ని ఏదో నగ్నశరీరం వెచ్చగా అదిమిపెడ్తోంది.

ఊపిరాడక విలవిలలాడిపోయాడు సగరుడు.

అతను వదిలించుకోవాలని ప్రయత్నించేకొద్దీ ఆ శరీరం అతన్ని నొక్కిపెట్టి అదమసాగింది.

"ఎవర్నువ్వు?" అని బిగ్గరగా అరిచాడు. కాని, గొంతుపెగల్లేదు.

"నేనే.... సరమని.... పల్లెనాయకుడి కూతుర్ని...." అంటూ కిలకిలా నవ్వింది సరమ. "అన్నం మూటకట్టుకుని అయ్యకోసం తీసుకెళ్ళింది

అమ్మ.నీకోసం నేనిటు వచ్చాను-" అంటూ అధరాలను పంట కరిచి గట్టిగా కొరికింది.

ఇక్కడ ఇలా ఆ ఇద్దరూ సుఖపారవశ్యంలో ఉండగా....అపర రాత్రాంత ముహూర్తాన- సరిగ్గా ఇదే సమయానికి అక్కడ కాల్వలోకి నీరు వరదలా పొంగిపొర్లింది!

* * * *

ఎంత ఎక్కువగా తాగబోయిస్తే సైనికులు అంత రెచ్చిపోయి వీర విహారం చేస్తారనీ.... శత్రువును నిలువుగా చీల్చిచెండాడుతారనీ నమ్మి, సురాభాండాల్ని తెప్పించి, సురాప్రవాహాన్ని సృష్టించాడు త్వష్ట.

పరుష్ణి నదీతీరపు యుద్ధభూముల్లో ఏరులై పారుతోన్న సురలో రేయింబవళ్ళు మునిగితేలుతున్నారు గాంధార సైనికులు.

సైనిక విన్యాసం ఆ ప్రాంతంలో ప్రారంభమై అప్పుడే పన్నెండు రోజులయిపోయింది.

పర్వతాలంత దుర్గమ దుర్గాలనైనా ముట్టడించి తుత్తునియలు చేయ గల గాంధార సేనలో ప్రధానభాగం యూపస్థూ పరుష్ణీ తీరానికి చేరిపోయింది. తాళజంఘ, భరత, తృత్సు గణాలకు రక్షగా కంచె వేసినట్టు నదిపొడవునా వ్యాపించింది సైన్యం!

అంత భారీ సేనకు కనుసైగతోనే ఆదేశాలివ్వగల చతురుడు త్వష్ట నాయకత్వం వహిస్తున్నాడు! నదికి సమాంతరంగా ప్రవహిస్తోంది అతని సేనావాహిని.

ఏడీ.... కాచుకోమని ప్రగల్భించిన సగరుడు రాడేం...? యుద్ధం చేయకుండా ఇక్కడ ఎన్నాళ్లు గడపాలి? అగ్నిగుండంలా మాడిపోతోంది యుద్ధరంగం. ఎక్కడా కనుచూపు మేరలో పట్టుమని పదిక్షణాలు నిలిచే నీడలేదు.

వేయగలిగినన్ని చర్మశిబిరాలు వేశారు. వాటిలో ఉన్నతాధికారులు విశ్రాంతి తీసుకొంటున్నారు. మిగిలిన సైనికబలగం బైట ఎండలకు మాడి పోతున్నారు.

పదిహేనురోజులు గడిచేసరికి తెచ్చుకున్న సురాభాండాలు కూడా నిండుకున్నాయి. మరికొంత సురను పంపమని తాళజంఘులకు వార్త పెట్టాడు త్వష్ట. ఇంకా రాలేదు. సురకోసం వెంపర్లాడిపోతున్నారు సైనికులు. తిండి కూడా చాలినంత లేకపోవడంతో వెర్రెత్తిపోతోంది వాళ్ళకి. క్రమంగా బలం పూర్తిగా నశించిపోయి, శోషించిపోతున్నారు!

"అన్నా! నేను వెళ్ళిపోతున్నాను- యుద్ధం ఏమీ చేయకుండానే నీ కొడుకు ఎండదెబ్బ తగిలి చచ్చిపోయాడని మా అయ్యకు చెప్పు-" అని కన్ను మూశాడు త్వష్టని సైనికుల్లో ఒకడు-

కాసేపు చల్లని కిరణాలను ప్రసరించమని ఆ సూర్య భగవానుణ్ణి ప్రార్థిస్తున్నారు సైనికులు. కనీసం ఈ ఆఖరి క్షణాలలోనయినా మరణాన్ని చల్లగా ప్రసాదించమని కోరుతున్నారంతా.

ఆకలి, ఎండ బాధలకు తాళలేక రోజూ పదులకొద్దీ సైనికులు ఇలా రాలిపోవడంచూసి కలవరపడిపోయాడు త్వష్ట. ఇలాగే మరికొన్ని రోజులు గడిస్తే....?

గూఢచారులు రోజుకో వార్త మోసుకువస్తున్నారు—సగరుడు మారు వేషంలో బయల్దేరాడని ఒకరోజు, ఆసురసేని కొంతసైన్యాన్ని వెంట పెట్టుకొని ఎటో వెళ్ళిందని ఇంకోరోజు... ఇంత సైన్యాన్ని చూసి బెదిరి, ఆ భార్యాభర్తలిద్దరూ తోకముడిచి పారిపోయారని మరోరోజు...., లేదు...లేదు ఇటే వచ్చేస్తున్నారనీ. ఒకటి రెండు రోజుల్లో యుద్ధం తప్ప దనీ ఒకసారి, ఏదో విచిత్రమైన మారణాయుధాలను సమకూర్చుకొని నేడో, రేపో మెరుపు దాడికి తలపడుతున్నాడని ఇంకోసారి.. .

ఒక వార్తకీ, మరో వార్తకీ పొంతనలేదు. కావాలనే సగరుడు అసత్యప్రచారం చేయిస్తున్నాడని చాలా ఆలస్యంగా గానీ గ్రహించలేక పోయాడు త్వష్ట!

యుద్ధం జరగకుండానే తన సైన్యం ఇంత నీరసించిపోతే, ఈ దశలో ఆ సగరుడు నిజంగానే మెరుపుదాడిచేస్తే తన గతి ఏం కావాలి...?

తాళజంఘులకేం? రాతి సౌధాలలో హాయిగా కూర్చున్నారు. వాళ్లకు రక్షగావచ్చి ఈ దిక్కులేని భూముల్లో మాడిపోతోన్నది తానూ... తన సేన...

మొత్తంమీద అర్థంకాని మనిషి ఈ సగరుడు. అతన్ని ఎదుర్కోవ డానికి భుజబలం ఒక్కటే చాలదు. బుద్ధిబలం కూడా కావాలి... అను కున్నాడు.

ఇంతలో పంచవర్ణపు మృత్తికా ఘటంలోంచి కొత్తగా మిగిలిన సురను వంచి తెచ్చి ఇచ్చారు ఇద్దరు తాళజంఘ పడుచులు- విసుగ్గా సురా పాత్రను దూరంగా విసిరేసి వాళ్లను అవతలికి పొమ్మన్నాడు త్వష్ట.

అతని ఈ నిర్లిప్త ధోరణికి నిరాశగా ఒకర్నొకరు చూసుకొని నిష్క్రమించారు పడుచులిద్దరూ!

గంట గడిచేకొద్దీ కలవరం రెట్టింపవుతోంది-· ఇదెక్కడి యుద్ధ నీతి....?

యుద్ధం చెయ్యకుండానే శత్రుసైనికుల్ని హతమార్చేదుష్టవ్యూగం.

"ఈ సగరుడు కిరాతకుడిలా ఉన్నాడు. వాడు మనిషికాదు- రాక్ష సుడు-" అంటూ వెర్రెత్తి అరిచాడు త్వష్ట! సగరుడి ఎత్తుకు పై ఎత్తు వేసేంత ఓపిక అతనికి లేదు- భుజబలం తప్ప బుద్ధిబలం లేని త్వష్ట మండిపోతున్న ఎండని చూసి బెంబేలెత్తిపోయాడు.

ఇంతలో —

"మహాప్రభో!" అంటూ దూరంనుంచే పెద్దగా అరుస్తూ పరిగెత్తు కొచ్చాడు ఓ గూఢచారి.

అతన్ని చూడగానే, కొంపలంటుకుపోయే వార్త ఏం తెచ్చాడోనని గతుక్కుమన్నాడు త్వష్ట-

రొప్పుకొంటూ వచ్చిన సమాచారి, నోటమాట పెగలక, అతని కాళ్ళమీద బోర్లాపడి సొమ్మసిల్లి పోయాడు,

మామూలు పరిస్థితులలో అయితే, వాడి గుండెలమీద వాచి తన్ని, మాట పెకలించేవాడే! కాని, ఇప్పుడా ఓపిక అతనికీ లేదు.

వాణ్ణి నెమ్మదిగా లేపి "ఏమైందిరా....?" సగరుడు బయల్దేరాడా..?" అనిఅడిగాడు ఆత్రంగా, ఆందోళనగా త్వష్ట!

లేదని అడ్డంగా తల ఊపాడు వాడు. అంతకంటే దురదృష్టకర సమాచారాన్ని తన నోటితోనే చెప్పవలసి వచ్చినందుకు భోరున విలపించాడు సమాచారి!-

విషయం అర్థంకాక, వాణ్ణి ఈడ్చుకొంటూ తన శిబిరంలోకి లాక్కుపోయి బుజ్జగించి, ఇప్పుడు చెప్పరా.... అన్నాడు త్వష్ట!

సమాచారి వణికిపోతూ, ఎలా చెప్పాలో అర్థంకాక, భయపడుతూనే, తను సేకరించిన సమాచారాన్ని ఎలాగో చెప్పేశాడు! "పుష్కలావతిమీద కొరివిదెయ్యంలా సగరుడు విరుచుకుపడ్డాడు ప్రభూ.....!!"

ఆ వార్త విని, కళ్ళల్లోంచి నిప్పులు కక్కుతూ, 'సమాచారీ' అని బిగ్గరగా అరిచాడు త్వష్ట! ఆ కేక శిబిరంలోంచి, సైనికుల మీంచి, రణభూమిని దాటి, పరుష్ణీ నదికి ఆవల ఉన్న పర్వతాలను తాకి అక్కడ ప్రతిధ్వనించింది!

పిచ్చెత్తిన వాడిలా అరుస్తూ, వార్త తెచ్చిన సమాచారిని కాళ్ళతో ఎడా పెడా తన్నాడు-! "ఈ వార్త నిజమేనా....లేక నువు పుట్టించావా...." అంటూ గద్దించాడు- వాడు సమాధానం చెప్పలేదు. చెప్పేందుకు వాడు మిగిలిలేడు. అతని పాదఘాతాలకు ఆ సరికే పరలోకగతుడై పోయాడు గూఢచారి!

గాంధారంలో జిగీషుడి సౌధాన్ని ససైన్యంగా సగరుడు ముట్టడించాడని వాడు తెచ్చిన వార్తని నమ్మలేకపోయాడు త్వష్ట.

సరిగ్గా అదేసమయానికి అసురసేని బ్రహ్మాండమైన సేనా ప్రవాహంతో తనపైకి దండు వస్తోందనీ, వివిధ దేశాధినేతలు తమ సైన్యంతో ఆమెకు సహాయపడ్తున్నారనీ మరో గూఢచారి- వార్త తీసుకు వచ్చాడు.

దెబ్బమీద దెబ్బలా ఇలా వచ్చిపడ్తోన్న వార్తల్ని విని, విచలించి పోయాడు త్వష్ట!

ఇంక అతన్ని రక్షించగలిగే నాథుడేలేడా?

ఇక్కడితో ఆ దుష్ట త్వష్ట జిగీషుల అధ్యాయం పరిసమాప్త మయి నట్లేనా....?

దుష్ట పాత్రలు మధ్యలోనే మాయమైతే చెప్పేందుకు కాలం దగ్గర కథలేం మిగిలి ఉంటాయి....?

*　　　　*　　　　*

అది మహాసేనా వాహిని! గాంధారం వైపు దూసుకు వస్తోంది-

ఒక మహా ప్రవాహంలా కొండల మీంచి పడదోసుకు దూకుతున్న జలపాతంలా ఉరవళ్ళు పరవళ్ళు తొక్కుతోంది.

మహా ప్రవాహాలకు జిగీషి లాంటి కొండరాళ్ళా అడ్డంకి!!

ఆ అర్ధరాత్రి.... కుభానది వారి మళ్ళిందా అన్నట్లు పల్లె జనం తవ్వుకున్న కాల్వలో నదీజలాలు మెరకభూముల్ని దాటి,దానవతలనల్లెజనాల ఇళ్ళను దాటి, వాటవతల పల్లపు భూములను దాటి పరవళ్ళు తొక్కుతున్నాయి.

ఆ కాలవలోంచే - వేలకు వేలు సగరుని సైనికులు నావలమీద పుష్కలావతివైపు దూసుకు రాసాగారు

అవును! నావలమీదే!

గాంధార దేశపు పల్లెప్రజలచేత పథకంగా కాలవ త్రవ్వించింది ఎందుకో ఇప్పుడర్థం అయ్యింది అందరికీ!

దుర్భేద్యమైన జిగీషుడి సౌధాన్ని భూమార్గాన దాటడం ఎంత కష్టమో సగరుడికి తెలుసు- అందుకే ఈ కాలవ ద్వారా నగరంలోకి నేరుగా తన సైన్యాన్ని చేర్చివేసే మహత్తరమైన ఆలోచన చేశాడు సగరుడు.

తమ ఇంట్లో ఒక్క శయ్యన శయనించినవాడు ఆ సగర ప్రభువా?

తమ ఇంట్లో గంజినీళ్ళు తమతో కలిసి త్రాగినవాడు ఆ వీరాధి వీరుడా....??

తనుతో కలిసి ఆడీ పాడీ తిరిగినవాడు మహామహుడు సగర చక్రవర్తా....???

ఎవరికి వాళ్ళు సగరుడి పైనం తెలుసుకుని విస్తుపోతున్నారు!

సగరుడూ.... అతని వెనక వందలకొలదీ నావలూ.... నావలపైన వాళ్ళ నావికాదళం....చేతులలో వీరధనువులూ.... ధనువుల కెక్కుపెట్టిన లోహ శరములూ.... !

నావలమీద దూసుకు వస్తున్న సగరసేనకు కాలవగట్ల మీంచి చేతులు ఊపి స్వాగతం చెప్తున్నారు పల్లె ప్రజలు-

పంట పొలాల దగ్గర కాపలి ఉన్న గాంధార సైనికులు ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయారు. నావలమీద సగరసేన కాగడాలు వుచ్చుకుని మీదికి వస్తుంటే, సాక్షాత్తూ అగ్నిదేవుడు తరలివస్తున్నాడా.... అని భయంతో పరుగులు తీశారు సౌధంలోకి.

వాళ్ళను వెన్నాడుతూ శరపరంపరలు గుప్పించసాగింది సగరసేన. వాటిని ఎదుర్కొనే అవకాశంలేక పాదాలకు వేగాలు పులుముకొంటున్నారు గాంధార వీరులు!

నల్లేరుమీద బండిలా నావలు అడ్డూ అదుపూ లేకుండా ముందుకు సాగుతున్నాయి-

క్షణాలలో వార్త జిగీషిని చేరింది! వెనువెంటనే దుర్గ సంరక్షణా కార్యం ప్రారంభంఅయింది- దుర్గం పై బురుజులమీంచి బాణాలవర్షంతో సగరసేనను నిరోధించ సాగారు గాంధార వీరులు-

కోట గోడలమీద నిలబడిన శత్రువును కోట కిందనుంచి ఎదుర్కొనడం సగరుడి ధానుష్కులకు సాధ్యంకావడంలేదు.

వెంటనే సగరుడు నావమీంచి నావకు దూకుతూ కోటగోడకు దూరంగా వచ్చి బాణానికి గురి కారికేకోట ఓ నావమీద నిలబడి సింహగర్జన చేశాడు.

అతని లోహ శరవేగం ఈనాటిదీ కాదు ఆ బాణాన్ని దశాబ్దం క్రితమే ఎక్కుపెట్టాడు....! ఈనాడు గురిచూసి వదులుతున్నాడు!!

అకారణ కూపశేషలోంచి పైటపడి, స్వేచ్ఛా సూర్యుణ్ణి సందర్శించు కున్న వెలుగు కిరణాల సందోహం అది! ఆ వెలుతురు తీక్షణతకి మల మల మాడిపోతోంది గాంధార సేన?

కోట బురుజులమీదనుంచి తలపడిన గాంధార సైనికుల ఆత్మలు భూమార్గంనుంచి 'ఖ'మార్గం పైపు ప్రయాణంకట్టాయి.

మెరుపులు వారుతోన్న పిడుగుల్లాంటి బాణాలను ఒకదానితర్వాత ఒకటిగా గురిచూసి కోట ద్వారంమీదకు వదలసాగాడు సగరుడు!! కోట ద్వారాలు తూట్లుపడినట్లు ఫెళఫెళమని విరుచుకు పడుతున్నాయి.

ధనవంతుడికీ, నిర్భాగ్యుడికీ మధ్య అడ్డుగోడలా నిల్చున్న ఈ కోట గోడల్ని కూల్చందే సమ సమాజం సాధ్యం కాదని నిర్ణయించుకొంటూ పుష్కలావతి నగరంలోకి అడుగుపెట్టాడు సగరుడు! అతని వెనకే సింధూ వీరులు కోటని ముట్టడిస్తూ లోనికి దూసుకుపోయారు.

భిన్న కవచులై, విచ్ఛిన్న శిరస్త్రాణులై, పరిత్యక్తధనువులై, పతిత కరవాలురై, నిస్తేజులై, నిర్భాగ్యులై తలలువంచి, చేతులెత్తి నిల్చున్నారు, చచ్చినవారు చావగా మిగిలిన గాంధార సైనికులు....

తాను పంపిన లేఖను నమ్మి, జిగీషుడు తన ప్రధాన బలగాన్నే పరుష్ణి తీరానికి పంపాడనీ, ఇప్పుడతను నిశ్శేష సేనా పరివేష్టితుడనీ— కోల్పోయిన సైన్యంతో నామమాత్రపు రక్షణలో ఎక్కడో మూల నక్కి వున్నాడనీ చూడగానే పరిస్థితి అర్థమయిపోయింది సగరుడికి!

మొత్తానికి తనమీద వ్యాప్తిలోవున్న అతిశయోక్తులతోకూడిన ప్రచారాన్ని జిగీషి నమ్మాడన్నమాట! లేకపోతే మూల బలాన్నికూడా తననెదుర్కోవడంకోసం ఎందుకు పంపుకుంటాడూ....?

అడుసులో కాలువేశాడు జిగీషి! ఇప్పుడింక తీసుకునే అవకాశం లేదతనికి!!

పుష్కలావతిలో వీధివీధినీ ఆక్రమించింది సగర సేన.

సైన్యానికి మధ్యలో నిల్చుని సింహగర్జన చేశాడు మరొకసారి సగరుడు!

జిగీషికి సింహాస్వప్నమే ఆ ధ్వని!

విజయం ఇంత తేలికగా సిద్ధిస్తుందని ఊహించని సైనికులు రెట్టించిన ఉత్సాహంతో జిగీషి సైన్యాన్ని బ్రద్దలుకొట్టేందుకు ముందుకు దూకుతున్నారు.

అంతా విజయోత్సాహంలో వుండగా—

పుష్కలావతిలోని ధనికుల గృహాలు ఛళ్ళున తెరుచుకున్నాయి—ఒక్కొక్క గాంధార యువతీ ఒక్కొక్క వీరనారిలా వంటగది వస్తువిశేషాలు చేత పుచ్చుకొని సగర వీరుల్ని ఎదుర్కోవటానికి కదనరంగంలోకి దూకింది.

ఒక్కొక్క వీరుడి చేతిలో బల్లెం-ఒక్కొక్క గాంధార నారి చేతి చీపిరి ముందు తలవంచసాగింది!

నోటికొచ్చినట్లు తిడుతూ, పౌష్కలావతులు మీదిమీదికి దూసుకొస్తోంటే, సగరుని సైనికులు ఏ గమ్యమూ తెలియక ఆగిపోయారు.

"జిగీషా! అసామాన్యుడివయ్యా! మా మంచితనమే మా బలహీనతగా....అని గ్రహించావు! మానవత్వంకోసం పోరాడే మేము-స్త్రీ, బాల, వృద్ధులను హింసించమని నీకుతెలుసు....!అందుకే నారీజనాన్ని మా మీదకు వదిలావు—భళి!భళి!" అని మెచ్చుకున్నాడు సగరుడు.

"ప్రభూ! ఆనతీయండి! సూర్యోదయంలోగా జిగీషిని వధించాలనే మీ ప్రతిజ్ఞని మరిచారా....?" అని తొందరపెట్టసాగారు భరతులు.

చిరునవ్వే సమాధానంగా చెప్పాడు సగరుడు. "ఒక్క క్షణం వేచి చూడండి....ఏం జరగనున్నదో...." అన్నాడు వాళ్ళతో.

జిగీషి వేసిన ఎత్తుకు పైఎత్తు అన్నట్లు, దోపిడీ వ్యవస్థమీద బాధితులు ఏనాటికైనా తిరుగుబాటు చేయకతప్పదన్నట్లు అందరూ చూస్తుండగానే-రణరంగాన-ప్రత్యక్షమయ్యింది పల్లెనాయకుని కూతురు సరమ!

అమృత కలశాలు పొదిగిన తన వక్షస్థలాన్ని ఉక్కు కవచంతో బిగించి, వీరఖడ్గాన్ని జళిపిస్తూ ఆమె కదనరంగాన కవాతుచేస్తుంటేఆశ్చర్యపోయి చూస్తున్నారు మగధీరులు!

ఇంతకాలం తమకు దాసానుదాసులుగా పడివుండి, తమ అడుగు లకు మడుగులొత్తుతూ, తాము విసిరేసిన ఎంగిలి మెతుకులు తిని బ్రతికిన తమ పరిచారికలు....నడుములు బిగించి సరమ వెనక ఉత్తంగా నిలబడ్డారు.

అందిన తమ యజమానురాలిని అందినట్లు జుట్టుపట్టుకొని నేలకీడ్చి పిడిగుద్దులతో సత్కరించసాగారు సేవక స్త్రీలు!

"బిందెడు నీళ్ళు తక్కువయ్యాయని క్రొద్దున బడిత పుచ్చుకొని కొట్టావే....? ఇప్పుడు కొట్టు...." అంటూ ఓ దాస స్త్రీ ఎగిరెగిరితంతుంటే గుడ్లు తేలవేసి వెనక్కి విరుచుకుపడింది యజమానురాలు! నగరం మొత్తం ఎక్కడచూసినా ఇదే దృశ్యం....! యజమానురాళ్ళ మట్టికరిచారు!

విస్తరించిన వీరావేశంతో కదంతొక్కిన దాసిన స్త్రీలదే విజయం అయింది.

మెచ్చుకోలుగా చూశాడు సగరుడు. సమరం చేసిన 'సరమ' పరవ శించిపోయింది.

ఇంతకుమించిన శక్తి ఇంకెక్కడ సమకూరుతుందన్నట్లు అమరిన దీర్ఘబాహువులతో, లోకాన్ని శాసించి పాలించే ఉగ్రనేత్ర ద్వయంతో ముందుకు కదిలాడు సగరుడు.

సగరుని అనుసరించి నడిచింది సగరసేన!

జిగీషా! మాయావీ! బైటకు రారా! అంటూ కేకలు పెడ్తున్నారు సగర సైనికులు.

వాళ్ళ వాడి సునపాల ధాటికి రాతిసౌధాలు పెళ్ళున విరుచుకు నేల కూల్తున్నాయి. కానీ, మాయా వ్యూహచతురుడు జిగీషుడు అంత త్వరగా చేతికి చిక్కుతాడని అనుకోవడం భ్రమ!

రాచమందిరాలన్నీ వెగుకుతూ వాటిని చిన్నాభిన్నంచేస్తున్నారు సగర వీరులు....!

అంతఃపుర సౌధాలు శిథిలాలుగా మారాయి. కానీ, జిగీషి దొరక లేదు.

చివరిగా ఒకే ఒక్క మందిరం-

అది రాణివాస మందిరం!

ఇదే చిట్టచివరి యత్నం-ఇక్కడా జిగీషి లేకపోతే, అతన్నిపట్టడం అసాధ్యమే ఇంక!

“మందిరంలో ఎవరున్నాసరే, తలుపులు తెరుచుకుని వెంటనే బయటకు రండి! నా హెచ్చరికను మన్నించి వచ్చినవారికి ఇదే అభయం....” అన్నాడు సగరుడు బిగ్గరగా!

ఆ మాటలు మంత్రమయ యుక్త శబ్దతరంగాల్లా పనిచేసి, ద్వారాలు నెమ్మదిగా తెరుచుకున్నాయి.

తెల్లటి పన్నీటి పూవులు ఒక్కసారి గుభాళించినట్లు, సుగంధం భూమండలం అంతా వ్యాపించినట్లు, సౌందర్యం గలగలా ప్రవహించినట్లు ఎదురుగా అపురూప, అసమాన, అసాధారణ సౌందర్యవతి యోజిత.... వేయి సూర్యుల ప్రభలతో మెరుస్తూ—కోటి ఉషఃకాంతల కాంతులను మరిపిస్తూ....!!

“ప్రభూ! ఈమె జిగీషి ఇంట అష్టకష్టాలూ పడుతున్న అతనికోడలు-ఇర్యా దేశపు రాకుమారి....యోజిత....” అని పరిచయం చేశాడామెను సౌభరి!

“ఆహా! కామిత దేశపు సౌకుమార్యవతి ఈమేనా....” అని విస్తుపోయాడు ఒక్కక్షణం సగరుడు.

“అమ్మా! వీరు సగర సార్వభౌములు. యుద్ధోన్ముఖులై ఉన్నారు. తెల్లవారేలోగా జిగీషి వధ జరిగిపోవాలని ప్రతినబూనారు. ఆ మాయావి ఎక్కడ దాగున్నాడో తెలుసా తల్లీ....”అన్నాడు ప్రాధేయపడుతూ సౌభరి.

“నాతో రండి—చూపిస్తాను—” అంటూ సైనికులను దాటుకుంటూ ముందుకు నడిచింది యోజిత! ఆమెనే అనుసరించారందరూ!

“అదుగో.... ఆ పాలిపోయిన చెక్కల గదిలో దాక్కున్నాడు—” అంటూ సగంకూలిన గదినొకదాన్ని చూపించింది యోజిత. “మీరు ఆగదిని

కాల్చి ఇవతలికి వచ్చాక అందులో చేరాడు. నేను చూశాను—" అంది మళ్ళీ!

హాఁ....హాఁ....అంటూ ముందుకు దూకబోయారు సైనికులు.

"ఆగండి...." అంటూ వాళ్ళని వారించి, ఇంకా చల్లారని ఓ దివిటీని అందుకొని ఉగ్రంగాచూస్తూ చెక్కల గదివైపు నడిచింది యోజిత!

ఒక్క క్షణం కళ్ళుమూసుకొంది-

తన తండ్రి రాజ్యం పోయేసరికి తన బంగారు జీవితాన్ని బానిస మయం చేసిన ఆ జిగీషికి ఇదే తగినశిక్ష....అనుకొంటూ, చెక్కల గదికి నిప్పు అంటించింది!

మంటలు ఒళ్ళంతా అంటుకొని హాహాకారాలుచేస్తూ జిగీషుడు బైటకు వచ్చి నేలమీదపడి దొర్లసాగాడు.

జిగీషి అలా చావుకేకలు పెడుతుండగా సూర్యుడు ఈ దృశ్యానికి సాక్షిని నేనేనంటూ తొంగిచూస్తూ తూర్పువాకిట నిలబడ్డాడు!

గాంధార దేశంలో ప్రతి బానిస స్త్రీ తన వంతు కర్తవ్యాన్ని నిర్వహించింది.

సగరుడు యోజిత వంక కృతజ్ఞతాపూర్వకంగా చూశాడు. నరమ ఆమెను గుండెలకు హత్తుకుని కావులించుకుంది!

ఆ ఇద్దరు వీరనారులతో సప్తసింధూముఖంగా కదిలాడు — గాంధారాన్ని జయించిన సమ్రాట్ సగరుడు!!

# 6

భరతగణ నాయకులనూ, మేధావులనూ, ఋషి మండలినీ సమావేశ పరిచి సునీర్ఘోపన్యాసం చేస్తున్నాడు ప్రధాని అష్టకుడు.

"ఆర్యోత్తములారా! బ్రాహ్మణోత్తములారా! ఏ జాతికీ ఏ నాయకుడూ అందించనంత ఆర్ష విజ్ఞానాన్ని మన ప్రభువు ప్రవీర సార్వభౌములవారు మనకందించడంలో ఎంత కృషిచేశారో మీకందరికీ తెలుసు- భరతుల కీర్తి ప్రతిష్ఠలను ఆయన దేశదేశాలలోనూ చాటి మన గణానికొక ప్రత్యేకతను సాధించారు..! అలాంటి మహనీయుని సేవల్ని మనం మరిచి పోగలమా....?

మహర్షి పుంగవులారా! ఇప్పుడా కీర్తి కాంతిని కదిలించి, మన జాతిని అంధకారంలోకి నెట్టివేసే దుష్టయత్నాలు చాలా జరుగుతున్నాయి—

దొంగదెబ్బలు తీయడం, మెరుపుదాడులు చేయడంవంటి నీచ కృత్యాలు వీరోచిత కార్యాలుగా చెప్పుకొనేరోజులు దాపురించాయి. మానవ జాతి భవిష్యత్తు అంధకార బంధురం అయిపోతుందేమోనని భయంగా వుంది—

సగరుడనే యువకుడు దీనికంతటికీ కారకుడు. ఆ పేరు చెప్పగానే అందరికీ ఒక ముఖ్య విషయం స్ఫురణకు వస్తుందని నాకు తెలుసు....

'సగరుడనే మహానుభావుడు భవిష్యత్తులో రాజ్యాలు ఏలగలడని' భవిష్యత్తు పలికిన ద్రష్టలు ఈ సభలోనే ఉన్నారు.

అయితే, వారి భవిష్యద్వాణిని ఈ సగరుడివంటి స్వార్థపరులు తమ స్వంత ప్రయోజనాలకు చక్కగా వినియోగించుకొంటున్నారు.

దారులు కొట్టడం,దోపిడీలు చేయడం పణులవంటి ప్రముఖ వ్యాపారులమీద దాడిచేసి,వారి విలువైన సంపదలను హరించడం వంటి నేరాలలో ఆరితేరిన హంతకులు కొందరు సరిగ్గా ఇరవై ఏళ్లు నిండిన ఓ కుర్రవాడిని తయారుచేసి, వాడికి సగరుడనే పేరుపెట్టి, వాడే ప్రసిన్వతులవారి పుత్రుడని చెప్పి భయంకరమయిన హత్యాకాండలతో ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తున్నారు.

సగరుడి మనుషులు వెళ్ళినంతమేరా భయం తాండవిస్తోంది. అతని వెనక జరుగుతున్న ప్రచార ప్రభావానికి లోనై వీరాధివీరులు కూడా తమకు తామే లొంగుబాటు ప్రదర్శించుకొంటున్నారంటే వింతగానే వుంది.

ఆ సగరుడు ఏ మార్గాన వెడుతున్నాడో ఆ మార్గాన తమ దుర్గాలు లేకుండా వుండాలని దేవుణ్ణి ప్రార్థించుకొంటున్నారట.

ఇదంతా చూస్తుంటే, దేశవిదేశాలను తన గుప్పెటలో పెట్టుకొని, దోపిడీ వ్యవస్థను యథేచ్ఛగా కొనసాగించాలని అతని వ్యూహంలా కన్పిస్తోంది!

ఈ పరిస్థితుల్ని నివారించడానికి, ఒకరోజు- మన ప్రభువులవారు నన్నూ, వశిష్ఠులవారిని కూడా వెంటతీసుకొని వాడి దగ్గరకు వెళ్ళి.... "నాయనా! ఇది నీకు ధర్మసమ్మతంకాదు- మనిషిని మనిషి దోచుకు తినడం మృగనీతిగాని మానవ ధర్మంకాదు–" అని హితవు చెప్పారు.

వాడు వింటేనా....? వాడూ. వాడి పెళ్ళామూ కలిసి మన ప్రభువుల వారిని ఎంత అవమానించారో మీకు తెలియదు.

క్షమాగుణం మన ప్రభువులవారి సహజభూషణం కాబట్టి వాణ్ణి అక్కడే క్షమించి వచ్చేశారు.

ఒకవేళ ఆ ఇక్ష్వాకు వంశోద్భవుడు సగరుడూ వీడూ ఒకరేనేమో నని.... అతని జన్మరహస్యం వివరించి, "ఈ భరతగణం నీదేనాయనా! నీ శక్తియుక్తులు ఉపయోగించి తాళజంఘులకు కొద్దిగా బుద్ధి చెప్పు తండ్రీ...." అన్నారు.

దానికి వాడు ఏమన్నాడో చెబితే మనందరం సిగ్గుపడవలసి వుంటుంది....

"మీ దేశానికి మేలుచేస్తే నాకేం లాభం? నాకెంత ముట్టచెబుతారో చెప్పండి ముందు...." అన్నాడు. ఆ మాటలకు అసహ్యంపుట్టి- ఛీకొట్టి వచ్చేశాం మేమంతా!

అలాంటి మానవతా హీనుడు– తుచ్ఛుడు– నీచుడు అయిన దోపిడీ దొంగ మన భరతగణంవైపు కన్నెత్తి చూడకుండా వుండే ఉపాయాన్ని అన్వేషించవలసిందిగా ఈ సభను అభ్యర్థిస్తున్నాను.

భవిష్యత్తును దర్శించగల మహామహులు ఆసీనులైన ఈ మహా సభకు ఇది కష్టసాధ్యమైన విషయంకాదు....” అని తన ప్రసంగం ముగించి కూర్చున్నాడు అష్టకుడు!

సభలోంచి ఎటువంటి ప్రతిస్పందనా లేదు. అందరూ మౌనంగా చూస్తున్నారు.

ప్రవీర సార్వభౌముడు వెను వెంటనే లేచి నిల్చుని, సభకు నమస్కరించి భరత జాతి అభ్యున్నతి కోసం తనతో కలిసి నిద్రాహారాలు మాని కృషిచేస్తోన్న తన ప్రధానిని ముందుగా అభినందించాడు. తనకు తగిన సూచనలిచ్చి తనను ముందుకు నడిపిస్తున్న ఈ మహా సభకు తన ప్రభుత్వం పక్షాన కృతజ్ఞతలు చెప్పుకున్నాడు అంతకుమించి ఆయన ఎక్కువగా మాట్లాడలేదు!

సభలో అక్కడక్కడా పథకం ప్రకారమే ఏర్పాటు చేయబడిన ప్రవీరుడి అనుచరులు అతను ప్రసంగిస్తున్నంతసేపూ కరతాళ ధ్వనులూ, జయ జయ ధ్వానాలూ చేయసాగారు.

“కోపిడి పొంగని ఎదుర్కొంటాం....

ప్రవీర సార్వభౌముని సంరక్షించుకుంటాం....” అనే నినాదాలతో వాళ్ళు సభను హోరెత్తించసాగారు. మీసాలు మెలివేస్తూ చిద్విలాసం చేశాడు ప్రవీరుడు.

సరిగ్గా అదేసమయానికి వశిష్ఠుడు సభలోకి ప్రవేశించాడు.

ఆయన ఆకస్మిక ఆగమనం ప్రధానినీ, ప్రవీరునీ అయోమయంలో పడవేసింది.

వశిష్టుడు మరోసారితమను మోసంచేశాడన్నమాట....ఇంకొన్నాళ్ళ వరకూ తిరిగి రానని చెప్పి, సరస్వతీ తీరానికి వెళ్ళి, కావాలనే సరిగ్గా ఈ సమయానికే ఊడిపడ్డాడు....అనుకున్నాడు ప్రధాని.

వెంటనే సర్దుకుని, వశిష్ఠునికి స్వాగతం చెబుతూ, ప్రయాణపు అలసటలో ఉన్నారు. ఈ పూటకు విశ్రాంతి తీసుకోండి మహాత్మా....” అన్నాడు ఎంతో గౌరవాన్ని వినయాన్నీ నటిస్తూ ప్రధాని!

కానీ, వశిష్టుడు మరొకరి అనుమతిలో నిమిత్తం లేకుండా సభ మధ్యలో నిలబడి వందనం చేశాడు. ప్రధానినీ, ప్రవీరునీ ఆయన పట్టించు కోలేదు!

"ఆర్యోత్తములారా! సగరుడి జన్మరహస్యాన్ని ఎరిగినవారు బుధమహర్షి వారిని సభలోకి ప్రవేశపెడుతున్నాను. జగద్గురువు బుధ మహర్షులవారు మీకు స్వయంగా సగర కుమారుని జన్మరహస్యం వివరి స్తారు-" అంటూ సభ వెనక వరుసలో నిల్చుని ఉన్న బుధ మహర్షిని సాదరంగా ఆహ్వానించి, తాను మౌనంగా చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

బుధ మహర్షి అంతటి వాడిని నిరోధించడం అసాధ్యం కాబట్టి ప్రధానీ ప్రవీరు లిద్దరూ అసహాయంగా చూస్తూ కూర్చుండిపోయారు.

బుధ మహర్షి లోపలికి విచ్చేస్తుంటే, సభలోని మేధావులూ నాగర కులూ, మహర్షులూ సగౌరవంగా స్వాగతం పలికారు.

ప్రవీరుడు అప్రయత్నంగానే లేచి నిల్చుని, ఆయనను తన సరసన ఉన్నతాసనంపైకి ఆహ్వానించాడు. అంతకుమించి ఆయన చేయగలిగిందేమీ లేదు—

అందరి గౌరవ వందనాలూ స్వీకరించి, సభను ఉచితరీతిని సంబో ధించాడు బుధ మహర్షి.

"మహనీయులు జనించిన ఈ భరత భూమిలో, విజ్ఞాన బీజాలను మొలకెత్తించి, అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి, ఈ జగతికి జ్ఞాన భిక్ష పెట్టిన భరతులైన మహాత్ములకు నా నమోవాకాలు··

నన్ను సత్కరించి ఇక్కడ ప్రసంగించేందుకు అవకాశం కల్పించిన ఈ సభకు నా కృతజ్ఞతాభివందనాలు.

మహా సగరుని జన్మ వృత్తాంతం వెల్లడి చేయమని వశిష్టులవారు నన్ను ఆదేశించారు. సమస్త ప్రజానీకం సమక్షంలో దాన్ని వెల్లడిచేయడం నా పవిత్ర కర్తవ్యం. అందుకోసమే నేను ఇంకా బ్రతికిఉన్నానుకూడా....!

మహనీయులారా....!

ప్రపంచంలోని జాతులన్నింటినీ ఏకంచేసి, ఒకే త్రాటిపై నడిపించడానికి అవతరించిన ఇంద్రునిలా, తన విజయ పరంపరను కొనసాగిస్తున్న ఆ సగరవీరుడు కీర్తిశేషులైన మన ప్రసిన్వత సార్వభౌముని తనయుడే!

ప్రసిన్వతులవారు మరణించాక, ప్రాయోపవేశం చేయబోయిన ఆయన ధర్మపత్నిని ఉర్వమహర్షి సంరక్షించి ఆమె కడుపున జగజ్జేత పెరుగుతున్నాడని భవిష్యత్ పలికారు.

ఆతర్వాత జిగీషి దౌష్ట్యానికి ఆమెతోపాటు ఉర్వమహర్షి కూడా బలి అయ్యారు.

ఆ రోజునుంచి పది వసంతాలపాటు సగర కుమారుడిని నాకుమారుడిగానే ప్రకటించి, విద్యాబుద్ధులు నేర్పించాను.

ఒకరోజు, నామీద ఆగ్రహంతో నా కుటుంబం మొత్తాన్నీ చీకటి కూపాలలో బంధించాడు జిగీషి.

దైవ వశాన నేను తప్పించుకున్నాను- కానీ, చిరంజీవి సగర కుమారుడు పది సంవత్సరాలపాటు ఆ చీకటికూపాలలోనే మగ్గిపోయాడు.

కీర్తిశేషులు రథవీతి రాజర్షి నిర్వహించిన సత్రయాగం సమయంలో తప్పించుకున్న బలిపురుషుడు ఈ సగరవీరుడే!

ఆ తర్వాత జరిగిన కథ మీ అందరికీ తెలుసు!

చిన్న చిన్న గడ్డిపరకలు కలిసి ఏనుగును బంధించగలవన్నట్లు చిన్న చిన్న గణాలను సమైక్యపరచి మహాసేనావాహినిని నిర్మించాడు సగరుడు.

అతనిప్పుడు రాజాధిరాజు!

ఈ సమస్త భూమండలం ఆయన ఆధీనంలోకి వచ్చి, సగర చక్రవర్తిగా వాసికెక్కే సమయం ఆసన్నమయింది.

ఆ మహావీరునికి సగౌరవంగా స్వాగతం పలికి, సమున్నతంగా సత్కరించి, ఈ సింహాసనాధీశుని చేయవలసిందిగా మహామహులూ, తేజో విరాజితులతో ప్రకాశిస్తున్న ఈ సభకు విజ్ఞప్తి చేస్తున్నాను!

భరతగణంలో పుట్టినవాడు ప్రపంచవిజేత కావడం మన అందరికీ గర్వకారణం...." అన్నాడు బుధమహర్షి.

ఆయన అలా ప్రసంగిస్తుంటే వెర్రెత్తిపోతున్నాడు ప్రవీరుడు. పళ్ళునూరుతున్నాడు ప్రధాని.

ప్రవీరుని కనుసైగ కోసం ఎదురుచూస్తున్నారు- సభలో పథకం ప్రకారం నిలబడిన ఆయన అనుచరులు.

అవసరమైతే, సగర పక్షపాతులైన మహర్షుల తలలు నరికి, రక్తపాతం సృష్టించడానికైనా వెనుదీయని నమ్మినబంట్లు వాళ్లు.

ప్రవీరుడు తన క్రోధాన్ని దాచుకొంటూ, "బుధ మహర్షీ! సగరుని జన్మ వృత్తాంతం ఎరుకపరిచినందుకు మీకు మా ధన్యవాదాలు. ఇంక తదుపరి కర్తవ్యం గురించి మా రాజ్యసభ నిర్ణయం తీసుకొంటుంది. మిమ్మల్ని వశిష్టులవారు మా అతిథి మందిరానికి తోడ్కొని వెడతారు. అక్కడతమరు విశ్రాంతి తీసుకోవచ్చు...." అంటూ సభనుంచి నిష్క్రమించవలసిందిగా పరోక్షంగా శాసించాడు ప్రవీరుడు.

ఆయన అలా అంటుండగానే, సభలో బిగ్గరగా కేకలువిన్పించాయి.

"వీల్లేదు....ఆ దోపిడి దొంగ మాకు ప్రభువు కావడానికి వీల్లేదు....

"ప్రవీర సార్వభౌములు వర్ధిల్లాలి.... మహా క్షాత్రకుల బాహుబలం వర్ధిల్లాలి...." అనే నినాదాలు పిక్కటిల్లాయి—

ఈ కోలాహలం ఇలా జరుగుతుండగా—

పెనుగాలులు విరుచుకుపడ్డట్టు....మహా పర్వతాలకు రెక్కలొచ్చి ఎగిరి తమమీదే దూకుతున్నట్టు....వెర్రికేకలు పెడ్తున్న ప్రవీరుని మనుషుల మీద బలమైన ముష్టిఘాతాలు తగిలాయి—

సభలో పెద్దపెట్టున గందరగోళం చెలరేగింది. ఏ జరుగుతుందో అర్థంకాకుండా త్రొక్కిసలాట జరిగింది.

భయంతో ఒకరినొకరు తోసుకొంటూ ముఖద్వారంవైపు పరుగులెత్తసాగారు....

అలా అంతా అల్లకల్లోలంగా ఉండగా....

వేడుగా రాజ్యసభలోకి మెరుపు వేగంలో ఒక గుర్రం దూసుకు వచ్చింది.

అనంత భూభారాన్ని మోసే ఆదిశేషుడిలా.... మూర్తీభవించిన సూర్యదేవునిలా....అమృతత్వాన్ని ప్రసాదించే వనౌషధిలా....సమ్రాట్ సగరుడు ...రాజాధిరాజు....!!

ఆయనను చూస్తూనే రెండు చేతులూ జోడించి ప్రజలు నమస్కరిస్తుండగా—

ఆయన ముఖవర్చస్సుకు ముగ్ధులై "చిరంజీవ! చిరంజీవ!" అని మహర్షిలోకం దీవెనలు అందిస్తుండగా—

ఆయన శౌర్యపరాక్రమాలకు తనిసి—ధర్మ పక్షపాతులైన ప్రవీరుని సైనికులు సిరోచితమైన వందనం చేస్తుండగా....

సభలోకి దూసుకువచ్చిన అశ్వరాజం భరత సింహాసనంవద్దకు వచ్చి ఆగింది.

ఈ హఠాత్సంఘటనకు చలించిపోయాడు ప్రవీరుడు.

తన స్వర్ణఖచిత మయూర సింహాసనంమీంచి దిగ్గున లేచి, పిడిబాకును గురిచూసి సగరుడిమీదకు విసిరాడు.

ఇలాంటి విసుర్లకు ఎప్పటినుంచో అలవాటుపడిన సగరుని సితవాజి చటుక్కున ప్రక్కకు తప్పుకొంది.

పిడిబాకు ఆ తెల్లగుర్రాన్ని అధిరోహించిఉన్న సగరునిప్రక్కనుంచి దూసుకుపోయి సభామధ్యమంలోని స్తంభానికి తగిలి ఠంగున మోగింది!

సగరుడు ఇంత అకస్మాత్తుగా ఇలా తమపై మెరుపుదాడి చేస్తాడని ఊహించని ప్రభాని విస్తుపోయాడు.

కోల్పోయిన ధైర్యాన్ని కూడగట్టుకొంటూ, ప్రవీరుడు తన అనుచరులను ఇంక విజృంభించమని ఆజ్ఞాపించాడు.

"ఈ సగరుడి మూకను పట్టి బంధించండి. ముక్కలుముక్కలుగా నరికి కాకులకూ గ్రద్దలకూ వేయండి...." అన్నాడు తన సైనికులను ఉత్సాహపరుస్తూ ప్రవీరుడు.

ప్రవీరుడు ఆ మాట అంటూవుండగానే, లోహాముఖి అయిన తీక్ష్ణ శరం మహాసగరుని ధనువునుంచి వెలువడి రివ్వున ముందుకుదూసుకుపోయి ప్రవీరుని హృదయాన్ని తాకింది.

ఆతని గుండెలలో నిక్షిప్తమైవున్న పాపభాండం ఆ శరఘాతానికి భళ్ళున పగిలింది.

తప్పుకునే అవకాశంలేక నేలకొరిగాడు ప్రవీరుడు!

* * *

భరత గణాధిపతిగా మయూర సింహాసనం అధిష్ఠించిన సగర చక్రవర్తి పట్టాభిషేకాన్ని వశిష్ఠ మహర్షి స్వయంగా దగ్గరుండి జరిపించాడు. సప్తసింధు పూర్తిగా సగరుని ఆధీనంలోకి వచ్చింది.

ఇక్ష్వాకు వంశోద్భవుడు మహాసూర్యుని మానస పుత్రుడు. భరత గణ సంజాతుడు సమ్రాట్ సగరుడు తూర్పున గంగాతీరం వరకూ తన రాజ్యాన్ని విస్తరించాడు.

ఆయన ఏలుబడిన నడుస్తున్న ఈ ప్రాంతాన్ని సప్తసింధూదేశమని, భరతగణంపేర భారతదేశం అనీ వ్యవహారంలోకి వచ్చింది.

భారతీయులైన ప్రజల సంక్షేమాన్ని సంరక్షిస్తూ భారతదేశాధీశునిగా పట్టాభిషిక్తుడైనాడు సగరుడు.

తన పట్టాభిషేక సందర్భంగా సామ్రాట్ పదవిని అంగీకరిస్తూ ఆయన చేసిన ప్రసంగం ఇలాసాగింది.

"భూమండలంకన్నా సముద్రం ఎంతో విస్తృతమైంది. భూగోళంపైన భూమికన్నా నీరు అధికంగా ఉన్నదన్న వాస్తవం శాస్త్రవేత్తలైన మీవంటి మహనీయులందరికీ తెలుసు!

నాగరకత నదీ పరివాహక ప్రాంతాలలోనే అభివృద్ధి చెందుతోంది- నదికి దూరమౌతున్న కొద్దీ త్రాగే నీరుకూడా లేని దుస్థితిని నా క్షేత్రయాత్రలలో అనుభవపూర్వకంగా గ్రహించాను.

నీరులేనిదే ఆహారోత్పత్తి లేదు. కాబట్టి సమృద్ధిగా ఉన్న నదీ జల సంపదని సారవంతమైన పంటచేలలోకి మళ్ళించి పుష్కలంగా పండించుకో

గలిగాలి — అందుకే, మాపాలనలో వ్యవసాయానికి ప్రథమ స్థానం ఇస్తున్నాం!

నా ప్రియమైన ప్రజలారా....! మహిమాన్వితులైన మేధావులారా....!

ఆయుధాలు విసర్జించండి....నాగలి పట్టండి....నేలను దున్నండి.... పంటలు పండించండి....పండిన పంట నేటినుంచీ అందరి సమిష్టి!

యుద్ధజీవులైన ప్రజలు బుద్ధిజీవులుగా పరివర్తన చెందాలనేదే నా ఆకాంక్ష...." అంటూ మహోద్వేగంగా ఉపన్యసించాడు సగరుడు!

పట్టాభిషేకాన్ని తిలకించడానికి విచ్చేసిన వేలాది ప్రజలు కొన్ని నిమిషాలసేపు కరతాళధ్వనులతో సభాస్థలిని హోరెత్తించారు—

మహామంత్రిణి అసురసేని మానవ కళ్యాణానికే తన జీవితాన్ని అంకితం చేస్తున్నట్లు ప్రకటించింది-వివిధ జాతుల ఆధీనంలోని బానిస లందరూ ఈ శుభసమయాన బానిసత్వం నుంచి విముక్తినొందుతున్నట్లు ప్రకటించిందామె!

ఆమె ప్రకటన వెలువడగానే జనం కోలాహలం చేశారు.

"ఇంకనుంచి-స్వల్ప వివాదాలతో జాతులు యుద్ధానికి తలపడటాన్ని నిషేధిస్తున్నాం! వివాదాల పరిష్కారాలకు ఉన్నతమైన రాజ్యసభను నిర్మిస్తున్నాం!సామాజిక నీతినెరిగిన మహర్షులు ఈసభలో సభ్యులుగాఉంటారు. సమ్రాట్ సగరులవారుకూడా ఈ సభకు బద్ధులుగా వ్యవహరిస్తారు...." అన్నది మహామంత్రిణిగా ప్రసంగిస్తున్న అప్సర-

ప్రజాహిత కార్యాలను నిర్వహించే బాధ్యతలను ఆయా రంగాలలో ప్రసిద్ధులైన మహర్షులకు అప్పగించారు.

వివిధ జాతులు సంతరించుకున్న జ్ఞాన సంపదనీ, సంస్కృతినీ నాగరికతనీ సమ్మిళితపరచి- నూతన సంలీన సంస్కృతిని ప్రజలకుఅందించే బాధ్యతలను సౌభరి మహర్షి స్వీకరించాడు!

విద్యా వ్యాపకుడుగా జగద్గురువు బుధమహర్షి ప్రజలకు జ్ఞానబోధ చేసే ఉన్నత పదవిలో నియుక్తులయారు.

"మానవజాతి అన్నిరంగాలలోనూ బహుముఖాలుగా అభివృద్ధి సాధించాలి! అన్ని గోత్రాలలోంచి, గణాలలోంచి, జాతులలోంచి మేధావులు ముందుకు వచ్చి, నూతన సమాజ నిర్మాణ కార్యంలో పాలుపంచుకోవల సిందిగా సవినయంగా అభ్యర్థిస్తున్నాను...." అన్నది అప్సర.

ఆమె ఆదర్శానికి అచ్చెరువొందారు మహర్షులు. అది ఎన్నినాళ్ళ స్వప్నమో వాళ్ళకి....!!

ఆకలి, దోపిడీ, బానిసత్వం లేని నవీన వ్యవస్థను రూపొందించి నవసమాజాన్ని నిర్మిస్తామని ముక్తకంఠంతో ప్రతిజ్ఞచేశారు మహర్షులు-

అప్సరా సగరులిద్దరూ సభలోని మహర్షులందరికీ నమస్కరించి ఆశీస్సులు పొందారు!

జాతి, వర్ణ విభేదాలు లేకుండా వసుధైక కుటుంబంగా మనుషు లందరూ కలిసి మెలిసి జీవించాలని మానవాళికి పిలుపు నిచ్చారు-ఆ యిద్దరూ!

అవినీతి అక్రమాలకు తావులేని రీతిలో ఆదర్శప్రాయంగా మనుషుల్ని తీర్చిదిద్దే సాహిత్యాన్ని సృష్టించవలసిందిగా మానవతామూర్తులైన కవులను ప్రార్థించారు.

సమాజ గతిని నిర్దేశించే ధర్మసూత్రాలను నిర్మించవలసిందిగా సామాజిక వేత్తలను అర్థించారు. విద్యా, వైజ్ఞానిక, ఆరోగ్య శాస్త్రాలను పెంపొందింపచేయ వలసిందిగా శాస్త్రజ్ఞులైన మహర్షులను వేడుకున్నారు.

ఈ మహా సామ్రాజ్య వైభవాన్ని నిలబెడుతూ, పురోహితునిగా ఈ భరత జాతిని ముందుకు నడిపించమని కోరుతూ వశిష్టులవారి పాద పద్మాలకు అభివాదాలు చేశారిద్దరూ!

ఉప్పొంగిన ఆత్మీయతతో వారిద్దరినీ లేవనెత్తాడు వశిష్టమహర్షి!

"చిరంజీవీ! సగరకుమారా!! నీటి పారుదల సౌకర్యాలు కల్పించి, పాడి పంటలు వర్ధిల్లచేసి, దేశవిదేశాలలో నావలపై జైత్రయాత్రలు చేసి, ప్రపంచ మానవాళినంతటిని సంఘటితం చేయాలని నీవు తలపెట్టిన మహా త్కార్యం నిర్విఘ్నంగా కొనసాగుగాక! ఆశయసిద్ధి కలుగుగాక

నేయేళ్ళు చక్రవర్తివై ఈ భూమండలాన్ని పాలించు! ఈ ప్రజలకు నీవలన మహోపకారం కలుగుగాక!!

నాయనా! సగర కుమారా!

జల సదుపాయాలను కల్పిస్తున్న నీ కృషికి గుర్తింపుగా నీటిమీద ప్రయాణం చేసి దేశ దేశాలను జయించి, ఆర్ష సంస్కృతిని ఎల్లెడలా వెద జల్లుతున్న నీ ఆదర్శానికి చిహ్నంగా జలనిధి అయిన సముద్రానికి నీపేరున "సాగరం" అని నామకరణం చేస్తున్నాను!!

నేటినుంచి మహాసగరుడివై వెలుగొందు నాయనా!!" అని ఆశీర్వ దించాడు వశిష్టుడు.

మహర్షి లోకం తనపట్ల ప్రదర్శించిన అవ్యాజానురాగానికి ధన్య వాదాలు చెప్పుకొన్నాడు. మహా సాగరమూర్తి సగర చక్రవర్తి!

సగర చక్రవర్తి ఆధీనంలో, ఆయన రక్షణలో ధర్మబద్ధ పాలన నెరపడానికి ఉవ్విళ్ళూరుతూ ఆయన సార్వభౌమత్వాన్ని ఆమోదిస్తూ సకల దేశ రాజన్యులు ఆయన అనుమతికోసం ఎదురుచూస్తున్నారు.... వారి యోగ్యాయోగ్యతలను, విచారించే పనిలో నిమగ్నమై పోయారు అప్పుడా సగరులు!!

# 7

ఇరవై వసంతాల అనంతరం ఒకరోజు—

విపాశానది పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తోంది.

నదికి ఆవలి ఒడ్డున, గొప్ప మహిషపు వాడి కొమ్ముల్లా రెండు కొండలు ఆకాశాన్నంటుతున్నాయి.

మహిషుడనే రాక్షసుడు తన భయంకర హస్తాలను బారజాపి నదీమ తల్లిని కబళిస్తున్నాడా.... అన్నట్లు, ఆ మహా శిఖరాల్ని కొనసాగిస్తూ చిన్న పర్వతాల వరుస విపాశానది పొడవునా వ్యాపించింది!

పర్వతాలమీద నల్లని దేవదారు వృక్షాలు దట్టంగా అల్లుకుని మహిషాసురుడి శరీర వర్ణాన్ని స్ఫురింప చేస్తున్నాయి-

భీకరంగా పెరిగిన పర్వత శ్రేణిని చూస్తూ, ఆ నదీ తీరానికి చేరు కున్నది సరమ!

ఉక్కు కవచంమీద పొందికగా చీరకట్టుకుంది- చర్మంతో చేసిన పాదరక్షలు పిక్కలదాకా అంటుకుని, కాళ్ళకు కవచంగా అమరి ఉన్నాయి.

ఎర్రని పట్టు వస్త్రాన్ని శిరసుకు పాగాలా చుట్టుకుంది. నడుము నుంచి 'రాగి ఒర' నేలదాకా వ్రేలాడుతోంది. భూమ్యాకాశాలను కలుపుతూ నీరెండలో మెరిసే ఇంద్రధనువులా ఆమె చేతిలో వీరధనువు ప్రకాశిస్తోంది!

వేగంమీద ఉన్న నదీప్రవాహాన్ని దాటడం అంతతేలికైన విష యంగా కన్పించలేదామెకు!

సాలోచనగా తలఎత్తి నిలువుగా ఎదిగిన వృక్షన్నొకదాన్ని కదిపి చూసింది- కత్తిదూసి బలంగా ఒకే వేటు వేసింది. చెట్టు మొదలుకు విరిగి ఫెళఫెళమంటూ విరుచుకుపడింది!

శిరో వస్త్రాన్ని తీసి, ఒక కొంగును విరిగిన చెట్టుకు ముడివేసి, రెండో కొంగును మచ్చికైన తన గుర్రం "శ్వేతాశ్వ" నడుముకు బిగిం చింది. క్షణాలలో దేవదారు దూలాన్ని విపాశా నదిలోకి ఈడ్చిపడేసింది 'శ్వేతాశ్వ!'

పొడపైన ఓ కొమ్మను చెక్కి, తెడ్డుగా చేసుకొని, ఆ దుంగ మీదనే నదికి అడ్డంగా ప్రయాణించ సాగింది సరమ!

సూర్యకాంతిని అడ్డగిస్తోన్న ఆ పర్వత శిఖరాలు రెండింటి నడుమా, సహజంగా ఏర్పడిన గుహలలో స్థావరం ఏర్పరచుకుని, దోచుకొచ్చిన ప్రజా సంపదని దాచి, కులుకుతున్నాడు పణినాయకుడు కౌరుపతి!! అతని ఉనికిని వెతుకుతున్నాయి ఆమె చూపులు!

ఆ దుర్గమ గుహలలో భద్రంగా ఉన్నాననుకొని, సురాపైకంలో మునిగి తేలుతున్నాడు కౌరుపతి!

శాల్మలీద్వీపం నించి తీసుకువచ్చిన అపార ధనరాసుల్ని ఆ కొండ గుహాలలో దాచి, గుహా ద్వారాలు మూయించాడు.

చుట్టూ బ్రహ్మాండమైన కావలి-

గుహాలోపల సౌభరినీ,మరికొందరు మహర్షుల్నీ బంధించాడు....వారి జాడకోసం పణి స్థావరాలన్నీ గాలిస్తోంది సరమ!

ఇన్నాళ్ళూ కౌరుపతి ఎక్కడ ఉన్నాడో ఎవరూ కనుగొన లేక పోయారు- ఒక వేళ ఎవరైనా తెలుసుకోగలినా, బ్రతికి బైటపడలేదు.

పూర్తి సురామైకంలో మునిగిపోయిన కౌరుపతి ఉన్మత్తంగా నోటి కొచ్చినట్లు ఏవేవో మాట్లాడుతున్నాడు. అతని అనుచరులు కేరింతలు కొడుతూ వినోదిస్తోన్నారామాటలకు!

"ఒరేయ్ సగరా.... మా మిత్రుడు జిగీషి ప్రభువుని పొట్టన పెట్టు కున్నావు కదరా.... ఇప్పుడు చూడూ.... నీ మనిషి సౌభరి నాకు మళ్ళీ దొరికిపోయాడు. ఈసారి వాణ్ణి వదిలేస్తాననుకున్నావా....కుళ్ళబొడుస్తాను-" అంటూ కేకలు పెడుతున్నాడు కౌరుపతి!

ఆనాడు సగరుడు అడవులలో తన అనుచరుల్ని చంపి, తనను కొండలోయల్లోకి నెట్టేసిన సంఘటన అతను తాగినప్పుడల్లా గుర్తుకొస్తుం టుంది. ఆ అవమానభారం భట్టుకోలేక మళ్ళీ మళ్ళీ తాగి నేలమీద తూలి పడుతూనే ఉంటాడు- ఈ ఇరవైయేళ్ళుగా అతని నిత్యకృత్యం అదే!

ఇంతలో కొందరు పణి అనుచరులు సరమని పట్టి కౌరుపతి సమక్షంలోకి తీసుకు వచ్చారు-

"ఎవరో ఈ ఆడపిల్ల ప్రభూ....! మన కొండల మధ్య ఒక్కతే తారట్లాడుతోంది. నీ కోసమే వచ్చానంటోంది-" అన్నారు వాళ్ళు.

పణి నాయకుడు ఆమె వంక తేరిపార చూశాడు. "నువ్వెవరవే పిల్లా....? నాతో నీకు పనేమిటే....?" అన్నాడు కౌరుపతి కళ్ళు చిట్లించు కొని చూస్తూ.

"నేనేరా! సరమని! ఆ ఇంద్రుడు పంపిన దూతని-" అని గుడ్లురిమి చూసింది సరమ.

"ఓహో! సరమవా! చక్రవర్తిగారి ముద్దులరాణివా! చీకటి గుహల్లోకి నిన్నెందుకు పంపాడే ఆ ఇంద్రుడు....?" అంటూ కిసుక్కున నవ్వాడు కౌరుపతి.

సరమ బుస్సున కాళనాగులా లేచింది-

"పవిత్ర విపాశా నది సాక్షిగా-నువు తస్కరించిన ప్రజాధనాన్ని స్వాధీనం చేసుకోవాలని వచ్చాన్రా....ఆ ఇంద్రుని దూతన్రా నేను...." అంటూ ఒరలోంచి కత్తిదూసింది సరమ!

ఆమె అలా కత్తిమీద చెయ్యి వేయంగానే వందమంది పణివీరులు ఎదుర్కొవడానికి సిద్ధంగా ముందుకు కదిలారు.

వారించాడు కౌరుపతి!

"ఆగండ్రా! ఒంటరి ఆడపిల్ల! పైగా నగరులోరి ముద్దులపెళ్లాం...." అని కాసేపు నవ్వి- "మా సంపదని ఎలా దక్కించుకుంటావే చెల్లీ.... నీ మొగుడో-ఆ ఇంద్రుడో మాకు తేరగా ఇచ్చాడనుకున్నావా....ఇది మా కష్టార్జితమే పిచ్చిఅమ్మడూ....!" అన్నాడు.

"అసలింద్రుడెవడు దొరా....? ఆ నగరుడా ఇంద్రుడంటే-" అని హేళనగా అడిగాడో పణి!

"ఒసే చెల్లీ....ఆ ఇంద్రుడెవడో చూడాలని మావాళ్ళు ఉవ్విళ్ళూరుతున్నారే....ఆయనే వస్తే మా గొడ్లుకాచి పాలు పితికేవాడు కదా...." అన్నాడు ఇంకో పణి....అందరూ ఘొల్లున నవ్వారు—

"ఆ ఇంద్రుడే ఇక్కడికి వస్తే మీరిపాటికి మలమల మాడిపోయే వాళ్ళు....!" రౌద్రంగా అంది సరమ!

"ఒసి పిచ్చితల్లీ! ఈ కౌరుపతి మునుపటిలా లేడే! ఇప్పుడు మీ నగరుణ్ణి ముక్కలుగా నరకడానికి మా దగ్గర ఆయుధాలు పదునెక్కి వున్నాయి-" అన్నాడు కౌరుపతి- వీరమీసం మెలివేసి, మరికాస్త సురని పట్టిస్తూ!

(19)

"ఏడిశావ్! ఆయన కాంతి సోకితే భస్మమైపోతావురా—" అని వాణ్ణి చెప్పగొట్టింది సరమ!

ఇంతలో వెర్రెత్తినట్లయి కత్తిదూసి ఓ పణివీరుడు ఎగిరి సరమ మీదకు దూకాడు. వాణ్ణి గాలిలోనే ఆపి, తల తెగ నరికింది సరమ. తలా మొండెమూ విడివడి దూరంగా పడ్డాయి.

"ఓరీ కర్కోటకులారా! ఇవ్వాళ్టితో మీజాతి చరిత్ర పరిసమాప్తమై పోతోంది....ఒకసారి తలెత్తి పైకి చూడండ్రా...." అంటూ పర్వతాగ్రాల మీదకు చేయెత్తి చూపించింది సరమ!

ఒకరూ-ఇద్దరూ-పదురూ-వేలూ-వేలకు వేలు....నగర సేన....వింటి నారిని సంధించి బాణాలు గురిచూసి సిద్ధంగా నిలబడి వున్నారు. చేతి సైగ చేస్తేచాలు సరమ-పిడుగులు కురిపించేందుకు సన్నద్ధంగా-! ఉప్పెనలా విరుచుకు పడేందుకు సమాయత్తంగా....!

"చూశావా పణి నాయకా! నీలాంటి అర్భకుణ్ణి పట్టుకోవడానికి ఆ ఇంద్రుడే దిగిరావాలా....? నువ్వెక్కడ దాగివున్నావో అక్కడికే సరుగా నన్ను పట్టి తీసుకొచ్చారు మీవాళ్ళు. నా నీడనే నా సేన అంటి ఉంది...." అంటూ గలగలా నవ్వింది సరమ!

అంతలోనే రౌద్రంగా మారి—"నీచుడా! ప్రపంచ విజేతనే నీ పశువులకు కాపలి పెట్టిస్తావా....చేతనైతే ఈ కత్తిదెబ్బను కాచుకోరా...."అంటూ ఒకేఒక వేటు వేసింది సరమ! కౌరుపతి శరీరం రెండుగా చీలిపోయింది.

పణి జనం ఆగ్రహంగా కత్తులుదూసి సరమమీద విరుచుకుపడ్డారు. గిర్రున తిరుగుతూ-రివ్వున తన కత్తిని వలయాకారంగా ఝుళిపిస్తూ వాళ్ళ నెదుర్కొంటోంది సరమ! ఆ వీరనారిని ఏమీ చేయలేకుండానే పెనుగాలులకు రాలిపడిన చీడపురుగుల్లా నేలకొరుగుతున్నాడు ఒక్కో పణివీరుడు!

ఈలోగా పర్వతాగ్రాలమీంచి తాళ్ళద్వారా నేలను చేరుకోసాగారు భరతవీరులు-

పరపీడనే తమ జాతి ధర్మంగా-మోసం, కుట్ర, దోపిడీలకు నిలయంగా, మానవజాతిని హింసించిన దేశద్రిమ్మరులైన పణి వ్యాపారుల కథ ఆ కొండలోయలలో అలా శాశ్వతంగా ముగిసిపోయింది!

సౌభరి చెరని విడిపించి, పణులు దాచిన అపార ధన సంపదనీ స్వాధీనం చేసుకొంది సరమ.

"భరతవీరులారా! ఈ సంపద దేవతారూపులైన ఆర్యులది! దానిని ఈ పణి కిరాతకులు అక్రమంగా ఆక్రమించారు. నేటితో ప్రపంచ మాన వాళికి వారి పీడ విరగడైపోయింది ఈప్రజాధనాన్ని ప్రజలందరకూ సమా నంగా అందచేస్తారు సగర చక్రవర్తి-" అని ప్రకటించింది సరమ!

*　　　　*　　　　*

"యువరాజులిద్దరికీ నా ఆశీస్సులు....

నాయనా! అసమంజసా!

చిరంజీవీ! ఉర్ముఖా!

నేటితో మీ విద్యాభ్యాసాలు పరిసమాప్తమైనాయి.

ఈ చరాచర జగత్తునంతటినీ సమర్థవంతంగా పాలించగల శక్తిని ఆ ఇంద్రుడు మీకు కల్గించుగాక!

జ్ఞానవ్యాప్తికి అహరహం శ్రమిస్తున్న మహర్షి సౌభరి నాకు అప్ప గించిన విద్యాదాన కర్తృత్వాన్ని నేను నెరవేర్చగలిగాను.

రెండు దశాబ్దాల జీవితాన్ని పూర్తిచేసుకున్నారు మీ ఇద్దరూ!మానవ జీవితాన్ని అర్ధంచేసుకోగల స్థితికి ఎదిగారప్పుడే! నేను నేర్పిన విద్యతో ఈ ప్రపంచ గమనాన్ని పరిశీలించండి!

భగవంతుడు మీ విద్యకొక చక్కని మార్గాన్ని చూపి ఈ ప్రజలకు మీవలన సకల సౌఖ్యాలూ ఒనగూరేలా వరాన్ని ప్రసాదించుగాక...." అన్నాడు గురువు.

మహా సగరుని పుత్రులు అసమంజసుడు, ఉర్ముఖుడు తమకు విద్యా దాన మొసంగిన గురువుకు నమస్కరించారు.

"విద్యకు శుభావసానం కావాలని పెద్దల నిర్ణయం. ఈరోజు శుభ దినం. నావద్ద శిష్యరికంలో మీకు ఇది చివరిరోజు. నేను బోధించిన విద్య లలో మీకేమైనా సందేహాలుంటే వాటిని అడగండి. తీర్చేందుకు ప్రయ త్నిస్తాను.

రేపటినుంచి లౌకిక వ్యవహారాలలో మీరు తలమునకలౌతారు. ప్రజా పాలన విషయంలో ఎటువంటి పొరబాటూ మీ వలన జరగకూడదని నా భావన...." అన్నాడు ఆశీర్వదిస్తూ గురువు.

"పూజనీయులైన గురుదేవా!" అంటూ ఉర్ముఖుడు చొరవగా ముందుకువచ్చాడు. "సకల శాస్త్రాలనూ బోధించిన మీకు మా కృతజ్ఞతలు ప్రజాసేవకు మేము అవలంబించదగిన మార్గాలను సూచించండి స్వామీ!" అన్నాడు ప్రాధేయపడుతూ.

"నాయనా! ఉర్ముఖా! వినయం విద్యను శోభిల్లజేస్తుంది. సరియైన సమయంలో సరియైన ప్రశ్ననే అడిగావు.

పొలాలను దున్ని, పంటలు పండించి, మానవాళి తమ ఆటవిక జీవనాన్ని వదలి, గ్రామాలలోనూ, పురాలలోనూ, నగరాలలోనూ శాశ్వత నివాసం ఏర్పరచుకోగల్గిన దశలో ప్రస్తుతం మనం జీవిస్తున్నాం.

పంటలు పండించడం, పశువులను మచ్చికచేసుకోవడం, సంపదని రేపటికోసం నిలవబెట్టి తనకున్నదానిలో లేనివారికి ఇంత పెట్టడం... ఇదే నేటి మానవుని నాగరకతా ధర్మం.

ఈ ధర్మాన్ని ప్రజలు సంపూర్ణంగా ఆచరించేలా చూడడమే పరిపాలన!

పరిపాలనలో మీ ఇద్దరూ భాగస్వాములు.

పాలకులుగా మీ ధర్మాన్ని నెరవేర్చడమే మీరు చేయగల ప్రజాసేవ నాయనా!" అన్నాడు గురువు.

ఉర్ముఖుడు గురువుగారి మాటలకు సంతోషంగా తలపంకించాడు.

అసమంజసుడు మాత్రం అసహనంగా కదిలాడు—

"ఇదెక్కడి ధర్మపాలన మహర్షీ? ఉన్నవాడూ లేనివాడూ ఇద్దరూ కలకాలం ఉండే వ్యవస్థగురించే చెబుతున్నారు మీరు! లేనివాడు జీవితం అంతా ఉన్నవాని ముష్టిమీద బ్రతకవలసిందేనా....?" అనడిగాడు అసమంజసుడు.

గురువు కొంత ఇబ్బందిగా అసమంజసునివంక చూశాడు.

"నాయనా! అసమంజసా! సగర చక్రవర్తికి కాబోయేవారసుడివి... ఆయన పాలననే వెక్కిరిస్తున్నావా....? అంటూ మందలించబోయాడు.

"ఇది వెక్కిరింపుకాదు మహర్షి! వాస్తవం! పొలాలు దున్నుతూ పౌరుషహీనులై బ్రతుకుతున్నారుకాబట్టి, నాగరకుల్ని అనాగరకులు ఆట పట్టిస్తున్నారు. కత్తిపట్టి కదనరంగాన నిల్చుని తలలు తెగనరికే శౌర్యం గల జాతివంక కన్నెత్తి చూడగలరా....ఎవరైనా? ప్రజలు బలహీనులై ప్రతి చిన్నవిషయానికి ప్రభుత్వంపైనఆధారపడవలసిన దుస్థితి కల్పించారు- ఇదేనా ప్రజలకు కల్పించగల స్వాతంత్ర్యం....?" రెట్టించాడు అసమం జసుడు.

"అన్నయ్యా! ఏమిటా మాటలు?" అన్నాడు కోపంగా ఉద్ముఖుడు.

"నువు విమర్శిస్తున్నదెవరినో తెలుసా? సాక్షాత్తూ సగరచక్రవర్తిని! ఈ నేరానికి శిక్ష దేశబహిష్కరణ! ఎందుకలా నోరుపారేసుకుంటావు-" అని అసమంజసుని వారించాడు.

"మంచీ చెడులగురించి మాట్లాడటమే నేరం అయితే ఇదేమి ప్రజా స్వామ్యం....?" అడిగాడు గద్దిస్తూ అసమంజసుడు.

"నాయనా! అసమంజ కుమారా! నీ ఆలోచనలు సరిఅయినదారిన నడవడంలేదని చెప్పడానికి విచారిస్తున్నాను–" బాధగా అన్నాడు గురువు. "ఇది యువరాజుగా నీకు తగని ఆలోచన–" అన్నాడు గట్టిగామందలిస్తూ!

కాని, అసమంజసుడు తన పట్టు విడువలేదు.

"నాది అర్థం ఉన్న వాదనే మహర్షి! మీ యిద్దరే నన్ను అర్థంచేసు కోవడంలేదు.

ఇంట్లో నలుగురు మనుషులున్నారనుకోండీ.... తండ్రి కుటుంబ పోషణభారం చూసుకుంటున్నాడు. పెద్ద కొడుకు నాగలిపట్టి పొలందున్ను తున్నాడు. చిన్నకొడుకు పశువులను మేపుకొస్తున్నాడు కూతురు పాలు పితికి ఇంట్లో పెడుతుంది. అమ్మ వంటచేసి అందరికీ వడ్డిస్తోంది.

ఇలా ఎవరిపనులు వారు చేసుకున్నాక, మిగిలిన సమయంలో ఏంచేస్తారు? ఏమీచేయరు. కాబట్టి సోమరిపోతు లౌతారు. సోమరితనం

ముదిరిపోయాక ఆ కాస్తపనికూడా మానేసి వాన దాసీలను పెట్టుకోవడం మొదలుపెడతారు-

శ్రమించడం మరిచిపోయి, సౌకుమార్యం పెరిగిపోయి. మనుషులు ఎందుకూ పనికిరాకుండాపోతారు.

పిల్లిని చూసి కూడా భయపడే జాతి.... మీ విధానాల వలనే తయారౌతుంది ...ముందు ముందు.... చూస్తూ వుండండి....!!

అయినా, మీ మహర్షులకి ప్రజలిలా నిర్వీర్యం అయిపోవడమేగా కావాలి....?? మీ పాదాలను ఆశ్రయించి, మీ దయాభిక్షంమీదే ఆధారపడి బ్రతికే నాగరికతనేగా మీరు కోరుకునేదీ....???" వ్యంగ్యంగా మాట్లాడడం మొదలుపెట్టాడు అసమంజసుడు!

"అన్నయ్యా! మరీ విడ్డూరంగా మాట్లాడకు! మనుషులు నాగరకంగా జీవించడంలో ఏమైనా లొసుగులు ఉంటే ఉన్నాయేమో ...! వాటిని ఎవరో ఉద్దేశ్యపూర్వకంగా చేశారనడం అన్యాయం- కాలంగడిచేకొద్దీ జీవన వ్యవస్థలో అనేక మార్పులు చోటుచేసుకొంటూ ఉంటాయి. కొత్తనీరువస్తే పాతనీరు పోతుంది. అలాగే సమాజ పరిణామక్రమంలో నువ్వు చెప్పిన దోషాలు కూడా పరిహారమౌతాయి. అంతేగాని, దోషాలున్నాయని నగరాలను కూల్చి, వ్యవసాయం మానేసి మనుషులు దేశద్రిమ్మరులై ఆటవికంగా బతకాలని వాదించడం అర్థంలేనిది....!" అని అన్నగారిని మందలించాడు. ఉర్ముఖుడు!

అసమంజసుడు తన ధోరణిని మార్చుకోలేదు-

"పౌరుష హీనమైన జాతిని పాలించడంకూడా ఒక పాలనేనా....? మూలనున్న ముసలమ్మలు చేస్తారు ఆపని!" అన్నాడు.

"ఆయుష్మాన్!"అని బిగ్గరగా అరిచాడు గురువు."నీలో ఇంత అసమంజసత్వం పెరిగిపోయిందేమయ్యా ...?" అన్నాడు.

అసమంజసుడు వికృతంగా నవ్వాడు.

"ప్రజలు బిచ్చగాళ్ళయి, ప్రభువుల దగ్గర దేహీ అని దేవురించుకునే దుస్థితి కల్పించింది మీరుకాదూ.... నిజం చెబితే అసమంజసత్వం

అంటారేం....? రాజులు దైవాంశ సంభూతులు అని ప్రచారం చేస్తోంది మీ మహర్షులే! ఆ ప్రభువులను సేవించుకుంటే పుణ్యలోకాలు వస్తాయని ప్రజల్ని నమ్మించేందుకేగా మీ మహర్షులందరూ కలిసి రాజ్యసభని ఏర్పరుచుకొంది....? అక్కడ కూర్చుని మీ మహర్షులు చేస్తున్నదేమిటీ.... ప్రభువునీ, ప్రభుత్వాన్నీ సేవిస్తూ- లోకం సుఖంగా ఉందని నమ్మింపచేయడమేగా.... మీ వలనే ఇదంతా సాధ్యపడిందని అనిపింపచేస్తేగాని మీ పబ్బం గడవదు-" అంటూ వెటకారం చేశాడు గురువుని.

"తన శిష్యుడు ఇన్నేళ్ళు విద్యనేర్చుకుని చివరకు ఎంతమాట అన్నాడూ.... ??" అని తల్లడిల్లి పోయాడు గురువు.

"యువరాజా! ఈ మాటలు నీవికావు.... ఎవరో ఈ విషపు ఆలోచనల్ని నీకు నూరిపోస్తున్నారు- చక్రవర్తికి వ్యతిరేకంగా నిన్ను ప్రేరేపించడానికి ఎవరో చేస్తున్న కుట్ర.... ఇది! ఈ విషయాన్ని వెంటనే బుధమహర్షికి తెలియజేయాలి...." అంటూ విసురుగా వెళ్ళిపోయాడాయన! గురువుని అనుసరించి కోపంగా వెళ్ళాడు దుర్ముఖుడు.

గురువు మనసు గాయపడిందని గ్రహించి తృప్తిగా నవ్వాడు అసమంజసుడు!

మహర్షులను బాధించడంలో అతనికొక ఆనందం వుంది.

అది ఈ గురువుతోనే ప్రారంభం అయింది!

పంటలొచ్చే రోజులు.-

ప్రజలంతా పంతగ ఉత్సాహంలో ఉన్నారు-

కొలుపులూ- బలిదానాలూ లేకుండా ఇంటిల్లిపాదీ హాయిగా,సంతోషంగా జరుపుకునే పండుగ-ఈ పంటల పండుగే....!

పాయసం పిండివంటలతో, బంధు మిత్రులతో ప్రజలు ఆనందంగా పండుగచేసుకుంటున్నారు-

ఆకు పచ్చని తోరణాలతో రాచ వీధి కళకళలాడుతోంది-

జగజ్జేత మహా సగరునితో రాచకార్యాలకోసం వచ్చిపోయే ప్రపంచ దేశాల ప్రతినిధులతో రాజధానీ నగరం కిటకిటలాడి పోతోంది- జంతుభయం, యుద్ధ భయం, శత్రుభయాలు లేకపోవడంతో ప్రజలు గుండెలమీద చేతులు వేసుకొని నిబ్బరంగా జీవిస్తున్నారు.

సప్త సింధులోకి వివిధ జాతుల ప్రజలు స్వేచ్ఛగా ప్రవేశించగలుగు తున్నారు వివిధ దేశాలలో దొరికే విశేష వస్తుసముదాయాన్ని సప్త సింధు వులు తేలికగా పొందగలుగు తున్నారు.

మహాసగరుని ఏలుబడిలో నౌకాయానం బాగా అభివృద్ధి చెంద డంతో ప్రపంచజాతులన్నీ ఒకదానితో ఒకటి సత్సంబంధాలను నెరపుకొనే అవకాశం దక్కింది!

సముద్రంమీద ప్రయాణం చేసేప్పుడు, నీరు చిలికినట్లు సుడులు తిరిగి- నావ ముందుకు నడుస్తుంది. నీటిని చిలికేందుకు నావ అడుగున చక్రాల వంటి యంత్రాలు అమర్చారు. నావ నడుస్తూ నీటిని చిలుకుతోంది కాబట్టి సముద్రయానాన్ని "సముద్ర మథనం" అని కూడా పిలుచుకో సాగారు.

సముద్ర మథనంద్వారా ఒకజాతి నించి మరొక జాతికి ప్రపంచ వింతలనదగిన వస్తుసముదాయం విశేషంగా అందుబాటులోకి వస్తున్నాయి.

కామధేనువులు, కల్పవృక్షాలు- వైద్యానికి పనికొచ్చే కాలకూట విషాలుకూడా ఈ సముద్ర మథనం ద్వారానే ఒకచోటునుంచి మరొక చోటుకు తరలించ బడుతున్నాయి!

మహాసగరుని ఆధ్వర్యంలో సాగర మథనం విశేషించి జరుగు తోంది. ఏ ముహూర్తాన పశిస్తులవారు సముద్రానికి మహాసగరుని పేరున 'సాగరం' అని నామకరణం చేశారోగాని, సముద్రయానం ప్రజలకు నిత్య కృత్యమై పోసాగింది.

"ఒకనాటి కిరాతక,రాక్షస, దానవ, దస్యు జాతులనేకులు ఆర్యులతో కలిసిపోయి- సంలీన- సంకీర్ణమైన నూతన జీవితాన్ని ప్రారంభించారు.

నిర్జనమై, అడవులుగా పెనవేసుకుపోయిన భూములు జన వాసాలుగా మారి, నాగరకతను సంతరించుకోసాగాయి.

అహల్యమైన- అంటే నాగలిమోపని- భూమిని దున్ని, రాళ్ళు, రప్పలతో నిండిన నేలను పదునుచేసి పంటలు పండించి కృషీవలులౌతున్నారు-

ఇంతటి మహత్కార్యాన్ని అవలీలగా సాధించిన మహాసగరుడు తన నిండు పేరోలగంలో కొలువుతీరి ఉన్నాడు-

ఆయనచే నియమించబడి, ఆయననే ప్రశ్నించగల అధికారాలను పొందిన రాజ్యసభ "సమానం-ధనం" అనే అంశంమీద సుదీర్ఘంగా చర్చిస్తోంది!

అందరూ సమభావనతో, పూర్వకాలపు దేవతలవలె, తమ భాగాలను సమానంగా పంచుకోవాలని, మనుషుల మధ్య హెచ్చు తగ్గులుంట కూడదనీ, మనుషులంతా ఒక్కటేనని ప్రతిపాదించింది రాజ్యసభ.

సభ చేసిన తీర్మానాన్ని చక్రవర్తి ఆమోదించడంతో రాజాజ్ఞగా అది అమలులోకి వస్తుంది. చక్రవర్తి ఆమోదం అనేది కేవలం ఒక సాంప్రదాయ వ్యవహారం అంతే! రాజ్యసభ నిర్ణయాన్ని విధిగా ఆమోదించితీరాలి చక్రవర్తి!!

సగర చక్రవర్తి ఆదేశం మేరకు- పణులతో కలిసి సౌభరి నాయకత్వంలో ఆర్యులబృందం సముద్రమథనంచేసి సేకరించిన అపురూపమైన, అమృతమయమయిన సంపద వివరాలను సభకు తెలియజేశాడు.

మధ్యలో-ఆ సంపదనుచూసి కన్నుకుట్టిన పణి రాక్షసులు ఆ సంపదతోసహా సౌభరి బృందాన్ని చీకటి గుహలలో దాచి వుంచడం, విశ్వమోహిని రాణీ సరమాదేవి- ఆ రాక్షసులను అంతంచేసిన వైనాన్ని మనోహర కావ్యంగా వర్ణించి చెప్పసాగాడు.

"వయసున ఎంతో చిన్నదైనా రాణీ సరమాదేవి తన అపూర్వ సాహసంతో మాకు ప్రాణభిక్ష పెట్టింది. ఆమె శౌర్యాన్ని ఈ సభాముఖంగా

అభినందిస్తున్నాను. ఆమెను చరితార్థురాలిగా ఆశీర్వదిస్తున్నాను—” అన్నాడు ప్రసన్నవదనంతో సౌభరి.

అది విన్న మహర్షులందరూ అభినందనలతో ఆమెను ఖ్యాంచె త్తారు—

“ఎక్కడో గాంధారదేశంలో పల్లె జనంలో పుట్టి, పుష్కలావతీ నగరంలో సంపన్నుల ఇళ్ళలో దాస్యం చేసుకుంటున్న సరమ తన సౌకుమార్యంతో మహానగరుని ఆకర్షించి,తన సాహసంతో జిగీషిని ఎదిరించి, తన మేధాశక్తితో పణులను వధించి— చరిత్రలో చిరస్థాయిగా నిలిచి పోయింది. ఇది ఆమెకు గెలుపేకాదు- మానవ చరిత్ర గమనంలో ఒక గొప్ప మలుపు.... దేవతలయిన ఆర్యులకు ఇంక పణులవంటి రాక్షసుల పీడ వుండదు.... సముద్రమథనాన్ని అందరూయథేచ్ఛగా జరుపుకోవచ్చు” అన్నాడు సౌభరి!

ఈ మహాసామ్రాజ్యానికి మహామంత్రిణి ఆసుర సేని- రాణీ సరమా దేవిని సత్కరించి ఆదరంగా ఆలింగనం చేసుకొంది-

కరతాళ ధ్వనులతో రాజ్యసభ సరమను అభినందించి ఆశీర్వ దించింది.

రాణీ సరమాదేవి తనను సన్మానించిన మహాసభను గౌరవంగా సంబోధించింది. మహామంత్రిణికి నమస్కరించింది.

“మహనీయులారా! నేను చేసింది మహా నగరుని ఆజ్ఞను పాటిం చడం మాత్రమే! వారు పన్నిన వ్యూహంలోనే నేను నడిచాను. ఈ ఘనత ఆ మహనీయునిదే!

నిజానికి ఆ పణులను జయించడంకోసం చేసింది కాదు ఇంత ఆలోచన.... చాలాకాలం మరుగున పడిపోయిన ఒక విషయాన్ని వెలికి తీయడంకోసం మాత్రమే నన్ను పంపడం జరిగింది.

హైహాయ వంశంలో పేదపురుగు “త్వష్ట” ఇంకా బతికే ఉన్నాడు! ఇంద్రుడు ప్రసాదించిన నీటిని బంధించి, నదులు పంటపొలాలలోకి పోకుండా నిరోధిస్తున్న వృత్రాసురుడు ఆ త్వష్టే!

ఆనాడు, జిగీషి వధకోసం త్వష్టని దూరంగా పంపేఎత్తువేయవలసి వచ్చింది. అప్పటిలో అదొక రాజకీయ వన్నాగం- అయితే, ఆ పన్నాగం లోంచి త్వష్టఒక్కడే తప్పించుకున్నాడు- మిగిలిన అతని సైన్యాన్నంతటినీ ప్రభువులవారు లోబరుచుకోగలిగారు.

విశ్వకళ్యాణంకోసం మహా సగరులు ఎన్ని చర్యలు తీసుకున్నా, ఎక్కడో ఒకచోట ఈ త్వష్ట- రహస్యంగా చేరి ఏదో ఒక అరాచకం సృష్టిస్తూనే వున్నాడు- నిన్నటి వణిజ ఘోరకృత్యానికి కూడా కారకుడు వాడే!

వాణ్ణి బంధించడం కోసమే ఇంత శ్రమ తీసుకోవలసి వచ్చింది. కానీ, వాడు దొరకలేదు. మహాసగరుని మాట చెల్లించలేకపోయిన అశక్తు రాల్ని నేనే! నా చేతకానితనానికి సిగ్గుపడుతున్నాను.

ఈ మహాసభ నాపట్ల ఎంతో అభిమానాన్ని ప్రదర్శించింది- కానీ, ఆ అభిమానాన్ని చూరగొనే అర్హతలేనివాన్ని! నన్ను క్షమించండి- ఈ సన్మానాన్ని నేను అంగీకరించలేకపోతున్నాను.

ఆ దుష్ట త్వష్ట కిరాతకుణ్ని పట్టి బంధించనిదే నేను ఏ గౌరవాన్ని పొందలేను- నన్ను మన్నించండి-" అంటూ కూలబడి వెక్కివెక్కి ఏడ్చింది సరమ!

అప్సర ఆత్మీయంగా,ఆమెను లేవనెత్తి నుదుటచుంబించింది."ఆమె పట్ల తన వాత్సల్యాన్ని అలా ప్రదర్శించింది అప్సర.

ఇంతలో వార్తాహరుడు ఆమెను సమీపించి ఇంద్రమాత అనే తాపసి ఎవరో తమ దర్శనార్థం వచ్చినట్లూ-ఏకాంతంగా తనతోమాత్రమే మాట్లాడ గోర్తున్నట్లూ విన్నవించాడు.

మహర్షుల రాక తమకొక ఘనతగా భావించుకునే అప్సరకు 'తపసి ఇంద్రమాత' రాక నిజంగా గర్వకారణం!!

వెంటనే ఆమెకు స్వాగత సత్కారాలను నిర్వహించవలసిందిగా ఆ వార్తాహరుని ఆదేశించింది అప్సర.

ఇంద్రమాత రాకను తెలుసుకుని సగరుడు ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు.

అతని మనసేదో కీడు శంకిస్తోంది....

ఆయన ముఖంలో మార్పుల్ని పసిగట్టింది అప్సర— ఎందుకిలా అయిపోయాడాయన....???

తన అంతరాంతరాలలో, తనకు తెలియకుండానే చెలరేగుతున్న కల్లోలాన్ని 'ఇందుకు....' అని చెప్పలేక పోయాడు మహాసగరుడు—

జరగనున్నది జరగక మానదు—

కాలచక్రాన్ని వెనక్కి తిప్పాలని ప్రయత్నించే మూఢుడు కాదు సగరుడు!!

* * *

రాచమార్గంలో నలుగురూ నడిచేదారి....

వెర్రెత్తి అరుస్తూ చిందులు తొక్కుతున్నాడు అసమంజసుడు!

భల్లూకంలాంటి తన ఆకారాన్ని భయంకరంగా ప్రదర్శిస్తూ— ఒంటి మీద దుస్తుల్ని చింపుకుని—పిచ్చికేకలు పెడుతున్నాడు.

"నాతో యుద్ధానికి వచ్చేదెవడ్రా....? నన్ను గెలవగల వాడెవడ్రా....??" అంటూ దారినపోయే వాళ్ళను పట్టి పిడి గుద్దులిస్తూ బాధించ సాగాడు.

ముంజేతిని ముడిచి, పొంగిన కండల్ని ప్రదర్శిస్తూ "చూడండ్రా.... నా బలం....!"అని వికటాట్టహాసం చేయసాగాడు. సింహాల దండు అడవి లోంచి పారిపోయి వచ్చి జనవాసాలమీద పడ్తోందేమో.... అన్నంత భయంకరంగా వుంది ఆ నవ్వు!

అతని ఈ ఉన్మాదావస్థని చూసి ముక్కున వేలేసు కొంటున్నారు జనం.

"ఈ మహా సామ్రాజ్యానికి కాబోయే యువరాజు....!! ఎవరైనా మంచో మాకో పెట్టి పాడు చెయ్యలేదు కదా....!!"

అసమంజసుడి చేతిలోచిక్కి వెన్ను విరిగి నేలకూలుతున్నారు అతనికి దొరికిన అమాయక ప్రజలు!

అతనా.... యువరాజు! ఎదిరించడానికి ఎవరు ధైర్యంచేయగలరు? ఎవరు మందలించగలరు?? అతని ఎదురు పడకుండా జనం తప్పుకొని తిరుగుతున్నారని వెంటపడి పట్టుకొని విరగ తంతున్నాడు మనుషుల్ని.

"ఈ పిచ్చివాడి బారినుండి రక్షించే వారే లేరా....??

ఇంతలో ఎక్కడినించి వచ్చిందో ఏనుగంత ఎనుబోతు.... అది అసమంజసుని కన్నా వెర్రెత్తిన దానిలా వుంది! ముట్టి మోకాళ్ళ దాకా వంచి, కొమ్ముల్ని సూటిగా అతని గుండెలకు గురి చూసి దూసుకు రాసా గింది....

దాన్ని చూస్తూనే రెచ్చిపోయాడు అసమంజసుడు.

భయంకరంగా సింహ గర్జనచేసి,దాన్ని ఎదుర్కోవడానికి ముందుకు దూకాడు. ఇద్దరి మధ్యా భీకర పోరాటం జరుగుతోంది—

బలాన్నంతా కూడదీసుకొని, ఎనుబోతును అమాంతం గాలిలోకి ఎత్తి గిరగిరా తిప్పి విసిరేశాడు. ఎనుబోతు అంత వేగంగానూ లేచి నిల్చొని గిర్రున వెనక్కి తిరిగి అసమంజుని మీదపడి కొమ్ములతో ఎత్తి అవతలకు విసిరేసిందతన్ని. బొక్కబోర్లా నేలకు కరుచుకు పోయాడు అసమంజసుడు—

క్షణకాలంలో ఏర్పడిన ఈ హఠాత్పరిణామానికి జనం విల విల లాడి పోయారు. ఎవ్వరూ సాహసించి ఆ ఎనుబోతును అదిలించి అస మంజసుని రక్షించేందుకు ముందుకు రాలేక పోతున్నారు. అటు వెడితే ఎను బోతుతో చావు.... ఇటు వస్తే అసమంజసునితో చావు.... అకారణంగా చావడానికి ఎవరూ సిద్ధంగా లేరు!!

"ఎవడో ముష్కరుడు ఆ ఎనుబోతు వృషణాలను గాయపరచి దానిని యువరాజు మీదకు వదిలి వుంటాడు...." అని ఒకడు వ్యాఖ్యా నించాడు—

"అసమంజసుడే దాన్ని గాయపరిచి వచ్చాడని నా అనుమానం.... అది పగబట్టి అతని వెనకే రాచ వీధిలోకి వచ్చింది...." అన్నా డింకొకడు—

"రాచనగరుకు కావలి ఉండే భటులు ఏమయ్యారు?.... ఈ ఎను బోతు వాళ్ళ కళ్ళు కప్పి అడవిలోంచి నగరంలోకి ఎలా రాగల్గిందీ...?" అని అడుగుతున్నారు మరి కొందరు—

"ఎంతైనా పులిబిడ్డ పులిబిడ్డే... ఆ ఎనుబోతు రెండు కొమ్ముల్నీ విరిచేసి గాలిలోకి విసిరేశాడు యువరాజు! అది కళ్ళు బైర్లు క్రమ్మి నేల మీదపడి ఎలా రొప్పుతోందో... చూడుచూడు..." అంటూ చప్పట్లు చరిచాడు ఉత్సాహంగా ఓ ప్రేక్షకుడు!

"అరరే! యువరాజుల వారు అలా వెనక్కి తిరిగారో లేదో ... ఎనుబోతు చటుక్కున లేచి వెనకనించి ఆయన మీదకుదూకింది... అయినా క్రీగంట దానినడకను గమనిస్తూనే ఉన్నాడాయన... చటుక్కున భలే తప్పు కున్నాడు—అది ఊపు ఆపుకోలేక ముందుకి తూలిపడింది... భలే! భలే!" ఇంకో పౌరుడు ఉత్సాహంగా ఈలవేశాడు—

అది చూసి మరీ రెచ్చిపోయాడు— అసమంజసుడు!

"దెబ్బతిన్న కొద్దీ అది రెచ్చిపోతోందే..."

"అయ్యో! ఈ పోరాటం ఆగేలా లేదు! అసమంజ యువరాజు అలిసిపోతున్నాడు—" ఆందోళన చెందసాగారు ప్రజలు—

పోరాటం భీకరంగా సాగుతోంది-ఆకాశానికి తూట్లు పొడుస్తున్నట్లు అరుస్తోంది ఎనుబోతు! సింహగర్జనచేసి దానిమీదకు లంఘిస్తున్నాడు యువరాజు-

దాని రెండు కొమ్ములూ సగానికి విరిగి, శూలాల్లా పేళ్ళు బారి నెత్తు రోడుతున్నాయి.

వాటిని పట్టుకొని దాని తల వెనక్కి విరుస్తున్నాడు అసమంజుడు.

అతని చేతులు రక్తసిక్తమైనాయి. ఒళ్ళంతా గాయాలు. శక్తి నశించి పోతోందీ.... అయినా అంత కంటే మొండిగా, విస్తారమైన దాని మెడని పట్టి కావులించుకుని పీక నొక్కసాగాడు.

అది తన తలను వెనక్కి విదిలించి, విరిగిన కొమ్ములతో అస మంజుని వెన్నులో పొడుస్తోంది.

అతి భీకరమైన ఆ దృశ్యాన్ని చూసి కకావికలై పోతున్నారు ఆడవాళ్ళు.

నాలుగు కాళ్ళతో గాల్లోకి గుర్రంలా ఎగిరి, మీదకు దూకుతోంది ఎనుబోతు. దాని డొక్కల్లో ఎగిరితన్ని విసిరికొడుతున్నాడు అసమంజుడు.

దానిది రంకెలేస్తున్న వేగం

అతనిది ఉరకలేస్తున్న మదం!!

ఆ యముని మహిషపు పాదఘాతాలకు అతని ఉక్కు శరీరం కాబట్టి తట్టుకొంది. బలిసిన మహాజంతువు కాబట్టి అతని పిడిగుద్దుల పీడనానికి అది స్థిరంగా నిలబడింది.

ఇద్దరికీ గెలుపు లేదు—

ఇద్దరికీ ఓటమిలేదు.

ఇద్దరూ అలిసిపోయారు. కానీ, ఇద్దరికీ కాలు ఆగే పరిస్థితి లేదు.

తుదీ మొదలూ తెలియని రీతిలో సాగుతున్న ఈ పోరాటానికి ముగింపు పలుకుతూ రివ్వున వచ్చి ఓ పిడిబాకు ఎనుబోతు కంఠంలో దిగబడింది.

ధారాపాతంగా నెత్తురు కారిపోతోంటే, నిస్త్రాణమై, మహా మేరువులా అది వెనక్కి విరుచుకు పడిపోయింది!

"అసమంజా!" అంటూ పెద్దగా అరిచి, తన గుండెలకు హత్తుకుని, అతని నుదుట ఆత్మీయంగా చుంబించింది యోజిత!

"నా ప్రాణాలు కాపాడావా అమ్మా!" అంటూ కృతజ్ఞతగా చూశాడు తన పిన తల్లి వంక అసమంజు.

"నువ్వు నా ప్రాణం కన్నా ఎక్కువ నాకు!" అంది మాతృ వాత్సల్యంతో యోజిత!!

* * *

మహామంత్రిణి అసురసేని దివ్యమందిరం-

సగర దంపతుల స్వాగత సత్కారాలందుకొని - సముచిత గౌరవాలను స్వీకరించి వేయేళ్ళ ఆయుష్షును ఆశీర్వదించింది తాపసి ఇంద్రమాత!

ఈ మహాసామ్రాజ్య వైభోగంలో, ఈ అనంత ఐశ్వర్య సౌధంలో ఈ మహామంత్రిణి ఆదర్శ దాంపత్యంలో తన రాక రగల్చనున్న చిచ్చు ఎంత తీవ్రంగా ఉంటుందోనని కలవరపడ్తున్నదామె.

ఆ మహా ఇల్లాలిపట్ల తాను ఎంత నిర్దయగా ప్రవర్తించినా, ఆమె గౌరవ మర్యాదల విషయంలో ఎటువంటి లోపమూ చేయలేదు-అత్యంత ముఖ్యులకు తప్ప వేరెవరికీ ప్రవేశంలేని దివ్యమందిరంలో తనకు విడిది ఏర్పాటుచేసింది. తానక్కడ విడిదిచేసినంతకాలం ఎటువంటి అసౌకర్యమూ జరక్కుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లనుచేసింది!

తనకోసం ప్రత్యేకంగా ఏర్పరచిన సుతిమెత్తని శయ్యమీద కూర్చుని ఇంద్రమాత వంటరిగా తనలోతానే ఆలోచించుకొంటోంది....

తనవంటి తాపసులకు ఇలాంటివి తగునా ? సమస్త సుఖభోగాలనూ త్యాగంచేసి అకుంఠిత దీక్షతో తపోశక్తిని సాధించుకొంటూ ముని వాటికలలో కాలం గడుపుతోంది ఇందుకేనా....ఇలాంటి నీచకృత్యాలలో పాలుపంచుకోవడం తనవంటి తాపసులకు ధర్మసమ్మతమేనా....?

తను చేస్తోన్న తప్పేమిటో ఆమెకూ తెలుసు....కానీ, తప్పని పరిస్థితి....

తననిక్కడకు దూతగా పంపినవాడు కుమార బ్రహ్మర్షి ....భగవాన్ ఆత్రేయులవారి కుమారుడు....రెండు దశాబ్దాలపాటు అహరహం శ్రమించి నిద్రాహారాలు మాని-పట్టుదలతో బ్రహ్మర్షి పదవిని సాధించుకున్నాడు-

బ్రహ్మర్షి అయినవాడి ఆదేశాన్ని తనవంటి సాధారణ తాపసులు పాటించితీరాలి. రాజాజ్ఞ ధిక్కారంకన్న బ్రహ్మర్షి ఆజ్ఞాధిక్కారం ప్రాణ సంకటమైనది....

కానీ, కుమార బ్రహ్మర్షి పంపిన సందేశం పరమ నీచమైంది.... ఆ విషయాన్ని తన నోటితోనే చెప్పవలసిరావడంకన్నా మరణించడమే మేలు....!

ఎలా చెప్పగలిగిందో తాను-ఆ సాధ్వీమణి అసురసేనికి....అంతటి నైచ్యాన్ని నెరవేర్చమని....

చెప్పేయ్యడం అనే దుష్కార్యం పూర్తయింది....

కానీ, చెప్పినతర్వాత-ఇంక జరగనున్నదేమిటి....??

అక్కడికీ తానెంతో నచ్చచెప్పిచూసింది బ్రహ్మర్షి కి-ఉన్నత పదవి వలన సమకూరిన అధికారాలను దుర్వినియోగపరచడం మంచిదికాదనీ!

"నూరు బుక్కులు రాసి, శతర్చులైన బ్రహ్మర్షులకే ఎదురు చెప్తున్నావా....?" గద్దించాడు కుమారబ్రహ్మర్షి -

"కానీ, బ్రహ్మర్షీ....నీకన్నా వయసులో ఎంతో పెద్దదాన్ని నా వయసును గౌరవించైనా ఈ నీచ భావనని వదలిపెట్టు....తన అపారమేధా శక్తితో ప్రపంచదేశాలనే జయించి ఉన్నత విలువలను సాధిస్తున్న ఆమహా సాధ్వీమణిని కోరడం బ్రహ్మర్షి అయినవాడు చేయదగిన కార్యంకాదు....

నాయనా! పెద్దదాన్ని చెపుతున్నాను-నా మాట ఆలకించు. దయచేసి నీ కోరికను ఉపసంహరించు...." అంది ఇంద్రమాత!

"ఇంద్రమాతా... !" రౌద్రంగాఅరిచాడు కుమారబ్రహ్మర్షి -"చరిత్ర నీకేం తెలుసు? రాజపత్నుల్ని అనుభవించిన బ్రహ్మర్షుల వృత్తాంతాలు నీకు తెలియకపోతే తెలుసుకో....రాజరికంమీద బ్రహ్మర్షుల ఆధిపత్యం కొనసాగాలంటే రాజపత్నిని నేను పొందితీరాలి....ఇలాంటిది జరగకపోతే ముని వాటికలు మోడువారిపోతాయి-నీలాంటి తాపసుల్నీ, నావంటి మహా పండితుల్నీ పట్టించుకునేవాడు ఉండడు-అర్థం అయిందా....?

రాజపత్నుల్ని మునులు చేపట్టడం, మునిపత్నుల్నీ, మునిపుత్రికల్నీ రాజులు పొందడం....ఇదంతా ఎందుకనుకొంటున్నావు ...?

మహర్షి వ్యవస్థ అగ్రస్థానాన నిలిచివుండడానికే....రాజుని గుప్పిట ఉంచుకోవడానికే....!

అనవసర ఆలోచనలు చేయకుండా చెప్పిందిచేయి-"అని గద్దించాడు భగవాన్ అత్రేయుని పుత్రుడు కుమారబ్రహ్మర్షి,

ఇంద్రమాత మౌనం వహించింది. ఆమె కదలలేదు.

"పిచ్చితల్లీ....నేను చెప్పేది జాగ్రత్తగావిను.... అగస్త్యుని భార్య లోపాముద్ర ఎవరనుకున్నావ్....? రాజపత్ని!

బ్రహ్మర్షి బృహస్పతిభార్య తారని రాజైన చంద్రుడు పొందలేదా... తారాశశాంకం నీకు తెలియదా....? తారా చంద్రులకు పుట్టిన కొడుకు కోసం చంద్రుడూ, బృహస్పతీ యుద్ధానికి తలపడ్డారు....అది తెలుసా....?

అదలా వుంచు!చ్యవన మహర్షి కోల్పోయిన తన యవ్వనాన్ని రసాయన, వాజీకరణ చికిత్సలతో తిరిగి పొంది, సుఖించిన 'సుకన్య' ఎవ రనుకున్నావ్....? ఆమె రాచకన్య.

ఇవన్నీ తెలియక అజ్ఞానంతో నాతో వాదనకు దిగుతున్నావే-" అని మందలించాడు బ్రహ్మర్షి!

ఇంద్రమాత ఒక్కక్షణం ఆగి-

"మీ తండ్రిగారు భగవాన్ అత్రేయ మహర్షి మీ నిర్ణయాన్ని హర్షి స్తారా....?" అని అడిగింది-

అతను బిగ్గరగా నవ్వాడు

"ఈరోజు 'అప్సర' అసురసేనిగా ప్రధానమంత్రిత్వం నెరపుతూ వుండవచ్చుగాక....సంతోషమే! కానీ, నా దృష్టిలో ఆమె నా అప్సరయే!

నేను బ్రహ్మర్షినైన రోజున నన్ను పెళ్ళాడతానని మా తండ్రిగారికి ఆమె వాగ్దానంచేసింది. ఆ విషయాన్ని స్వయంగా ఆయనే నాకు చెప్పారు. ఆమెకోసమే నేను ఇంత కృషిచేసి బ్రహ్మర్షి నయాను-

ఇంక తనమాట నిలుపుకోవలసిన బాధ్యత ఆమెదే!

నిలుపుకొంటుందో-అసత్యదోషాన్ని అంటగట్టుకుంటుందో ఆమె ఇష్టం....నువ్వెళ్ళి ఆమె ధర్మాన్ని గుర్తుచేయి ...అంతే" అని ఆదేశించాడు.

కదలక తప్పలేదు ఇంద్రమాతకు!

పాపపుణ్యాల సంధ్యలోపడి నలిగిపోతోందామె!

ఒకవైపు బ్రహ్మర్షి ....మరొకవైపు జరగనున్న విపరీత,విపత్కర పరిణామం....

అసురసేని దివ్యమందిరంలో ఏకాంతంలో కూర్చొని, జరిగిం దంతా తలచుకొంటూ కన్నీరు-మున్నీరుగా విలపిస్తోంది ఇంద్రమాత!

ఈ పాపకార్యంలో తనపాత్ర కేవలం నిమిత్తమాత్రం-ఈ దోషం తనకు అంటకుండుగాక!

ఇది ఇలావుండగా-

క్షణాలలో ఇంద్రమాత తెచ్చిన సందేశం విషయం అంతఃపురం అంతా వ్యాపించింది-

ఆగ్రహోదగ్రులై నారు అంతఃపురవాసులు-

మహారాణీ దివ్యమందిరంలోకి చొచ్చుకుపోయి ఆ ఇంద్రమాతని సీకసులిమి చంపెయ్యాలన్నంత కోపంగావున్నారు. ఒక్కొక్కరూ!

లోనికిపోవడానికి అనుమతి లేక ఎక్కడివాళ్ళక్కడే ఆగిపోయారు.

ఇలాంటిది జరుగుతుందనే కాబోలు ఆమె సమీపానికి ఎవ్వరినీ పోనీయరాదని ఆదేశించింది ఆసురసేని!

ఇంతలో ఏనుగు బలంతో రొప్పుతూ, ద్వారపాలకులను వధించి ఇంద్రమాత మందిరంలోకి ప్రవేశించింది రాణీ సరమదేవి!

మందిరంలో ఆ తాపసిని చూస్తూనే భయంకరంగా కనుగుడ్లను పెద్దవిగాచేసి, పెద్ద పిశాచంలా ఆమెపైకి లంఘించింది సరమ.

ఆమె శరీరాన్ని చీల్చి, నెత్తురు పిండుకుని తాగేయాలన్నంత ఆవేశంలో ఉంది సరమ!

ఆమె కపాలాన్ని ఛేదించి, మెదడు ముద్దల్ని పెకలించి నంజుకు తినేలా జుట్టుపుచ్చుకుని ఆమెను ఓ స్తంభందగ్గరకు ఈడ్చుకెళ్ళి తలని గోడకేసి విసిరికొట్టసాగింది-

ఇంద్రమాత తలపగిలి నెత్తురోడుతోంది.

సరమ ఆగ్రహం చల్లారలేదు.

మహర్షిణిని నేలమీద పడేసి ఆమె గుండెలమీద ఎక్కి కూర్చుంది.

ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయిందామె! అయినా తన సహనాన్ని వీడలేదా తాపసి.

తానుచేసింది పాపకార్యం! అందుకు తనకు శిక్షపడాలి. సమర తనను శిక్షిస్తోంది. ఆనందంగా ఆ శిక్షను అనుభవిస్తోంది తాను!

సరమ కసి తీరలేదు-

అమాంతం ఆవిడ ముఖంమీదకు వంగి కనుగుడ్లను నలిపివేయ సాగింది. ఎంత శిక్షించినా ఇంద్రమాత ప్రతిఘటించలేదు. ఇంతకన్నా కఠిన శిక్షను అనుభవించడానికి సిద్ధంగా వుంది.

కసికొద్దీ ఇంకాగట్టిగా ఆమె కనుగుడ్లను చిదిమివేసింది సరమ నీలపురంగుద్రవం సరమముఖంమీద చిందింది-

సరిగ్గా అదే సమయానికి సరమ వీపుమీద మందపాటి ఏనుగు చర్మపు కొరడా ఛడేల్‌మని మ్రోగింది.

ఛడేల్....ఛడేల్....ఛడేల్‌మంటూ వీపు చీరిపోయేలా సరమని కొరడాతో బాదుతున్నాడు మహా సగరుడు.

అవును! సాక్షాత్తూ సగర చక్రవర్తే!

ఇటువంటి ప్రమాదం తప్పనిసరిగా జరుగుతుందని-ఇంద్రమాతకు వెంటనే రక్షణ కల్పించాలని పరుగున వచ్చాడు చక్రవర్తి.

కాని, ఆయన వచ్చేసరికే అంతా అయిపోయింది.

సగరుడు ఎంతబాదినా సరమ తన పట్టు విడువలేదు. భీకరమయిన పిడికిలితో మహర్షిణి పీక పట్టి నులిమివేయసాగింది.

ఛడేల్ ...ఛడేల్....ఛడేల్....

కొరడా దెబ్బలు ఆ సౌధాన్ని దద్దరిల్ల చేస్తూ, సరమ శరీరాన్ని తాకు తున్నాయి.

ఆడదానిని కొట్టడం రాజసంగాదని అతనికి తెలుసు. కాని, మరొక వృద్ధ స్త్రీ ప్రాణరక్షణకు తాను చేయిచేసుకోక తప్పలేదు మహా సగరుడికి.

ఛడేల్....ఛడేల్....ఛడేల్

సరమ శరీరం ఆ కొరడా దెబ్బలకు చీరుకుపోయి కొరడా కొసలు ఎర్రగా మారాయి-

కొన ఊపిరిలో ఇంద్రమాత విలవిలలాడింది-

కసి తీరని సరమ తన పట్టు విడువలేదు.

ఛడేల్...ఛడేల్...మంటున్నాయి కొరడా దెబ్బలు.

ఇంద్రమాత ఆఖరి క్షణాలలో కొట్టుమిట్టాడుతోంది.

బలమైన గాయాలతో సరమ కూడా కొనఊపిరిని ఉగ్గబట్టుకుంది.

కాని, కసి తీరలేదు.

"ఈ మహా సామ్రాజ్యానికి....ఇంద్రమాతచేసినద్రోహం.... అసామాన్యమైనది. ఆమెకు ఈ శిక్ష సరిపోదు. నిలువునా కోరత వెయ్యాలి. గాయాలమీద కటురసంపోయాలి... ఆమె భీకరంగా అరిచి చావాలి—" అనుకొంటూ ఆ తాపసి కంఠాన్ని బలంగా నొక్కిపట్టింది సరమ.

ఫడేల్... ఫడేల్... ఫడేల్...

మహర్షి వ్యవస్థకు రాచరికం కన్నా ఉన్నతస్థానం ఇచ్చి గౌరవించిన ఆ మహా సగరుడి సమక్షంలో- ఆయన ఇంటనే ఒక తాపసిపై అఘాయిత్యం ....భరించలేకపోయాడు సగర చక్రవర్తి!

తన రెండు పిడికిళ్ళూ బిగించి... మహర్షిణిని వదిలిపెట్టమని ఆజ్ఞాపిస్తూ సరమ వెన్నుమీద బలంగా మోదాడు.

ఆ చావుదెబ్బకి కెవ్వున అరిచింది సరమ! ఒక్కక్షణం ఊపిరి ఆగినట్లే అనిపించింది. అయినా పట్టు విడువలేదు.

గుడ్లు తేలవేస్తోంది ఇంద్రమాత.

ఇంకొక లిప్తకాలం ఆలస్యం చేసినా ఆమె బ్రతకదు-

అఘాయిత్యానికి తలపడింది... తన ముద్దులరాణి. అఘాయిత్యానికి బలి అయ్యింది తాపసి ఇంద్రమాత!

తన బాహుబంధంలో కరిగిపోయి పరవశించిన రసవాయిని సరమ ఒకవైపు!

ధర్మరక్షణ వేరొకవైపు!!

ధర్మాన్నే రక్షించాలని నిర్ణయించుకున్నాడు మహా సగరుడు.

ఒరలోంచి కత్తిదూశాడు... ఒక్కవేటు... సరమ రెండుచేతులూ తెగి ఇంద్రమాత మెడను పట్టుకు వ్రేలాడాయి!

అమావాస్యనాటి మహా సాగర తరంగంలా ఉవ్వెత్తునలేచి సగరుని చేతులలోకి వాలిపోయింది సరమ. నెత్తురు మడుగులోపడి ప్రాణాలు విడిచింది తపస్విని!

శూన్యంలోకి చూస్తూ, అవాక్కయి స్తంభించిపోయాడు సగరుడు.

* * *

తెల్లవారింది.

రాజసౌధం వెలవెలపోతోంది.

మహాసగరుని పట్టమహిషి... ఈ అనంత భరత సామ్రాజ్యానికి ప్రధానమంత్రిణి...విమర్శిమణి...అయ్యార సేని ఋషిత్వాన్ని స్వీకరించి- రాజ్య పరిత్యాగంచేసి, అరణ్యవాసానికి వెళ్ళిపోతోందన్న వార్త పిడుగుపాటులా తాకింది.

రాచనగరిలో జనం ఘోరుఘోరున ఏడుస్తూ రాజసౌధం వైపు పరుగులు తీస్తున్నారు.

తమ కన్నతల్లి ... తమ ఏలిక... తమ కన్నీటిని తుడిచి, తమకష్టాలను ఈడేర్చి తమ దారిద్ర్యాన్ని పరిమార్చి తమను మనుషులుగా తీర్చి దిద్దిన మహామాత. . అసుర సేని- ఇంక తమకు లేదన్న ఆలోచనే భయంకరంగా కన్పించింది వాళ్ళకి—

ఎవర్ని చూసినా ఒకటే ఏడుపు-

అంతటా విషాదం-

అసుర సేని ఈ అకస్మాత్ నిర్ణయానికి తట్టుకోలేకపోతున్నారు జనం!

రాజధానీ నగరంలో ఎక్కడా కళాకాంతులులేవు—

పంటల పండుగ సంబరాలులేవు-

ఏ యింటిలోనూ పొయ్యి రాజుకోలేదు- ఏ కడుపులోనూ ఆకలి మేలుకోలేదు-

నిజంగా ఇంద్రుడనే వాడున్నాడా...? ఉంటే మహాసగరుడికి ఇన్ని క్లేశాలు కలిగిస్తాడా..?

మహాసగరుడు ఎవరికి ఏం ద్రోహం చేశాడని ఆయనకి శిక్ష?

నివురుగప్పిన నిప్పులా అణిగి ఉన్న శత్రుకోటి— ఇప్పుడీ దుస్థితిని సాకుగా తీసుకుని ఒక్కసారిగా విజృంభించదా...?

మళ్ళీ కష్టాలు మామూలేనా?

త్వష్టుడో .. భ్రాష్టుడో అధికారంలోకి వస్తే మళ్ళీ యుద్ధభయాలూ, బానిసత్వమూ, దోపిడీ...

"హే భగవాన్! ఈ భయంకర పరిణామాన్ని ఎదుర్కొనే మనో ధైర్యాన్ని మా ప్రభువుకు ప్రసాదించు!

ఓ ఇంద్రుడా! ఓ అగ్నీ! ఓ వరుణుడా! మా ప్రభువును రక్షించు... మా ప్రజలను రక్షించు...మా కన్నతల్లి అసురసేనిని రక్షించు... ఆమెను మళ్ళీ మా పాలకురాలిగా పంపించు... ఆమె లేనిదే మేం బ్రతకలేం..." అని ప్రార్థిస్తున్నారు జనం!

అందరూ చూస్తూండగానే తెల్లటి తెరలు కట్టినరథం రాజసౌధాన్ని వీడి, రాచమార్గాన ముందుకు నడుస్తోంది.

రథంవెంట భోరున ఏడుస్తూ పరుగులు తీస్తున్నారు జనం. "ఇంకా ఈ ప్రపంచాన్ని ఎరగని యువరాజులిద్దరినీ వదిలి, ప్రాణానికి ప్రాణమైన మహాచక్రవర్తిని వదిలి... కన్నతల్లి కన్నా ఎక్కువగా గౌరవించే ఈ దీన జనాన్ని వదిలి... ఎందుకు వెళ్ళిపోతున్నావమ్మా...?

"ఈ అమాయక ప్రజలు తెలియక నీ పట్ల ఏదైనా అపచారంచేసి ఉంటే వారిని మన్నించి నీ యాత్ర ఆపుతల్లీ ...."

"నువు సాధించిన ఈ మహా సామ్రాజ్యాన్ని నువ్వే కాలదన్ని వెళ్ళిపోతావా తల్లీ .... నువ్వు పోసిన నారుని నీ చేతులతోనే కత్తుకబట్టి కోసివేస్తావా అమ్మా....?"

జనం కకావికలై పోతున్నారు.

వేగంగా కదుల్తున్న తెల్లతెరల రథంవెనక పరుగులు తీస్తున్నారు. రథం ఆగలేదు.

రథంకన్నా వేగంగా పరిగెత్తి ఎదురువెళ్ళి నిలబడి.... ముందుకు కదలడానికి వీలులేదని నిలదీశారు జనం.

రథం ఆగిపోయింది.

"మహామంత్రిణి మమ్మల్ని వదిలి ఎందుకు వెళ్ళిపోతోంది?.... మా కన్నతల్లి మాక్కావాలి....! మా అమ్మ మాతోనే ఉండాలి!.... ఓరథ

సారథీ.... రథాన్ని ఆపవయ్యా! తల్లీ బిడ్డల్ని వేరుచేసే అధికారం నీకెవడిచ్చాడు....?

మా మాతృమూర్తిని ఎక్కడికి తీసుకుపోతున్నావు....??

తల్లీ! వెళ్ళకు.... ఆగిపో.... మా మొర ఆలకించు అమ్మా" అని బిగ్గరగా రోదిస్తూ రథానికి అడ్డంగా నిలబడ్డారు జనం-

తెరలు తొలగించుకుని, సాధ్వీమతల్లి అసురసేని రథం వెలుపలికి వచ్చింది.

తన ప్రజల కన్నీటి సముద్రాన్ని కళ్ళారా చూసింది.

జరుగుతున్న ఘోరానికి తాను సాక్షిని కాలేనని సూర్యుడు పూర్తిగా ఉదయించకుండా ముఖం చాటేసుకుంటున్నాడు.

బ్రహ్మజ్ఞానం పొందినంతమాత్రాన మహర్షులంతా పవిత్రులు కాలేనట్లు, కరుణరసాత్మకమైన కావ్యంలో సైతం కాఠిన్యాలున్నట్లు ఆహ్లాదకరమైన సమశీతల కాలంలో వడగాడ్పులు వీచినట్లు, పాలకుండలో విషపు బిందువులు వొలికినాయి—

రాజ ప్రతినిధులూ, రాజలాంఛనాలూ ఏమీ లేకుండా, వంటరిగా-తాపసి రూపంలో అసురసేని తన ప్రజలకు దర్శనం ఇచ్చింది....

"నా ప్రియమైన ప్రజలారా.... కాలం ఒకలా ఎప్పుడూ ఉండదు. ఋతు భేదాలున్నట్లే జీవితంలోనూ ఎడారులుంటాయి. ఋతు వైపరీత్యాలున్నట్లే జీవితంలోనూ అకాల వర్షాలుంటాయి. అన్నింటినీ సమానంగా మనం ఎదుర్కోవాలి.

నా ఈ వానప్రస్థ నిర్ణయం నా వ్యక్తిగత కారణాలవలన నేను తీసుకున్నదే! ఇది ఏ ఒక్కరి వలనా జరిగిందికాదు!

నేనెప్పుడూ ప్రజల మనిషినే.

మీ అందరి హృదయాలలోనూ ఇంత అభిమాన పాత్రమైన స్థానాన్ని సంపాదించుకో గలిగాను. నాకింకేం కావాలి....?

రాజవాసాన్ని వదిలినంత మాత్రాన నేను మీ అందరికీ దూరమై పోయానని మీరెందుకనుకొంటున్నారు?

నేను ఈ లౌకిక జీవితంలోంచి వేరవుతున్నానేగాని, ప్రజలనుంచి వేరు కావడంలేదని సవినయంగా మనవిచేసుకుంటున్నాను-

ఈ దేశానికీ, ఈ ప్రజలకూ, ఈ ప్రభుత్వానికి ఏదైనా ఘోరమైన విపత్తు ఏర్పడితే నేను తప్పక తిరిగి వస్తానని మీకు వాగ్దానం చేస్తున్నాను-

దయచేసి దారి విడవండి...." అంటూ రివ్వున వెనక్కి తిరిగి తెరలలోపలికి పోయి వెక్కి వెక్కి ఏడ్చింది అప్సర.

కంటికీ మింటికీ ఏకధారగా వగపిస్తూ జనం దారి వదిలారు.

బండి సాగిపోయింది!

కుమార బ్రహ్మర్షి కోర్కెను తిరస్కరించినందువలన ధర్మ వ్యతిక్రమణ దోషం సోకకుండా ఉండేందుకు తాను ఋషిధర్మాన్ని పాటిస్తూ తాపసిలా వానప్రస్థానికి చేరడం ఒక్కటే శరణ్యం అనుకొంది అప్సర!

ఆమె నిర్ణయాన్ని కాదనలేక పోయాడు మహాసగరుడు!

మహాసాగరాన్ని తన గుండెలలో నిక్షిప్తం చేసుకొని, సగరుడు కన్నీటి కెరటాలలో కూరుకుపోతూనే ఆమెకు వీడ్కోలు చెప్పాడు-

* * *

శాంతి పావురాళ్ళను కాల్చుకు తింటోంది కాలం!

శ్వేత పూతను పుక్కిలించి, కోకిల కూతని వెక్కిరించి, అవహేళనగా నవ్వింది శోకం-

కామధేనువు కొమ్ము తగిలిందో.... కల్పవృక్షమే మొగ్గలు రాల్చుకుందో.... కంకి తెగిన ధాన్యపు మొక్కలా వాడిపోయింది దేశం.

భగవాన్ ఆత్రేయుడు తన కన్నీరు తుడుచుకుంటూ, మహాసగరుని ఓదార్చాలని ప్రయత్నించి, అందుకు మాటలు చాలక, అశక్తంగా నేలమీద కూలబడ్డాడు.

ఆయనను లేవనెత్తి వేరే ఆసనంపైన ఆశీనుని చేశాడు బుధమహర్షి! ఆత్రేయుడు ఆయన వంక విరాగంగా చూశాడు.

"ప్రియ మిత్రమా! మహాసగరుని ప్రేమాభిమానాలు చూరగొన్న మీరంతా ధన్యులయ్యా.... నేనే ఆ అదృష్టానికి నోచుకోని వాణ్ణి. పవిత్ర

మూర్తులు పుట్టిన ఇక్ష్వాకు వంశంలో చిచ్చు రగిల్చి, నా పుత్రుడు తర తరాల అపకీర్తిని నాకు సమకూర్చిపెట్టాడు.... మహా సగరునికి నన్ను దూరం చేశాడయ్యా...." అంటూ కన్నీరు మున్నీరు అయ్యాడు ఆత్రేయుడు.

అచేతనంగా నిలబడి ఉన్నాడు సగరుడు.

ఆయన గుండె కోతని అర్థంచేసుకునేవారే లేరు!

తననొక వ్యక్తిగా తీర్చిదిద్దిన తన అప్సర ధర్మసంస్థాపనార్థం వాన ప్రస్థానానికి వెళ్ళిపోయింది!

తన ఆశాలతకు పాదులుతీసి, పోషణచేసి పూలు పూయించిన తన ఇష్ట సఖి- సరమ- తన చేతులలోనే వాలిపోయింది....

తన రాజ్య కాంత వెల వెల బోతున్నట్లనిపించింది మహాసగరునికి

అయినా తమాయించుకొంటున్నాడు-

స్థితప్రజ్ఞుడయిన ఆత్రేయుడు మాత్రం తనను తాను ఓదార్చుకోలేక పోతున్నాడు. ఎంతటి కష్టం తన కొచ్చినా చలించేవాడు కాడు. ఆయన!

కానీ, ఈ దుస్థితి తన పుత్రుడివలన వచ్చింది.... తన పుత్రుడు అలా ప్రవర్తించడానికి పరోక్షంగా కారకుడు తానే! అప్సరను తన కోడలిని చేసుకోవాలనే అత్యాశకు తను పోకుండా వుంటే ఇది దాపురించేది కాదు గదా....!

కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు ఆత్రేయుడు!

భగవాన్ ఆత్రేయా! శాంతించండి! ఇందులో మీ ఎవరిదోషమూ లేదు. దోషమంతా నాదే...." అన్నాడు బుధమహర్షి.

ఆశ్చర్యంగా చూశారు ఆ మాటకు సగరుడూ, ఆత్రేయుడూ.

"అవును మహాత్మా! దోషంనాది!! ఒకనాడు చిరంజీవి సౌభాగ్యవతి అప్సరకు మానవేతిహాసంగురించి బోధిస్తూ, యాదాలాపంగా అనాగరకుడైన వాడిని సంస్కరిస్తే, నాగరకతను నిలబెడతాడు-" అని ఆమెతో అన్నాను.

నా మాటలను ఆమె హృదయానికి పట్టించుకొంది.

వెంటనే ఆమె లేచి నిల్చుని, "అనాగరికుని పెళ్ళాడి అతనిని జగజ్జేతను చేస్తాను-" అని భీషణ ప్రతిజ్ఞ చేసింది.

ఆమె అలా శపథంచేసిన మర్నాడే తమరు వివాహ ప్రసక్తి తెచ్చారు. అప్సర వేలగా నావంకచూసి, తనని ఈ గండంనుంచి రక్షించమని ప్రార్థించింది.

చేసేదిలేక, బ్రహ్మర్షినే పెళ్ళాడాలని ఆమె అనుకొంటున్నట్లు ఒకమాట అడ్డువేశాను....

ఆ పాపం నాదీ....

మహాసగరా...,. ఈ కల్లోలానికి ప్రత్యక్ష కారకుడను నేను. నన్ను శిక్షించు. నా చేతులనేకాదు.... నా శిరస్సునుకూడా నరికివేయి...." అంటూ దుఃఖభాజనుడై సగరుని కావులించుకుని భోరుమన్నాడు బుధుడు.

మహర్షులిద్దరినీ మహా సగరుడే ఓదార్చాడు.

"మహనీయులారా! నా ప్రియ సఖి శ్రేయస్సుకోసం, ఈ సగరుని అభ్యున్నతికోసం, ఈ మహాసామ్రాజ్య నిర్మాణంకోసం మీరు ఎంత శ్రమించారో నాకు తెలుసు!

ఇక్ష్వాకు వంశం మీకు ఋణపడి ఉంది.

జరిగింది మరిచిపోయి, పరిపాలనపైన దృష్టి కేంద్రీకరించండి.... చక్రవర్తి గృహ విషయాల ప్రభావం ప్రజాపాలనమీద ప్రసరించరాదు.... అన్నాడు సాగర గంభీరంగా మహాసగరుడు.

"నాయనా! సమ్రాట్ సగరా....!! ఇంత కల్లోల పూరిత మానసిక స్థితిలో కూడా ప్రజాక్షేమం గురించే ఆలోచించే నీ ఉన్నతి ముందు నేను తలవంచుకొంటున్నానయ్యా....

గౌరవాలలోకెల్లా ఉన్నతమైన "బ్రహ్మర్షి" గౌరవాన్ని ఇలా దుర్వినియోగ పరిచే నీచులకు తగిన దండన విధించనిదే నా హృదయ కీలలు చల్లారవు....

మహాసగరా! నాకున్న పెద్దరికాన్ని పురస్కరించుకుని ఆదుర్మార్గుడు అనుభవిస్తున్న బ్రహర్షి గౌరవాన్ని ఉపసంహరిస్తున్నాను...." అని ఉగ్రంగా చూసి, అంతలోనే దుఃఖితుడై పోయాడు అత్రేయుడు.

బుధమహర్షి ఆత్రేయులవారి గుండెలు నిమిరి, శాంతిల్ల చేశాడు.

"ప్రియ మిత్రమా.... కొడుకు చేసిన నేరంలో తండ్రికి భాగం ఉండదంటావా....! నా పుత్రుడిని శిక్షించి, నన్ను నేను క్షమించుకోవడం మహా నేరం....!! వాడికి తండ్రినైన నేరానికి నేనిదే పరిహారంగా ప్రకటిస్తున్నాను....

అన్ని లౌకిక వ్యాపకాలూ వదిలి, దేవతలైన పూర్వఋషులు తరతరాలుగా సంరక్షించుతూ వచ్చిన ఋక్కుల్ని సేకరించి, 'ఋక్సంహిత'ను నిర్మించే కార్యం దాదాపు పూర్తి చేస్తూ ఉండగా ఈ అకార్యం జరిగి పోయింది....

దుష్టపుత్రుడి తండ్రిగా— ఇంక ఈ రోజునుంచీ, ఋక్సంహితా నిర్మాణ పవిత్ర కార్యాన్ని కొనసాగించలేని అశక్తుణ్ణి....

ఋక్మంత్ర పఠనం నుంచి నన్ను నేను అయోగ్యుడుగా ప్రకటించు కొంటున్నాను...." అన్నాడు ఆత్రేయ మహర్షి!

పిడుగు పాటులా వెలువడిన ఆయన నిర్ణయాన్నివిని తల్లక్రిందులై పోయాడు బుధమహర్షి!

"భవిష్యత్తులో ఎవరో ఒక మహానుభావుడు—పుత్రుని వలన ఏ అపకీర్తినీ పొందనివాడు ... నేను వదలిన ఈ కార్యాన్ని పూరించకపోడు" అంటూ గుడ్ల నీరు కుక్కుకుంటూ వెనక్కి వాలిపోయాడు ఆత్రేయుడు.

తన ఆసనం మీద కుప్పకూలిపోయి స్తంభించి పోయిన ఆత్రేయుని స్పృశించాడు బుధమహర్షి! అప్పటికే ఆయన "స్వర్గ" ద్వారాలను తెరచుకుని ఇంద్రుని సన్నిధికి చేరిపోయారు!

రాగద్వేషాలకు అతీతమైన పార లౌకిక స్థితికిచేరుకున్న బుధమహర్షి కూడా ఆత్రేయులవారి పరలోక గమనంతో చలించి పోయాడు.

గుండెలమీద సమ్మెటపోటులా తగుల్తున్న ఈ సంఘటనల పరంపరలోంచి తేరుకునేందుకు అశక్తుడై సగరుడు తనలో తనే కుంచించుకు పోయాడు.

అన్నింటినీ మౌనంగా గమనిస్తూ, ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ అక్కడే నిలబడిన అసమంజసుని మీద ఆయన దృష్టి పడనే పడింది....

రానున్న విపత్తులు ఇంకెన్ని ఉన్నాయో అర్థం కాని స్థితిలో గుండె దిటవు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.... మహాసగరుడు!

సరిగ్గా ఇక్కడే చరిత్ర గమనంలో ఒక క్రొత్త మలుపునకు ప్రారంభం.... పొంచి వుంది....

గర్జించిన సింహంలా మునివాటికలపైన విరుచుకుపడ్డాడు అసమంజసుడు.

అగ్నిలో వేసిన ఆజ్యపు పవిత్ర సుగంధంతో విరాజిల్లే ఋషి వాటికలు ఒక్కసారిగా అల్లకల్లోల మైనాయి!

ఋక్మంత్రాలతో, సామగీతాలతో పరమ శ్రావ్యంగా పరమ పావనంగా విలసిల్లే ఋషి ఆశ్రమాలు మూగవోయాయి.

మహా క్షీరవారాశి అయిన ఋక్సారాన్ని శ్రద్ధాభక్తి సమన్విత ప్రజ్ఞా విశేషాలతో తరచి తరచి వివేకించి, విశ్లేషించే ఆ మహనీయుల పవిత్ర నిలయాలు రక్తసిక్తమైనాయి.

ఆదిత్యుని ఇంద్రుడిగా, మిత్రునిగా, వరుణునిగా, అగ్నిగా గరుత్మంతునిగా, యమునిగా, మాతరిశ్వునిగా కీర్తించి,హవిస్సులర్పించే వేళ.... మునివాటికలమీద అగ్ని ప్రళయ తాండవం చేయసాగాడు.

ప్రాణభీతితో పరుగులిడుతున్నారు మునిపుంగవులు—

"ఓ గంగా, యమునా, సరస్వతీ, శతద్రు, పరుష్ణి నదులారా! అసిక్నీ నదితో కూడిన ఓ మరుద్వృధా! వితస్తా, సుషోమా నదులతో కూడిన ఓ ఆర్జికీయా....! మీరు మా మొర ఆలకించండి.... ఈ అగ్నిని చల్లార్చండి— అంటూ నదీమ తల్లులను ప్రార్థిస్తూ ప్రాణభీతితో పరుగులు తీస్తున్నారు ఋషులు!

అందిన ఋషిని అందినట్లు తన కరవాలానికి బలిచేస్తున్నాడు అస మంజుడు.

సామగానం చేసే ఋషి కోకిలలు పీకలు తెగి నేల కూలాయి....

ఋక్మంత్రాలు పఠించే ఋషి చిలుకలు రెక్కలు తెగి విలవిల లాడాయి....

వికటాట్టహాసం చేశాడు అసమంజసుడు. మునివాటిక విలవిలలాడి పోతోంది.

మహా సగరుడు మహర్షి వ్యవస్థను ఎంత గౌరవిస్తాడో అసమంజు నికి తెలుసు.కానీ,ఆ అలుసు తీసుకొని మహర్షులు చక్రవర్తిమీదే అధికారం చలాయించడాన్ని అంగీకరించలేక పోతున్నాడతను.

ఇంద్రమాతమీద దాడిచేయడం వలన సరమ తన ప్రాణాలను పోగొట్టుకున్న విషయం అతనికి గుర్తుంది—

అయినా అతనికి లక్ష్యం లేదు—

"తన తల్లి కానన యాత్రకు కారకులు మహర్షులు.... తన తండ్రి పైనే అధికారం చెలాయిస్తూ— సమస్త ప్రభుత్వ యంత్రాంగాన్నే బూజు పట్టిస్తున్న వాళ్ళు మహర్షులు.... ప్రజలలో వర్గభేదాల్ని, జాతిభేదాల్ని రెచ్చ గొడుతోందీ ఈ మహర్షులే.... సాక్షాత్తూ మహా సగరుడే ఈ మహర్షి వ్యవస్థకు బంటై అయివున్నాడు. ఈ వ్యవస్థని సమూలంగా తుడిచి పెట్టక పోతే మానవాళికి విముక్తి లేదు...." అనుకొంటున్నాడు అసమంజసుడు.

ఇది కేవలం కుమార బ్రహ్మర్షి చేసిన నేరానికి ప్రతీకారం కాదు— ఇది మహర్షి వ్యవస్థపైనే పేరుకున్న కసీ, కార్పణ్యం....

అసమంజసుని కోపాగ్ని కీలలకు మునివాటికలు భస్మీపటలం అయి పోతున్నాయి—

మహర్షులను హింసించడం మహాసగరుని దృష్టిలో మహాపరాధం— కానీ, మహర్షులను హింసించడం అసమంజసునికి అంతులేని ఆనందం— ఆ ఆనందాన్ని ఈరోజున తారాస్థాయిన పొందుతున్నాడతను—

అతన్ని అడ్డేవాడే లేడక్కడ! మునుల ప్రాణాలు తీయడంలో అతనిది ఇష్టా రాజ్యం!!

ఈ నేరానికే సరమ చేతులు రెండూ నరకిన వాడు సాక్షాత్తూ ఆ సగర చక్రవర్తే!

ఇది సరమ చేసిన దానికన్నా ఎన్నోరెట్లు ఎక్కువ నేరం.

ఈ నేరానికి అసమంజసునికి చక్రవర్తి విధించే శిక్ష ఎలా ఉంటుందో?

ఇంతలో అసమంజసుడు చేతికందిన ఓ ఋషి పుత్రుడి గొంతు నులిమి చంపి దూరంగా సరయూ నదిలోకి విసిరేశాడు.

ఋషి వాటిక మొత్తం గగ్గోలెత్తిపోతోంది. తమ పిల్లల ప్రాణాలు కాపాడమని భోరుభోరున విలపిస్తున్నారు ఋషిపత్నులు. పసిపిల్లలు తమ తల్లుల కాళ్ళను చుట్టుకుని కక్కటిల్లుతున్నారు. వాళ్ళని భుజాన వేసుకొని బలంకొద్దీ పరిగెడుతున్నారు మునిపత్నులు—

పారిపోతున్న వాళ్ళని వెంటాడి, వాళ్ళ చంకల్లోంచి పిల్లల్ని లాక్కొని నదిలోకి రివ్వున విసిరి పారేస్తున్నాడు—

"నీకిదేం పోయే కాలంరా.... కర్కోటకుడా.... నీ తల్లి ఎటువంటిదిరా.... నీ తండ్రి ఎటువంటి వాడు.... నువు పుట్టిన వంశం ఎటువంటిది.... మహామహులు ఉద్భవించిన ఇక్ష్వాకువంశంలో పుట్టి ఇటువంటి అకృత్యాలకు పాల్పడుతున్నావేమిరా...." అంటూ మునిపత్నులు శోకాలు పెడుతూ అసమంజసుని నిందించసాగారు!

వాళ్ళు నిందిస్తున్నకొద్దీ రెచ్చిపోతున్నాడు అసమంజసుడు!

"చక్రవర్తి కొడుకునని విర్రవీగుతున్నావా....? నువ్వు సర్వనాశనం అయ్యేరోజు సమీపించింది. తల్లికీ, తండ్రికీ ఎవరికీ కాకుండా పోతావ్.... దిక్కూ మొక్కూలేని చావు చస్తావ్...." అంటూ మునిపత్నులు తీవ్రంగా శపించసాగారు.

వింటున్న అసమంజసుడికి ఎక్కడలేని ఆనందంగా వుంది.

"తిట్టండి! ఇంకా తిట్టండి! బాగా తిట్టండి—" అన్నాడు సంబరంగా.

"దిక్కులేని చావుచస్తానా? ఎలా చస్తానో నేనూ చూస్తాను.... నా శవాన్ని రాబందులు పీక్కుతింటాయా.... అలా జరగకపోతే, ఈ భూమ్మీద మహర్షి అనేవాడే లేకుండా చేస్తాను—" అంటూ మళ్ళీ వికటాట్ట హాసం చేశాడు.

ఋషివాటిక అల్లకల్లోలం అయిపోయింది.

"బ్రాహ్మణుల ఆధిపత్యం నశించేవరకూ ఎత్తిన ఈ కొరడా దించేది లేదు—" అన్నాడు మళ్ళీ అసమంజసుడు.

గోమాంసం తింటూ గోవుల్ని పూజించే దుర్మార్గులారా! పీకలదాకా తెగతాగి ఋక్మంత్రాలు చదివే దుష్టులారా! కళ్లు నెత్తికొచ్చి మహాచక్రవర్తి భార్యనే కోరే ఛండాలులారా! మీరా మహాత్ములు- మిమ్మల్ని సర్వనాశనం చేస్తాను. మీ వ్యవస్థనే సమూలంగా నిర్మూలిస్తాను. మీ అంతం చూస్తాను" అంటూ తీవ్రద్వేషంతో నిష్ఠీవనం చేశాడు.

ఋషి ప్రపంచం విత్తరపోయింది!

ఇంక జరగనున్నదంతా వైపరీత్యమేనని భయపడసాగారు మహర్షులు!

"మీ అందరికీ ఇదే నా హెచ్చరిక! రాజవాసం మీదగానీ, రాజ వ్యవహారాలలోగాని ఇంకనించీ మీ జోక్యాన్ని మేం వ్యతిరేకిస్తున్నాం. ప్రభువులపైన మీ పెత్తనాన్ని మేం సహించం" అని విగ్గరగా అరిచాడు అసమంజుడు.

అసమంజుని ముష్టి ఘాతానికి వెన్నువిరిగిన ఓ మునిపుంగవుడు ఓపిక కూడగట్టుకుని, చెట్టు ఆసరాతో లేచి నిల్చుని అన్నాడు-

"పరమ కరుణామూర్తులైన ఈ ఋషులు నీకేం ద్రోహం చేశారయ్యా.... ఇలా బాధిస్తున్నావు....?"

మళ్ళీ భీకరంగా గర్జించాడు అసమంజుడు.

"రాజు చర్యను ప్రశ్నించరాదని ఇప్పుడే మీకు చెప్పాను. ఇంకో సారి ఎందుకు- ఏమిటి.... అన్నారో- సర్వనాశనం చేస్తాను-"

బాధగా అతని వంక చూశాడు ఋషి.

అప్రయత్నంగా ఆయన ముఖంలోంచి ఋక్మంత్రం ఒకటి వెలు వడింది.

"యాభిః మఘిమంత మసశ్చతం...." అని ఆయన సగం మంత్రం పఠించేసరికి అసమంజసుడు ఆయన రెండు చేతుల్ని వెనక్కి విరిచి పట్టి, ఎడమ చేతితో ఆయన గొంతు నొక్కిపట్టాడు.

"చెప్పు! అర్థంకాని ఋక్కులో నువ్వు వాగిందేమిటి? శపిస్తు న్నావా.... నీ శాపాలకు వెదిరేందుకు ఇది ఇక్ష్వాకుని కాలం అను కున్నావా?....కాదు, అసమంజసుడి కాలం....జాగ్రత్త-" అన్నాడు.

ఋషిగొంతు బిగిసిపోయి, ఊపిరి ఆగిపోతుంటే, మునిపంట ప్రాణాలు బిగబట్టుకొని.... "పాలించే ప్రభువును శపించగలమా నాయనా! అశ్వనీ దేవతలను తలచుకొని, ప్రభువులవారికి ఆయురారోగ్యాలు ప్రసా దించమని కోరుకొంటున్నాను-" అని విలవిలలాడిపోయాడా ముని.

అసమంజుడు ఆయన గొంతు వదల్లేదు.

"నాయనా! నేను ఎవరికీ వ్యతిరేకంగా మంత్రోచ్చాటన చేయలేదు. సింధూ ప్రవాహాన్ని తియ్యని నీటిగా మార్చి అందరి దాహాలూ తీర్చిన అశ్వనీదేవతల్లారా! అన్నానంతే. ఇంతలో తమరు నాగొంతుపట్టుకున్నారు" అన్నాడు ఋషి వినయంగా.

మహర్షి మాటలకు అసమంజుని కోపం రెట్టింపయ్యింది. మళ్ళీ ముష్టి ఘాతంతో బాధించాడు. ఆ దెబ్బకు మహర్షి కళ్ళు తేలవేశాడు.

"దుర్మార్గుడా! ఇంతకాలం మా సౌమ్యతని చూసే ద్రోహం చేస్తావా.... సింధూనదిని మంచినీటిగా మళ్ళించింది అశ్వనీ దేవతలా....? విశ్వాసఘాతకుడా నీటి పారుదలలు కల్పించింది మహాచక్రవర్తి సగరుడు. ఆయన కల్పించిన సౌకర్యాలనుభవిస్తూ మీరు ఆ ఘనతని ఎవరికో ఆపా

దించి కీర్తిస్తారా....?" అంటూ కొరడా తీసుకుని అందిన మహర్షిని అందినట్లు హింసించసాగాడు అసమంజసుడు.

పిక్కటిల్లిపోయింది ముని వాటిక!

పరమ కిరాతకంగా నవ్వుతున్నాడు అసమంజసుడు!!

* * * *

సప్తసింధు వెలవెలాబోతోంది!

సమస్త రాచకార్యాలనూ పరిత్యజించి, మౌనముద్రదాల్చిన మహా సగరుని చూసి ఎక్కడి వారక్కడే భ్రమాన్పడిపోయారు.

ఋభుమహర్షి వచ్చాడు. సగరుడు కళ్ళు విప్పిచూడలేదు. సామంత మంత్రి సేనాధిపులంతా వచ్చారు. మహాచక్రవర్తిని పలకరించే సాహసం ఎవరికీలేదు. దాపులకు కూడా ఎవరూ పోలేదు.

శోకం పొగమంచులా అలుముకుంది. ఎక్కడి వారక్కడే ఉండిపోయారు. ఆయన ఎవరినీ కన్నెత్తి చూడలేదు. పలకరించలేదు.

ప్రళయ జ్వాలలతో దహించుకుపోతున్న ఆయన హృదయతాపాన్ని శాంతింపచేయగల పవిత్ర సరస్వతీనది భూపొరలలో అంతర్లీనమైపోతున్నట్లు ఆయన తన మనోనేత్రంతో దర్శిస్తున్నాడు.

ప్రపంచదేశాలకు ఆదర్శప్రాయమై నిలిచిన ఈ మహా నాగరికత ముక్కలు చెక్కలై దాని శిధిలాలు భూస్థాపితమై, అక్కడ ఎత్తయిన మట్టిదిబ్బలు పెరిగి ఇంకెవరికీ కొన్నివేల సంవత్సరాలవరకూ వాటి జాడ తెలియనంతగా భూమిలోకి కూరుకుపోతోంది.

సుస్థాపించిన నాగరకతని తన కోపాగ్నికి ఆహుతి చేయవద్దని, మహాకాళ్యపుణ్ని ప్రార్థిస్తూ, దీక్షామగ్నుడై సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు.

ఈ అనంత నాగరికతని తన భీకర కెరటాలతో ముంచెత్తవద్దని సింధూమాతని వేడుకొంటూ ప్రాయోపవేశానికి అన్నపానాలు వర్జించి సిద్ధపడ్డాడు!

మనుషులు తమలోతాము కలహించుకుని కొంత, తమ అజ్ఞానంతో పోషణ ఎరగక కొంత, ప్రకృతి వైపరీత్యాలతో ఇంకొంతా— ఈ సింధూ

నాగరకత త్వరలోనే పూర్తిగా ధ్వంసం అయిపోతుందని ఆయన అంత ర్వాణి ఉద్బోధిస్తోంది.

ఈ విశిష్ట నాగరకతా సర్వస్వాన్నీ తన ప్రకంపనలతో నిర్మూలించవద్దని భూమాతని ప్రార్థిస్తూ- దర్భాస్తరణం వేసుకుని, సర్వాభూషణాలంకారాలూ విసర్జించి పద్మాసన స్థితుడైనాడు సగరుడు.

ఈ చరాచర సృష్టినీ సంరక్షించమని వాయుదేవుని స్తుతిస్తూ ఏకాగ్రతతో దీక్షామగ్నుడైనాడు-

అన్ని రాచకార్యాలనూ పరిత్యజించి, మౌనముద్ర దాల్చిన తమ ప్రభువుని చూసి ఎక్కడి వాళ్ళక్కడే ప్రాన్పడిపోయారు-

బుధమహర్షి వచ్చాడు.

సగరుడు కళ్ళు విప్పి చూడలేదు-

సామంతమంత్రి సేనాధిపులంతా వచ్చారు.

మహాచక్రవర్తి మౌనభంగంచేసే సాహసం ఎవరికీలేదు - ఆయన దరిదాపులకన్నా ఎవరూపోలేదు. దూరంగా నిలబడిపోయారంతా!

భోజనం వేళయింది. భోజనం చేసేందుకు ఎవరూ సిద్ధపడలేదు- ప్రభువు ఆహార వర్జనం చేశాడని నగరంలో ఎవరూ వంటలు చేసుకోలేదు. శోకం పొగమంచులా రాజధానీ నగరాన్ని కమ్మేసింది!

నిరాహారంగా-నిరాధారంగా - నిరాసక్తంగా-సప్తసింధు యావత్తూ నిస్తేజమైంది.

ఎక్కడివారక్కడే ఉండిపోయారు.

మహాసగరుడు ఎవ్వరినీ కన్నెత్తిచూడలే ఎవరినీ పలకరించనూ లేదు

నిర్మాణం విచ్ఛిన్నం రెండూ సమానంగానే జరగాలి. విచ్ఛిన్నం లేని నిర్మాణంలో అభివృద్ధి వుండదు!

ఇంతలో-వర్తమానాలు మోసుకొచ్చే సంచారి హఠావిడిగా సౌధం వేపుకు పరిగెత్తుకొచ్చాడు.

సౌధం వెలుపల నిస్సత్తువగా గుమికూడిన అధికార్ల బృందాలను చూసి నివ్వెరపోయాడా సమాచారి.

ఈ భయంకర సంఘటనగురించి ఎవ్వరితో చెప్పాలి? చక్రవర్తికి ఈ సమాచారం ఎలా అందుతుంది?

ఆ సంచారి ఆలోచించి, బుధమహర్షి ప్రక్కనజేరి, ఆయనకు వివరించాడు. విన్నాడు మహర్షి. ఆయన ముఖకవళికలలో పెద్ద మార్పేమీ లేదు. దీర్ఘంగా నిట్టూర్చాడంతే!

అంతఃపుర వ్యవహారాలలో విపరీత పరిణామాలు చోటుచేసుకున్నాక అసమంజసుని విషయంలో కొంత ముందు జాగ్రత్తపడి ఉండాల్సింది.

అంతరంగిక భద్రతావిషయాలను పర్యవేక్షిస్తున్న తాను అటువంటి ఆలోచన చేయలేకపోయాడు-

జరగవలసిన అకృత్యం జరిగిపోయింది-

అసమంజసుడు మునివాటికల్ని పూర్తిగా ధ్వంసం చేశాడు - ముని పత్నుల్ని ఘోరంగా అవమానించాడు-మునిపుత్రుల్ని కిరాతకంగా నదుల్లోకి విసిరేశాడు-ఈ ఘోరకలి సృష్టించనున్న బీభత్సం ఇంకెంత ఘోరంగా వుంటుందో....అని మధనపడసాగాడు బుధమహర్షి!

చక్రవర్తి పరిస్థితిఏమిటో ఎవరికీ అంతుబట్టలేదు. పైగా, ఈ అసమంజసుడు ఇప్పుడీ కొత్త చిక్కు తెచ్చిపెట్టాడు....ఈ సమస్యల పరంపరకు పరిష్కారం ఏమిటి....?

బుధ మహర్షి మౌనంగా సగర చక్రవర్తి ప్రక్కన ఆశీనుడై "నాయనా! సగరకుమారా!" అని ఆప్యాయంగా పలకరించాడు.

సగరుడు కళ్ళుతెరవలేదు. నెమ్మదిగా నోరుతెరచి ఇలా అన్నాడు.

"మహర్షీ నాకంతా తెలుసు! జరిగింది-జరుగుతోంది జరగబోతున్నదికూడా నా మనోనేత్రం దర్శించగల్గుతోంది. అసమంజసుడికి దేశబహిష్కారశిక్ష విధిస్తున్నాను. మీరు వెంటనే దానిని అమలు చేయండి! అంతవరకూ నేను ఈ దీక్షను విరమించను-" అని మళ్ళీ మౌనసమాధి స్థితిలోకి వెళ్ళిపోయాడు.

చక్రవర్తి శాసనం తిరుగులేనిది. దానిని అమలుపరచవలసినబాధ్యత బుధునిది.

పూలు చాలినంత పూయడంలేదని పూల మొక్కని విరిచేస్తున్నట్లని పించిందాయనకి సగరశాసనం విన్నాక-

అది పెంచిన మమకారం . . పెంచుకున్న అనురాగం....

కానీ, ఆ మమకారాన్నీ, ఆ అనురాగాన్నీ అందుకునే అర్హత అస మంజసునికి ఉన్నదా....అనేదే ఆ మహనీయుని ముందున్న ప్రశ్న!

* * *

మహాసగరుని పాదాలమీదపడి బావురుమన్నది యోజిత.

"ప్రభూ! చిరంజీవి అసమంజసుని క్షమించండి.... పెంచిన నా మమ కారాన్ని త్రుంచివేయకండి - నాకు పుత్రభిక్ష పెట్టండి స్వామీ....!" అని పాదాలు చుట్టుకుని ఘోషించింది యోజిత!

"యోజితా! మనశ్శాంతికోసం వెదుక్కొంటున్నవాణ్ణి .... ఇంత సామ్రాజ్యాన్ని సాధించానుగాని, సుఖ శాంతులను సాధించుకోలేక పోయాను...." అంటూ దుఃఖభాజనుడైనాడు సగరుడు. "అడవిలో అడవి మృగంగా సంచరించడంలోనే ఆనందం వుందనిపిస్తోంది...." అన్నాడు-

"మన్నించండి మహాప్రభూ! అసమంజసుని నేరానికి నేను బాధ్యత వహిస్తాను, నన్ను శిక్షించండి! వాడి దేశబహిష్కరణను ఉపసంహరిం చండి ప్రభూ....!" అని వెక్కివెక్కి ఏడ్చింది యోజిత.

విషాద జలపాతంలోపడి కొట్టుకుపోతున్నాడు సగరుడు-ఎన్ని అవాం తరాలు ఎదురయినా చలించని ఆయన....సాక్షాత్తూ తన సింహాసనవారసుడే మహర్షి వ్యవస్థను ఘోరంగా అవమానించాక దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు-మమకారంతో ఆయన పెంచుకున్నపూల మొక్కలు ఒకటొక్కటే వాడిపోతున్నాయి-

"యోజితా! అసమంజసుని అకృత్యాలను ఇంక భరించలేను—వాడు ఇలా తయారవడానికి నీ అతిగారాబమే కారణం-పిల్లల్ని చంపే దురలవాటు ఒకప్పుడు వాడిలో లేదు. ఆ జబ్బు వీడికెలా సంక్రమించిందో అర్థం

కాపడంలేదు. అది మనోవ్యాకులతతో చేసిందని నువ్వంటావు. కాని,చక్ర వర్తి కుమారుడిననే అహంకారంతో ఇంత దారుణానికి ఒడిగట్టాడని నేను భావించాను. అందుకే దేశబహిష్కారణశిక్ష విధించాను—" అన్నాడు మనసు కఠినం చేసుకొంటూ!

"క్షమించండి మహారాజా! ఈ అల్లకల్లోలానికంతటికీ కారకుడు ఆ ఆత్రేయుని కొడుకు కుమార బ్రహ్మర్షి! అతనికి తగినశిక్షపడనిదే అస మంజసుని మనసు కుదుటపడదు-"అన్నది యోజిత కొంచెం కఠినంగా!

ఆ మాటలు వింటూనే "యోజితా!" అని బిగ్గరగా అరిచాడు. ఆ అరుపుకు మందిరం ప్రతిధ్వనించింది. 'కుమార బ్రహ్మర్షిని శిక్షించవల సింది రాజ్యసభ! నేనుకాదు రాజ్యసభ నిర్ణయించిన శిక్షను అమలుపరచే వాడిని మాత్రమే నేను....ఆ సంగతి నీకూ తెలుసు. గాయపడ్డ నామనసును మరింత గాయపరచకు?"

"కాని, నా పుత్రుడికి దేశబహిష్కార శిక్ష మీరే విధించారు- రాజ్య సభ కాదు—అంటూ రెట్టించింది యోజిత!

"అవును! అసమంజసుడు ఈ అనంత సామ్రాజ్యానికి వారసుడే! కానీ....ప్రభువు కాదగినవాడికి సాహసం ఒక్కటే చాలదు. సహనంకూడా కావాలి. పౌరుషం ఒక్కటే చాలదు. కారుణ్యంకూడా కావాలి. అసమంజుని వంటి అసహనపరులకూ, కర్కోటకులకూ ఈ సింహాసనాన్ని అధిష్టించే యోగ్యతలేదు! అందుకే, వాడి వారసత్వాన్నికూడా బహిష్కరించాను-" అన్నాడు.

అస్తమిస్తున్న సూర్యగోళాల్లా వున్నాయి ఆయన నేత్రాలు. పొంగి పొర్లుతున్న కన్నీటిని కనపడనీకుండా తుడుచుకొన్నాడు సగరుడు.

"అంతకన్నా. వాడికి మరణశిక్ష విధించివుంటే బావుండేది ప్రభూ" అన్నది యోజిత-

మనసు రాయిచేసుకొని గంభీరంగా ఉండిపోయాడు సగరుడు.

"స్వామీ! అసమంజసుని తీసుకొని మా మిశ్రదేశం వెడతాను. అనాగరకులైనా, మా మిశ్రదేశీయుల ఆదరణ-వాడి హృదయ తాపాన్ని

చల్లార్చగలదేమో....కొన్నాళ్లు ఈ జ్ఞాపకాలనుంచి దూరంగా వుంచితే, వాడి ఆలోచనలను మీరు కోరుకున్నవైపుకు మళ్ళించవచ్చేమో...అనుమతించండి ప్రభూ!" అని వేడుకొంది యోజిత!

కన్నీటి పర్యంతం అయిపోయాడు సగరుడు-

దుఃఖ సాగరంలో మునిగిపోయిన ఆయన మహా విషాదాన్నిచూసి కొండరాళ్ళుకూడా గుండె పగిలేలా ఏడుస్తున్నాయి-

ఆయనకోసం ఇన్నాళ్ళూ శాంతిగీతిక ఆలపించిన ఆకులూ పూలూ క్షతగాత్రుల్లా నేలరాలిపోతున్నాయి- మెదడుని అసహనం వణికిస్తోంది- గుండెని రక్తప్రసారం ఎగదట్తోంది- నరాలను విద్యుత్ ప్రవాహం కృంగదీస్తోంది.... తమాయించుకోలేకపోతున్నాడు సగరుడు!

"కన్నకొడుకుపట్ల ఇంత నిర్దయగా ప్రవర్తించిన తండ్రులు చరిత్రలో ఉండరు! పిల్లలు తలిదండ్రులపట్ల ద్వేషాన్ని పెంచుకోక మునుపే జాగ్రత్తపడడం అవసరం!! అసమంజసుని మిశ్రదేశానికి తీసుకు వెళ్ళడమే ఈ సమస్యకు పరిష్కారంగా కన్పిస్తోంది-" అంది యోజిత!

ఆమె అలా అంటూ ఉంటే, సగరుడి పాదాలక్రింద భూమి కంపించి నట్లనిపించింది!

"పిల్లలు తప్పులుచేస్తే సరిచేసి సంస్కరించుకోవాలిగాని ప్రాణాలు తీసుకోంకదా.... పరమ కిరాతకులనే సంస్కరించిన మీకు నేను చెప్పగల వానినా ..." అని రెట్టించింది యోజిత!

సగరుడింక సహించలేకపోయాడు.

"పోండి.... అంతా నన్నొదిలేసి పోండి.... ఎవరికీ అవసరంలేని ఈ సుఖభోగాలు నాకుమాత్రం దేనికి....? నేనే మిమ్మల్ని బహిష్కరిస్తున్నాను.... సాటి మనిషి గుండెకోతని అర్థంచేసుకోలేని మీలాంటి కర్కోటకులకు నాదగ్గర స్థానంలేదు- మీ ఇద్దరినీ నా జీవితంలోంచే బహిష్కరిస్తున్నాను.... మీ ముఖం నాకు చూపించకండి.... పోండి...." అన్నాడు. ఆవేశంతో రొప్పుతూ!

రాజధానీ నగరం విషాద నిశ్వాసలు విడుస్తోంది ...!

# 8

సమ్రాట్ సగరుని ద్వితీయ పుత్రుడు ఉర్మిఖుడి యువరాజ పట్టాభిషేకోత్సవం వైభవోపేతంగా సాగుతోంది.

ఇక్ష్వాకు వంశంలో పెద్దకొడుకు వారసత్వాన్ని కాదనడం ఇంక ఒక ఆనవాయితి అవుతుంది కాబోలు....

ఇక్ష్వాకులు మహాకాశ్యపుడు సూర్యుని స్మరించనిదే ఏ కార్యమూ ప్రారంభింపరు- కాశ్యపుడు మహామేరువుని ఎన్నటికీ విడువనివాడిగా ధ్యానించి ఉత్సవాన్ని ప్రారంభించారు.

వేయించిన యవలు, పెరుగుతో కూడిన సక్తువులు, అపూపాలు, నవనీయ, పురోడాశం.... వంటి పిండివంటలను సూర్యస్వరూపుడైన అగ్నికి అర్పించుకొంటున్నారు మహర్షులు.

రాజ్యసభా ప్రాంగణంలో వశిష్టుడు ఋత్విక్కుగా వైభవంగా యజ్ఞం సాగుతోంది. దేవతలే దిగివచ్చి పట్టాభిషిక్తుడౌతోన్న ఉర్మిఖుణ్ణి ఆశీర్వదిస్తారని యజ్ఞం చేయిస్తున్నాడు వశిష్టుడు.

కరంభం- గవాశిరం, యవాశిరం, దధ్యాశిరంవంటి ఆహారపదార్థాలను యజ్ఞకుండంలో హవనమొనరిస్తున్నారు-

ఇంద్రుని ప్రీత్యర్థం, వాయువు ప్రీత్యర్థం, దధి కలిసిన సోమాన్ని అర్పిస్తుంటే, దేవతలే స్వయంగా దిగివచ్చి, పట్టాభిషిక్తుడౌతున్న ఉర్మిఖుణ్ణి ఆశీర్వదిస్తారని అందరి నమ్మకం.

"ఓం ఇహైవైధి మాపచ్యోష్ఠాః
పర్వత ఇవా విచాచలిః
ఇంద్రవేహ ధృవ స్తిష్ఠేహ రాష్ట్రముధారయా"

అంటూ, పట్టాభిషేక మహోత్సవ సమయంలో పఠించే ఋక్కులను ఉచ్చరిస్తున్నాడు వశిష్ఠమహర్షి !

"ఈ ప్రపంచం అంతా ఒకే సామ్రాజ్యం! ఆ సామ్రాజ్యానికి స్వామి భావంతో మెలుగు....!!

ఈ రాజ్య పదవినించి ఎప్పుడూ జారిపోకు-

పర్వతంలా చలించకుండా స్థిరంగా నిలబడు-

ధ్రువుడిలా కేంద్ర స్థానాన నిలిచి లోకాన్ని ప్రకాశింపచేసి పాలించు...." అని ఉద్బోధించాడు వశిష్టుడు!

"ఓం ధ్రువం ధ్రువేణ హవిషాభిసోమా మృశామసి
అథోత ఇంద్రః కేవలీ ర్విశో బలి హృతస్కరత్!"

"నాయనా! ఉర్ముఖా! నువు అందించిన హవిస్సుని గైకొన్న ఇంద్రుడు- నీ ప్రజలు చక్కగా బలులు [పన్నులు] చెల్లించుకునేలా చూస్తాడు!

"ఓం ఆత్వాహార్ష మన్తరాధి ధ్రువస్తిష్ఠా విచాచలిః
విసర్వా వాంఛంతు మాత్వద్రాష్ట్రి మది భృశత్ !".

ఓ రాజా! నిన్ను మా రాష్ట్రపతిగా భావించాం.... మా మధ్య స్వామివిగా నిలబడి మా సేవలు పొందు-

నిత్యుడిగా- నిశ్చలుడిగా ఈ రాష్ట్రాన్ని అధిరోహించు-

ప్రజలందరు నిన్నే రాజుగా అంగీకరించుగాక!

నీ నుండి రాష్ట్రం తొలగకుండుగాక....!! "అంటూ ఋక్మంత్రాలు పఠిస్తున్నాడు వశిష్టుడు.

స్వర్ణ ఖచిత కిరీటాన్ని ఉర్ముఖుని శిరసున ఉంచి ఆశీర్వదించారు బ్రహ్మర్షులు-

"నాయనా! ఉర్ముఖా! ఈ సువిశాల భరత సామ్రాజ్యానికి నువు కాదగిన వారసుడివి- ఆర్య సమాఖ్యను ఏర్పరచి, నీ తండ్రి సమ్రాట్ సగరులవారు సాధించిన విజయాలను కొనసాగించవలసిన ధర్మం నీపైన ఉంది-

ప్రజారంజకమైన నీ పాలనలో ఈ దివ్య నాగరికత విలసిల్లుతుందనే విశ్వాసంతో రాజ్యసభ అనుమతితో, చక్రవర్తి మహానగరుడు ఈ కార్య భారాన్ని నీకు అప్పగిస్తున్నారు-

సత్యవాదులూ, స్థితప్రజ్ఞులూ, దృఢ ప్రతిజ్ఞులూ పుట్టిన ఇక్ష్వాకు వంశ కీర్తి ప్రతిష్టలు ఇనుమడించేలా వర్ధిల్లు నాయనా...!!" అని ఆశీర్వదించాడు వశిష్ట మహర్షి !.

సరిగ్గా ఇదేసమయంలో-

ఇదే ముహూర్తానికి, సప్త సింధుకు మారంగా, చీకటి ఖండంలో- నీలానది తీరంలో- మిశ్రదేశంలో [ఈజిప్ట్] మరో పట్టాభిషేకం జరిగింది-

అది సమ్రాట్ సగరునిపై తిరుగుబాటుగా జరిగిన మరో ఉత్సవం .. మరో ఉత్సాహం.... మరో సంరంభం....

కాలం 'సమవర్తి' అంటారు గానీ, ఒకే ముహూర్తానికి రెండు విరుద్ధ సంఘటనలు ఎలా జరుగుతున్నాయి....?

ఒకరికి అమృతాన్ని, మరొకరికి కాలకూట విషాన్నివంచి ఇచ్చే స్వభావం కాలానిది- కాబోలు....!!

ఒక మహాబలుడు నీలానదీ తీరంలో అర్థంలేని అర్థంకాని ఆవేశంతో రొప్పుతున్నాడు-

అతను శాంతిస్తే నీలావతీ చరిత్ర మరో మలుపు తిరుగుతుంది!!

* * *

జీవనది నీలావతి [నైలూ] తన అలల కరతాళ ధ్వనులతో మిశ్ర దేశానికి [ఈజిప్టు] స్వాగతం పలుకుతోంది-

తాను పుట్టిన గడ్డమీద, రెండు దశాబ్దాల వియోగం తర్వాత తొలి సారిగా కాలూనింది యోజిత!

రాజ లాంఛనాలు లేవు- రాజసౌధాలు లేవు.

స్వంత భూములు లేవు- పశువుల మందలు లేవు.

సుఖ భోగాలు లేవు.

కడుపునిండా తిండికూడా లేదు.

జీవితంలో అన్ని ఆశలూ ఉడిగిపోయి, అన్ని ఎత్తుగడలూ-పస్మ్మ అయిపోయి, ఏవేవో సాధించాలని కలలుగని, అన్నిటా ఓడిపోయి— పరమ దరిద్రుడిగా జీవచ్ఛవంగా మిగిలిన 'తలేవా'....యోషితను చూసి బావురు మన్నాడు-

మూర్తీభవించిన మిశ్ర దేశపు దారిద్ర్యానికిప్రతినిధిగా నిలిచివున్నాడు తలేవా!

తోడేళ్ళు పీక్కుతిని వదిలిన అస్థిపంజరాల్లా, బక్కచిక్కిన మిశ్ర దేశ వాసుల శరీరాలను చూసి ఆమె గుండె తరుక్కుపోయింది.

నాగరికతా వైభవంతో, ఉత్తమ సంస్కృతీ సంపన్నతతో, సుఖ భోగాలనుభవిస్తున్న సింధువు లెక్కడ....

అజ్ఞానాంధకారంలో పడి మ్రగ్గుతున్న ఈ మిశ్ర దేశీయులెక్కడ...

మహానగరుని సామంతునిగా ఇక్కడ రాజ్యం చేస్తోన్న "తర్షి" వెలగబెడుతున్న పాలన ఇదేనా....?

నది నుంచి బీళ్ళకు నడిచిన కాలువ ఒక్కటీ లేదు—

వరదనీరు ఊళ్ళను ముంచెత్తకుండా ఆపే అడ్డుకట్ట ఒక్కటీ లేదు ఎంతదూరం ప్రయాణించినా నాగరకత జాడ ఎక్కడా కనిపించడం లేదు

సుఖవాసం చేయడానికి అనువైన ఇల్లు ఒక్కటీ లేదు....

ఏమిటీ దారుణం... దేశమంతా తిరిగి పరిస్థితులు అర్థం చేసుకో సాగింది యోషిత—

అయోధ్యలో కూర్చుని, ప్రపంచం అంతా సుఖంగా ఉందని ఎంత భ్రమించామూ.... ఇన్నాళ్లూ....???

కూపస్థ మండూకంలా ఉండిపోయామా.... అక్కడ!!

తన ఏలుబడిలోని వివిధ దేశాలలో తన ఆదేశాలు ఎంత వరకూ అమలు అవుతున్నాయో ఆ చక్రవర్తి తెలుసుకోలేదన్న మాట?

ఇదేనా ప్రపంచ విజేత అయినవాడు చేయవలసింది....?

ఇందుకేనా దేశదేశాలు జయించి స్వాధీనపరచుకున్నది....?

ఇలాగేనా మానవ మహోదయాన్ని కాంక్షించేవాడు పాలించ వల సినది....?

అంతా మాయ! నయవంచన! ప్రజాద్రోహం!

ఆలోచిస్తున్న కొద్దీ ఆమె తల తిరిగి పోసాగింది.... ఈ ప్రజలకు ఒకప్పటి యువరాణిగా తాను చేయగల్గిందేమిటీ....???

ఎటూ పాలుపోని ఆలోచనలతో, చిందర వందరైన మనసుతో వెర్రెత్తినట్లు నీలా నదీతీరంలో పడి తిరుగుతోంది యోజిత—

తలేవా కట్టుకున్న చింకి గుడిసెలో ఆదమరిచి నిద్రిస్తున్నాడు అస మంజసుడు.

.... ఆ అమాయకుని బంగారు భవిష్యత్తును కూల్చి, సమస్త దేశాలూ సుభిక్షమైనాయని సగరుని నమ్మించి, మహర్షులు ఎంత మోసం చేశారూ....?

మహర్షుల గురించిన ఆలోచన రాగానే ఆమె వెర్రెత్తిపోతోంది—

ఆనాడు మునివాటికలో అల్లకల్లోలం సృష్టించి పగసాధించిన అస మంజసుడు మంచిపనే చేశాడని ఆమె ఇప్పటికీ నమ్ముతోంది—

మహర్షి వ్యవస్థని నిర్మూలించాలనే ఆమె కూడా నిర్ణయించు కుంది—

అందుకు ఎంతటి పోరాటానికైనా ఆమె సిద్ధమే!!

ఈ పోరాటం ఎవరిపైనా....? తన పగ ఎవరిపైన ??

మహర్షుల మాటలు గుడ్డిగా నమ్మిన సగరుడిపైనా....? లేక, అస మంజసుని అధికారాలను కూలద్రోసిన మహర్షి వ్యవస్థ పైనా....??

మెదడు పొరలు చిట్లిపోయేలా వెర్రిగా ఆలోచిస్తోంది యోజిత....

ఏదో ఒకటి చేయాలి....!

తన మిశ్రదేశపు పౌరులూ స్వతంత్రనాగరకతా వికాసాన్ని సాధించు కొనేందుకు తాను తోడ్పడాలి...

మిశ్రదేశపు నాగరకత సప్తసింధుకన్నా భిన్నంగా వుండాలి—

అది బ్రహ్మర్షులు-బ్రహ్మరాక్షసులూలేనిదిగా విలసిల్లాలి....

ఎవరు అడ్డొచ్చినా - ఎవరు అంగీకరించకపోయినా తన నిర్ణయం మారదు-అనుకొన్నది సాధించి తీరాలి....

"అసమంజా..." అంటూ వెర్రిగా అరిచింది యోజిత—

ఉన్మత్తంగా నీలానదీ తీరంలో జుట్టు విరబోసుకుని పిచ్చెక్కినట్లు తిరగసాగింది!

హావుకు చివరి అంచున నిలబడి బాధతో మనిషి పెట్టే వెర్రికేక ఆమె మనస్తాపానికి కొంత శీతలం కల్గిస్తుందేమో...

మునివాటికలలో ఋషిపత్నుల్ని అసమంజసుడు హింసించినప్పుడు కక్కటిల్లే పిల్లలు చేసిన ఆర్తనాదం ఆమె గుండె బరువుని తగ్గిస్తుందేమో....

రాచమార్గంలో అసమంజసుడు ఎనుబోతు రెండు కొమ్ముల్ని అవలీలగా విరిచేసినప్పుడు అది చేసిన మృత్యురోదన ఆమె హృదయాగ్నిని చల్లారుస్తుందేమో...

"గుర్రాన్ని ముష్టి ఘాతంతో చంపాలి—

ఒంటెని మెడలు విరిచి చంపాలి—

ఏనుగుని తొండం మెలిపెట్టి చంపాలి—" ఇలాంటి ఆలోచనలు వచ్చినప్పుడు యోజిత మనసు ఉద్వేగంతో ఉరకలు వేస్తుంది—

యుద్ధం కోసం ఆక్రోశిస్తోంది ఆమె అంతరాత్మ....!

జ్వాజ్వల్యమానమైన ఆమె చూపులు సోకితే పరమ పాషాణాలు కూడా కాలి మసి అయిపోతాయన్నంత భయంకరంగా ఉన్నదామె స్వరూపం....

**ఇదీ ఇలా వుండగా...**

సప్తసింధు నుంచి వీరనారి యోజిత వచ్చిందనీ, వీరాధి వీరుడైన అసమంజసుని వెంట తెచ్చిందనీ, వారిద్దరూ కలిసి తర్షి దుష్టపాలనని నిర్మూలించనున్నారనీ వార్త మిశ్రదేశం అంతా దావానలంలా వ్యాపించింది.

ప్రజలు తండోప తండాలుగా నీలానదీ తీరానికి చేరుకోసాగారు.

జయ జయ ధ్వానాలతో ఆమెను ముంచెత్త సాగారు.

కటిక దారిద్ర్యంతో సొమ్మసిల్లి పోతోన్న తన దేశ వాసులను చూసి కన్నీటి పర్యంతం అయింది యోజిత!

తన జాతి ప్రజలకు ఈ దుస్థితి పట్టించిన అధికార మదాంధులపై పగ ఒకవైపు... తన జాతిప్రజల దైన్యాన్నిచూసి దుఃఖం ఇంకొకవైపు...

తన చేయూతకోసం ఆబగా ఎదురుచూస్తున్న తన ప్రజలను చూసి ఆవేశం ఆపుకోలేక పోయింది యోజిత.

ఈ ప్రజల మేలుకోసరం తాను తెగించి తీరాలనే నిర్ణయించుకొంది యోజిత—

వారి మంచి కోసరం అవసరం అయితే మహాసగరుని మీద తిరుగుబాటుకైనా తాను సిద్ధమే...

"తల్లీ! నువ్వే కాపాడాలమ్మా మమ్మల్ని" అంటూ ఆమెను చుట్టు ముట్టి బావురుమంటున్నారు జనం.

చలించి పోయింది యోజిత!

"ఈ క్షణానే తర్షి మీద తిరుగుబాటు ప్రకటిస్తున్నాను.

దుష్టపాలనపై సమరం ప్రారంభిస్తున్నాను—

మిమ్మల్ని అనేక విధాల కడగండ్ల పాలు చేసిన ఆ దుర్మార్గుడు "తర్షి"పై ఇదే వీరధనువు సంధిస్తున్నాను—

ప్రజలారా....

మనకు ఆయుధాలు లేక పోవచ్చు... అధికారబలం లేకపోవచ్చు...

కాని, మనోబలం ఉంది...

అదే ఈ 'తర్షి' లాంటి వేయిమంది నరహంతకులనైనా నేల కరిపిస్తుంది....

నా ప్రియమైన మిత్రదేశవాసులారా...

ముందుకు కదలండి... మీతో మేమున్నాము..." అంటూ సిద్ధంగా ఉన్న ఒంటెల బండినెక్కి వాటిని అదిలించింది యోజిత...

బండిలో యోజిత వెనక అసమంజసుడు...

వారి వెనక వేలాది జనసందోహం...పొంగిన నీలానదిలా ఉరకలు వేస్తూ తర్షి సౌధం వైపు దూసుకుపోతున్నారు జనం!

అదంతా చిన్ననాడు, ఇరవై పసంతాల క్రితం తాను తిరిగిన చోటే!

అప్పుడిక్కడ ఎన్నెన్ని పూలతోటలుండేవీ...

ఇప్పుడన్నీ మట్టిదిబ్బలు

ఆ రోజుల్లో ఇక్కడ ఎన్నెన్ని గుర్రాలు తిరిగేవీ...

ఇప్పుడు మచ్చుకు ఒక్కటీ కన్పించదు.

అన్నీ పనికిరాని ముసలి ఒంటెలే!

తన దేశ దౌర్భాగ్యాన్ని చూస్తున్న కొద్దీ ఆమెలో కసి పెరిగి పోతోంది...

ఉవ్వెత్తున లేచిన ఉదగ్రరూపంతో తర్షి సౌధంపై విరుచుకుపడింది యోజిత! అల్లకల్లోలం సృష్టించ సాగాడు అసమంజసుడు.

అందమైన ఆడపిల్లల్ని పక్కన వేసుకుని మత్తుగా దొర్లుతున్నాడు తర్షి!

మిశ్రదేశ పాలకుడిగా, సమ్రాట్ సగరుని సామంత ధీమంతుడిగా అతనికిప్పుడు ఏ విధమైన చింతా లేదు.

ఒకప్పుడు శత్రుభయం, ప్రాణభయం, జంతుభయం, కరువు కాట కాల భయాలతో అనుక్షణం కలతగానే నిద్రపోయేవాడు.

కానీ, మహా సగరునికి లొంగిపోయి, ఆయన సామంతుడిగా మారి పోయాక, ఇప్పుడతనికి బాధ్యతల్లేని అధికారాలు లభించాయి.

తన ప్రజలకు కూడూ, గూడూ, గుడ్డా అందేలా చూడవలసిన అవ సరం లేదు అతనికి! తన ప్రజల మాన ప్రాణ రక్షణల బాధ్యత అతనికి లేదు. తన ప్రజల అవసరాలు తీర్చే ఆలోచనచేసే శ్రమకూడా లేదు.

అన్నీ చక్రవర్తి సగరుల వారే చూసుకుంటారు.

తాను కేవలం రాజభోగాలకు మాత్రమే సాక్షి!

ప్రజలు తెచ్చి ఇచ్చే పంటలలో భాగాలు, బలులతో హాయిగా కూర్చుని తినడంతో గున్నఏనుగులా ఊరిపోయాడు. కర్రసాము, కత్తి సాముపదిలేసి ఇరవై యేళ్ళవుతోందేమో.... శరీరం కొవ్వుబారి మెత్తగా ప్రత్తి పండలా తయారయ్యింది.

అందరికీ పైన 'రా' దేవుడున్నట్లే, తనకు ఆ సగర చక్రవర్తి వున్నాడు.

ఆయన పుణ్యమా... అని యుద్ధాలు చేసే బాధ తప్పింది. శత్రు భయం లేదు. అధికారం పోతుందనే భయం అంతకన్నా లేదు.

ఇంక ప్రజలకోసం తానుగా తీసుకునే శ్రమ మాత్రం ఏవుంది?

బలులూ, భాగాలూ (పన్నులు) సమర్పించుకో లేనివాళ్ళని దండించ డానికి-ఎవడైనా ఎక్కడైనా కొద్దిగా తలెగరేస్తున్నట్లు కనిపిస్తే వాడి పీచ మణచడానికి తగిన సైన్యాన్ని మాత్రం ఉంచుకొన్నాడు!

తక్కిన సైనికులు పొట్టచేత్తో పుచ్చుకుని వీధిన పడ్డారు —

దేశం అంతా నిరుద్యోగం తాండవిస్తోంది.చేతుల్లో పనుల్లేవు. పండు తున్న పంట అంతంత మాత్రం - బతుకు గడవడం దేశానికి దుర్భరంగా వుంది—

సరిగ్గా ఆ సమయంలోనే - భయం భయంగా, పెద్ద కేకలు పెట్టు కొంటూ-అతని అభ్యంతర మందిరంలోకి దూసుకువచ్చాడు ఓ సైనికుడు.

ఈ ఇరవై వసంతాలలో ఎప్పుడూ ఇంత భయానక వార్త తమ ప్రభువుకు చెప్పి ఎరగని ఆసైనికుడు మందిరం లోపలికిపోయి, ప్రభువును లేపడం ఎలాగో అర్థంకాక ఒక్క క్షణం ఆలోచించాడు.

వేగంగా పరిగెత్తి-గట్టిగా వ్యాయామంచేసి ఎన్నాళ్ళ అయిందో-ఆ సైనికుడు-యోజిత రాజసౌధాన్ని ముట్టడించిందనే వార్తవినగానే వాడికి గుండె దడదడలాడింది. తర్వాత ప్రభువుకు ఆ వార్త చేరవేయాలని గబగబా మెట్లెక్కేసరికి పూర్తిగా అలుపొచ్చి కూలబడిపోయాడు.

ఇలాంటి సామంతుని కొలువులో పనిచేసే సైనికులకు మాత్రం పని ఏముంటుంది....? అందినంతమేర ప్రజాధనం మేసి, మిగిలింది ప్రభు

వుకు చెల్లిస్తారు. ఉష్ట్రశాలలో ఒంటెలు మేస్తుంటాయి, రాజసౌధంలో సైనికులు మేస్తుంటారు. వేరేపని అక్కడ ఎవరికీ ఏమీలేదు....

ఒంటెలు మేతమేసి నెమరవేస్తున్నంత హాయిగా అలా కాలం సాగిపోతుండగా, ఆ అర్ధరాత్రి-ఆ సైనికుడు ఏంచెయ్యాలో తోచక వెర్రికేక పెట్టి కూలబడ్డాడు! అలాగే పాకుతూ, అపసోపాలు పడుతూ తన ప్రభువు మందిరంలోనికి చేరుకున్నాడు-

ప్రభువు రహస్య కృత్యాలు జరిపే గదిలోకి అలా నేరుగా వచ్చెయ్యడం ఎంతనేరమో వాడికి తెలియకకాదు. కాని, అంతకన్నా ఎక్కువగా కొంపలంటుకుంటున్నాయి. అందుకే దేశరక్షణ కోసరం తన ప్రాణాలను తెగించి లోపలికి ప్రవేశించాడు-

మిశ్రదేశపు పడుచుల పల్చని శరీరాలను చుట్టుకొని పడున్నాడు తర్షి. అతని మైకం అంతత్వరగా వదిలేది కాదు.

సైనికుడు "ఫర్రో...." అంటూ పెద్దగా అరిచాడు.

ఆ అరుపుకు ఉలిక్కిపడిన పడుచులు గభాల్న లేచినిల్చున్నారు. వాళ్ళ శరీరాలమీదపడి నిద్రపోతున్న తర్షి శయ్యమీంచి దొర్లి అమాంతం నేలమీదపడ్డాడు.

నగ్నంగా నిలబడిన సుందరీమణులు భయంభయంగా తెరలచాటుకు వెళ్ళిపోయారు.

శయ్యమీంచి క్రిందపడిన తర్షి నడుం విరిగినట్లయి తన భారీ శరీరాన్ని సర్దుకొంటూ నెమ్మదిగా లేచికూర్చుని-ఏమైందిరా-అని కసురుకున్నాడు సైనికుడిని.

"త్వరగా లేవండి మహాఫర్రో...." అంటూ ఏడవడం మొదలు పెట్టాడు వాడు.

"ఒక రాక్షసి....ఒక రాక్షసుడు....అది తల్లి రాక్షసి- వాడు కుర్ర రాక్షసుడు....మనవాళ్ళమీద విరుచుకుపడ్డారు ప్రభో... కాసేపు మన భాషలో కాసేపు సింధూ ఆర్యుల భాషలో మిమ్మల్నీ మమ్మల్నీ అందర్నీ తిట్టి

పోస్తోంది తల్లి రాక్షసి! మిమ్మల్ని చంపిపారేస్తారుట వాళ్ళిద్దరూ....లేవండి ప్రభో...." అంటూ మొత్తుకున్నాడు వాడు.

ఆ సమాచారి మాటలకు ఉలిక్కిపడి కళ్లు విడుల్చుకున్నాడు తర్షి.

ఆయన కాళ్ళూ చేతులూ గడగడ వణకసాగాయి. సాక్షాత్తూ తన ప్రభువే అలా వణికిపోతుంటే ఇంక వాడి గతేమిటి?

తన వణుకును కప్పిపుచ్చుకొంటూ, కత్తిపుచ్చుకొని....“మేం వస్తున్నామని మనవాళ్ళందరికీ చెప్పు—”అన్నాడు తర్షి! ఆయనలా అంటుంటే అతని మాటలానే-చేతిలోని కత్తికూడా వణికిపోతోంది.

వణుకు కప్పిపుచ్చుకొని తననుతానుతమాయించుకొని, “మేళతాళాలు మ్రోగించమనిచెప్పు.ప్రభువు వెలుపలికివస్తుంటే ఏం చెయ్యాలో నీకు తెలియదా....మూర్ఖుడా....సైనికులందరినీ సౌధంలోపలికివచ్చి ద్వారబంధనాలు మూసేయమను....కదలవే....బుద్ధిలేదూ...." అంటూ అదిలించాడు వాణ్ణి.

“సైనికులెవరూ లేరండీ! ఉన్నవాళ్ళలో సగంమంది చచ్చారండి-చావడం చేతకానివాళ్ళు పారిపోయారండి....వచ్చినవాళ్ళు మాయలు నేర్చిన రాక్షసులండీ...." అన్నాడు వినయంగా సమాచారి.

ఆ మాటలు వింటూనే 'తర్షి' నరాల్లోంచి పోటుపుట్టుకొచ్చింది.

“అక్కడెవరైనా మిగిలివుంటే వాళ్ళకే చెప్పరా!నేనున్నాను భయం లేదని...." అన్నాడు వణుకుతూనే తర్షి. “మనిషైతే ఎదుర్కోవచ్చురా కాని, మాయలు నేర్చిన రాక్షసులను ఎదుర్కోవడం ఎట్లా....?" అని సన్నగా గొణిగాడు.

“రాక్షసులంటే నిజంగా రాక్షసులు కారండి....మనుషుల్లానే వున్నారండి....ఎడాపెడా నరికిపారేస్తున్నారండి మనవాళ్ళని...." అని వాడు వివరిస్తుంటే తర్షి గొంతు పూడుకుపోయింది-సైగజేసి అడుగుతున్నాడు-

“........??”

ఎవరో వాళ్లు తెలియదండి!

“........?”

వాళ్ళకి ఏం కావాలోకూడా నాకు అర్థంకాలేదండి!

"........?"

ఎందుకిలా చంపుతున్నారని ఎవరు అడగ్గలరండి?

"........?"

అవునండి! మీరొస్తేనే వాళ్ళిద్దరూ లొంగుతారండి!

"........!"

"అలాగేనండి. మీరు త్వరగా బయల్దేరాలండి! సైనికులు ఎవరూ కన్పించకపోతే, పోయి వెదికి పట్టుకువస్తానండి?" అంటూ పరిగెత్తాడు సహచారి.

తన మందిరం దాటి బయటకురాక తప్పిందికాదింక తర్షికి!

మందిరం వెలుపల తన సౌధంచుట్టూ జనప్రవాహం. ..

తర్షిని చూస్తూనే వాళ్ళు పెద్దపెట్టున అరిచారు.

వాళ్ళను అదుపుచేయగల సైనికుడెవడూ అక్కడ మిగిలిలేడు!

"ప్ర...,జ...లా....రా....మీ మీ మీ రం-తా భయపడకం....డి.... నేన్నే ..న్నేను...." అంటూ ఏదో చెప్పబోయాడు—తాను అలవాటులా ఉపన్యసించే వేదికపైన నిలబడి.

కాని, అతని శరీరం వణికిపోతోంది, గొంతు పెగలడంలేదు. వెన్నులోంచి కత్తితో పొడిచినంత బాధపుడుతోంది.

అతని ఆ దురవస్థనిచూసి బిగ్గరగా నవ్వి, సింహగర్జన చేశాడు అసమంజసుడు.

అదిరిపోయాడు తర్షి ....

ఎత్తయిన ఒంటెనెక్కి ఏడడుగుల పొడవైన కొరడా చేత పుచ్చుకొని, ఆ జనవాహినిలోంచి వేదికపైకి దూసుకువచ్చాడు అసమంజసుడు.

కొరడా గిర్రున తిరిగింది.

కొరడా చివరలు 'తర్షి' మెడకు కాళనాగులా చుట్టుకున్నాయి.

ఛడేల్‌మని మ్రోగింది అతని శరీరం.

ఎవరూ 'తర్షి'కి ఆసరాగా వచ్చిన పాపానపోలేదు.

కొరడా దెబ్బలకు క్రిందపడి. నేలమీద పిల్లి మొగ్గవేసి, హాహారవం చేశాడు తర్షి.

"చూస్తారేమిట్రా....వాడు అలా కొడుతుంటే....పట్టుకోండీ...." అని అరిచాడు.

జనం ఘొల్లుననవ్వి చప్పట్లు చరిచారు.

సింహగర్జన చేశాడు అసమంజసుడు-

"ఇవి దెబ్బలుకావురా....అనంతమైన ఈ జనవాహిని ఇన్నాళ్ళూ పెట్టిన పెడబొబ్బలు.

ఇరవై ఏళ్ళుగా ఈ ప్రజల్ని వేధించుకుతిన్న నీ పాపానికి ఈ మహా జనం ఇచ్చిన శాపాలురా... ఇవి ...

ఇప్పుడు నిన్ను కాపాడాలని ఎవరూ ఎందుకు ముందుకు రాలేదో అర్ధంఅయిందా....

వీళ్ళందరూ నువు తక్షణంచావాలని కోరుకుంటున్నారు...."అంటూ హూంకరించాడు అసమంజసుడు!

"వద్దు-వద్దు-నన్నొదిలెయ్-" అంటూ కొరడా దెబ్బలు తగలకుండా ఒంటెకు వెనకవైపు నక్కి-నక్కి, ఒంటెనే అంటుకుని కదులుతున్నాడు తర్షి!

ఒంటె గుండ్రంగా తిరుగుతోంది.

ఒంటెతోపాటే గుండ్రంగా తిరుగుతున్నాడు తర్షి.

శపించిన మహర్షిలా-

దండించిన దేవతలా

విడిచిపెట్టిన భార్యలా

ఒకేఒక తన్నుతన్నింది ఆ ఉష్ట్రరాజం!

బలమైన ఆ ఒంటె పాదఘాతానికి ఎగిరి యోజిత పాదాలమీద పడ్డాడు తర్షి-

నెత్తురు కక్కుకుని ఆమె పాదాలమీదే ప్రాణాలు వదిలాడు.

అసమంజసుడు వర్ధిల్లాలనే జనఘోషతో ఆకాశందద్దరిల్లిపోయింది-

బ్రాహ్మీ ముహూర్తం—

మిశ్రదేశ వైభవం ఈ పవిత్ర ముహూర్తంలో నూతన వ్యవస్థని నిర్మించుకునేందుకు సమాయత్తమయింది!

ఇది వశిష్టుడు పెట్టిన ముహూర్తంకాదు-

విశిష్టులైన ప్రజలు నిర్ణయించింది-

సరిగ్గా ఇదే ముహూర్తానికి ఉర్ముఖుడుయువరాజుగా పట్టాభిషిక్తుడౌతున్నాడు....

రెండు చక్రాలు కల్గిన రథం ఋజుమార్గాన ప్రయాణిస్తోంది-

ఏ ఒక్క చక్రంకూలినా రథం ఆగిపోతుంది—

ఆ రథాన్ని ఆపాలనే భీష్మించుకున్న శక్తులు ఎంతవరకూ విజయం సాధించగలవో.... కాలమే నిర్ణయిస్తుంది.

కానీ, ఆ సరికే చాలా ఘోరాలు జరిగిపోవచ్చునేమో....!

# 9

మిశ్రదేశపు రాజమాత రాయబారిగా అయోధ్యానగర వాకిటిలో నిలబడి, తన అనుమతికోసం వేచివుందన్న వార్త సముద్రమథన సమయంలో అమృతమయమయిన సంపద దొరికిందన్నంత చల్లగా చెవులకు సోకింది.

సగౌరవంగా- సమున్నతంగా- సాదరంగా ఆహ్వానించాడాయన సగరుడు. రాయబారిగాకాదు- కేవలం తన 'యోజిత'గానే.

అంతకు మునుపటి ఆర్యవస్త్రధారణలేదు. కౌశేయదేశపు పట్టు చీరెలులేవు. సింధూ సంస్కృతికి చిహ్నమైన ఆభరణాలులేవు. కస్తూరీ తిలకమూలేదు. బంగారు పట్టుదట్టీ లేదు.

మూర్తీభవించిన మిశ్రదేశపు జాతీయతను తొణికిస్తోంది యోజిత.

ఆమెను చూసి ఆశ్చర్యపోయాడు మహాసగరుడు.

రాచరికపు ఆడంబరాలన్నీ విసర్జించి, సామాన్య మానవుడిలా వంటరిగా కూర్చుని తనలో తనే కుమిలిపోతున్న ఆ చక్రవర్తిని ఆ స్థితిలోచూసి ఆమె గుండె గతుక్కుమంది.

"ప్రభూ!...." అంటూ ఆయన పాదాలమీదపడి కన్నీటి పర్యంతం అయిందామె.

"యోజితా....!" అన్నాడు లాలనగా సగరుడు.

తపోదీక్షలో ఉన్న 'ఋషి'లా పద్మాసనంలో కూర్చున్న ఆ మహనీయుడు యోజితను చూడగానే, కోల్పోయిన పై భవాన్నంతా సముపార్జించుకున్నంత సంబరంగాలేచి ఆమె కరస్పర్శ చేయబోయాడు.

ఆమెతో ఎడబాధం కొన్ని నెలలే అయినా, కొన్ని యుగాలు గడిచినట్లున్నదాయనకు!

"క్షమించండి మహాప్రభు! మిశ్రదేశపు రాయబారిగా మీ దర్శనం కోసం వచ్చాను-" అన్నది యోజిత కొంచెం దూరంగా జరుగుతూ!

మిశ్రదేశంలో అసమంజసుని తిరుగుబాటు సమాచారాన్ని రాజ్యసభ తీవ్రమైన విషయంగా పరిగణించింది. వెంటనే తీసుకోదగు చర్యల గురించి మహర్షులు యోచిస్తున్నారు. అసమంజసుని స్వయంగా వచ్చి ప్రభువులకు లొంగిపొమ్మని ఆదేశించారు. లేకపోతే, జరగనున్న పరిణామాల గురించి హెచ్చరించారు. కాని, అసమంజుడు రాలేదు రాయబారిగా మాత్రమే తాను వచ్చినట్లు ప్రకటించుకొంది యోజిత.

ఆమెను ప్రేమగా దగ్గరకు తీసుకోబోయినవాడల్లా, అల్లంతదూరానే ఆగిపోయాడు-

"మానబోయే గాయాన్ని రేపడానికి వచ్చావా యోజితా....? మళ్ళీ నాకెందుకు కన్పించావ్-కన్పించికోల్పోయిన ఆశల్ని ఎందుకు రేపెట్టావ్-అంతలోనే ఎందుకు జరిగిపోతున్నావ్.... ఎంత దయలేనిదీ.... మీ స్త్రీ జాతీ....?"అంటూ తలపక్కకు తిప్పుకొని కన్నీటిమయం అయిపోయాడు-

అంతలో సాగర గంభీరంగా మారిపోయి- "రాయబారీ" అన్నాడు- రివ్వున వెనక్కు వెళ్ళి తన ఆసనం మీద కూర్చుని- "రాయబారీ! నువ్వు చెప్పదలచింది చెప్పుకోవచ్చు!" అన్నాడు.

ఎదురుగా ఉన్న ఆసనంపైన కూర్చోమని ఆమెను కోరలేదు.

"ప్రభూ! మిత్రదేశంలో స్వతంత్ర రాజ్యాన్ని వ్యవస్థాపించిన మన చిరంజీవి అసమంజుని ఆశీర్వదించండి" అన్నది మహాసగరుని పాదాలను స్పృశిస్తూ యోజిత దుఃఖాన్ని దిగమింగుకొంటూ-

"రాయబారీ!" అంటూ బిగ్గరగా అరిచి తన పాదాలను వెనక్కు లాక్కున్నాడు సగరుడు. "వాడు- రాజ్యభ్రష్టుడు- వాడికి దేశబహిష్కరణ శిక్ష విధించింది నేనే. ఉర్ముఖుడికి పట్టాభిషేకం చేసింది కూడా నేనే." అన్నాడు గంభీరంగా.

"ప్రభూ!" అన్నది వినయంగా యోజిత. "అసమంజసునికి వారసత్వంగా సంక్రమించవలసిన సింహాసనాన్ని మీరు తిరస్కరించి ఉండవచ్చు....!కాని,మిశ్రదేశీయులైన ప్రజల ఆమోదంతో,స్వశక్తితో,స్వయంగా పట్టాభిషిక్తుడయిన ఆ వీర కుమారుని ఆశీర్వదించడం మీ ధర్మం ప్రభూ! ఆనాడు జిగీషిని మీరు ఎలా వధించారో .... ఈనాడు అంతకన్నా దుర్మార్గుడైన 'తర్షి'ని అసమంజసుడు అలాగే వధించాడు. వాడు తండ్రికి తగ్గబిడ్డ.

తండ్రి పేరు నిలబెట్టిన మీ బిడ్డని మన్నించి ఆశీర్వదించండి ప్రభూ...." అని వేడుకుంది యోజిత-

అంగీకరించలేదు మహాసగరుడు.

"రాయబారీ! రాజ్యసభ నేరస్తునిగా ప్రకటించిన వాడిని నేను మన్నించడం జరగదు. రాజ్యసభా నిర్ణయమే తుది నిర్ణయం- మీరు చెప్పుకోదలచింది రాజ్యసభలో చెప్పుకోండి" అన్నాడు.

ధారాపాతంగా పొంగిపొరలుతున్న తన కన్నీటిని కనపడనీయకుండా ఆయన ముఖం చాటుచేస్తున్నాడని యోజిత గమనించలేదు. అది సగరుని దురదృష్టం!

"ప్రభూ! అసమంజసుడు మీ పుత్రుడు! శత్రువు కాదు! అతను చేసిన అపచారాలు మీమీద గౌరవంతోనే గానీ, మీకు వ్యతిరేకంగా కాదు- మీ సామంతుడిగా బతుకుతూ, మీ పేరుచెప్పి ప్రజల్ని పీల్చి పిప్పిచేస్తున్న ఒక దుర్మార్గుణ్ణి- కేవలం మీ పేరు నిలబెట్టడానికే వధించాడు. అసమం

జనుని ఆలోచనలను పక్రీకరించకండి! దయచేసి, వాడి గుండెకోతని అర్థం చేసుకోండి....! వాడు లోపల ఎంత కుమిలిపోతున్నాడో గమనించండి- వాడికి మీ రాజ్యం అక్కరలేదు....మీ సింహాసనమూ అక్కరలేదు. వాడికి కావలసింది మీనుంచి "నాయనా....!" అన్న కమ్మని పిలుపు- అదొక్కటి ప్రసాదించండి చాలు...." అంటూ వెక్కి-వెక్కి ఏడ్చింది యోజిత.

యుగాలు ఎన్ని గడిచినా మహాసాగరం తన రుచిలోని లావణ్యాన్ని మార్చుకోదు.

వసంతాలు ఎన్ని నడిచినా సృష్టి తన పరిణామ శీలాన్ని నిలుపుకోదు.

సంఘటనలు ఎన్ని జరిగినా అనంతకాల వాహిని ప్రవహించక ఆగదు.

ఇంత నిశ్చిత ధర్మంతో ప్రకృతి అచంచలమై, సుస్థిరమై సువ్యవస్థితమై సాగుతున్నప్పుడు.... తన స్వార్థంకోసం, తన పుత్రునికోసం, తన కుటుంబంకోసం తన ఆదర్శాన్ని తానెందుకు మార్చుకోవాలి....తానెందుకు స్వార్థపరుడిగా మారిపోవాలి....తానెందుకు ఎవరికి లొంగిపోవాలి...

"రాయబారీ! దయా, ధర్మంలేని మృగంలా ప్రవర్తించాడు అసమంజసుడు. ప్రజాతంత్ర వ్యవస్థ ప్రవేశ్యానుకొంటున్న దశలో బానిసత్వాన్ని పెంచిపోషించాలనే వ్యక్తిని మిశ్రదేశానికే కాదు- ఒక చిన్న గ్రామానికో, గణానికో కూడా అధిపతిగా అంగీకరించను. వాడు నా పుత్రుడు కాదు- నిస్సంశయంగా నా శత్రువే!

రాజులంతా అసమంజునిలా విజ్ఞానవేత్తలను హింసించడమే జరిగితే... రాయబారీ! మహర్షులు సహస్త్రారసుకోవద్దు... వారు ఒక చేతితో శాపాన్ని, మరోచేతితో శరాన్ని సంధించగలరు.

అర్థబలం, అంగబలం ఉన్నది కదాని అహంకరించడాన్ని నేను అనుమతించను.

అయినా సమయం మించిపోలేదు-

ఇప్పటికయినా వాడు పరివర్తన చెంది, రాజ్యసభలో పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తే మిత్రదేశాన్నే ఏమిటి... నా సార్వభౌమత్వాన్నే ధార పోస్తాను" ఆవేశంగా అన్నాడు సగరుడు.

యోజిత అసహనంగా నవ్వింది.

"మహాచక్రవర్తీ! మీ అంశన పుట్టినవాడు- మీ అంతటివాడు అసమంజసుడు. వీరుడు అవమానాన్ని సహించడు. లొంగుబాటు ఎన్నటికీ ప్రకటించడు ప్రభూ..." అన్నది స్థిరనిర్ణయంగా!

"రాయబారీ!" అని బిగ్గరగా అరిచాడు సగరుడు.

"యుద్ధభయంలేక నిశ్చింతగా బ్రతుకుతున్న ప్రజలమధ్య సంఘర్షణలు సృష్టించాలనుకుంటున్నారా... మీ తల్లీ కొడుకులు ? అలా ఎన్నటికీ జరగనివ్వను..." అని రౌద్రంగా చూస్తూ 'ఎవరక్కడ' అన్నాడు- రెండు చేతులతో చప్పట్లుకొట్టి.

ఇద్దరు సేవకులు పరుగున లోపలికి వచ్చారు.

"చూస్తారేం...? ఈ రాయబారిని బంధించండి—" ఆజ్ఞాపించాడు సగరుడు.

తన కళ్ళలో సుళ్ళు తిరిగిన నీటిని బైటకు కనపడనీయరాదన్న ప్రయత్నంలో ఆ సగరుడు విఫలమయ్యాడు.

వాటిని గమనించినా సేవకులిద్దరూ చేయగల్గిందేమీలేదు.

గమనించని యోజితకు ఆయన మనోవ్యథ అర్థంకాదు!

* * * *

సర్వాలంకార శోభితుడై సకల భూమండలాన్ని తన కరుణాకటాక్ష వీక్షణాలతో పాలించే మహాప్రభువు.... సమ్రాట్ సగరుడు రాజ్యసభలో ప్రవేశించాడు!

స్వయంరాజా.... స్వరాట్సమ్రాట్.... అంటూ వందిమాగదులు కీర్తిస్తూ ఉండగా— సగర చక్రవర్తి సభా ప్రవేశం చేయగానే, ఆయన గౌరవార్థం రాజ్యసభలోని మహాసీయులందరూ లేచి నిల్చున్నారు.

"ఓం రాజా రాష్ట్రీనాం పేశో నదీనా మను త్తమస్మై క్షత్రం విశ్వాయు-
అంటూ ముక్తకంఠంతో విజయధ్వానం చేశారు మహర్షులు.
వివిధ దేశాలకు రాజైన వీరాధివీరా....
నదీనదాలకు రూపప్రదా....
క్షాత్రబల సంపన్నా....
శత్రునాశకా....
సమస్త భూమండల సంచారా....
మహావీరా....
సాక్షాత్ వరుణ స్వరూపా....
సగర చక్రవర్తీ....

జయహో.... జయహో...." అని జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టుతుండగా.... మహాసగరుడు తన మయూర సింహాసనంవద్ద నిలబడి, రాజ్యసభకు నమస్కరించి, ఆసీనుడైనాడు.

ప్రభువుతోపాటే సభాసదులందరూ తమ తమ ఆసనాలలో కూర్చు న్నారు.

యోజితను బంధించి పదిమంది సాయుధులైన పరిచారికలు సభలోకి తీసుకువచ్చారు. తలవంచుకుని నిల్చొనుంది యోజిత. ఆమె కుడి కాలి బొటనవ్రేలు నేలకు రాస్తూ అరణిని సృష్టిస్తోంది. అగ్నిజ్వాలలా మండిపోతోన్నదామె!

మహాచక్రవర్తి సభాధ్యక్ష స్థానంలో కూర్చుని ఉన్నాడు.
యువరాజు ఉర్ముఖుడు ఉప సభాపతి
పురోహితుడు వశిష్ఠుడు సభా నిర్వాహకుడు,

బ్రహ్మర్షులూ, సర్వ విద్యాకోవిదులూ, శాస్త్రజ్ఞులూ అయిన ముని పుంగవులు ఒకవైపు కొలువుతీరి ఉన్నారు.

సామంత భూపతులు, సైన్యాధిపతులు, గ్రామణులు, పురాధీశులు, కులపతులు వేరొకవంక నేర విచారణను ఆసక్తితో గమనిస్తున్నారు.

మిశ్రదేశాన్ని ఆక్రమించి, 'తర్షి 'సామంతుని హత్యచేసిన నేరాన్ని విచారణ ప్రారంభించింది రాజ్యసభ.

అసమంజసుడూ, యోజితలపై నేరారోపణ చేసి వారికి తగిన దండన విధించవలసిందిగా సభను అభ్యర్థించాడు వశిష్ఠమహర్షి!

ముందుగా ఈ నేరానికి సంబంధించి సమాధానం చెప్పుకోవడానికి యోజితకు అవకాశం ఇచ్చారు.

యోజిత తృణీకార ధోరణిలో ప్రసంగించడం ప్రారంభించింది-

"అవినీతిని కప్పిపెట్టి, ప్రభువును మభ్యపెట్టి, ఈ రాజ్యసభ విచారణ చేయగలదేమో....గాని, అది న్యాయవిచారణ మాత్రం కాబోదు. తమకు తోచినదే న్యాయమనుకునే వారికి నేను చెప్పవలసిందేమీ లేదు. చెప్పినా ప్రయోజనంలేదు కాబట్టి....!" అని రాజ్యసభని ధిక్కరించింది యోజిత.

ఆమె మాటలకు ఉగ్రుడై తీక్షణంగా ఆమెవంక చూశాడు సగరుడు.

యోజిత తలఎత్తి ఆయనను చూడలేదు. చూడదు కూడా!

"సరికాదు···· యోజితా....!" అంటూ బిగ్గరగా అరిచి-, "మహా మహిమాన్వితులు ఆసీనులైన ఈ సభను అవమానించిన నీకు శిక్ష ఏమిటో తెలుసా....?" అంటూ వశిష్ఠుడు ఆగ్రహంగా లేచి నిల్చున్నాడు.

ఆయనవంక నిర్లక్ష్యంగాచూసి అసహ్యించుకుంటున్నదానిలా తల పక్కకు తిప్పుకొంది. ఆమె అసహ్యం కేవలం వశిష్ఠునిమీదే కాదు- మొత్తం మహర్షి వ్యవస్థనే ఆమె ఛీకొట్టింది!

ఇన్ని సంవత్సరాల ధర్మపాలనలో ఈ సభలో దోషాల్ని ఎత్తి చూపించిన సందర్భాలు ఎప్పుడూలేవు... ఇది కాల వైపరీత్యం...." అను కొంటున్నారు సభాసదులు.

రాజుకు ప్రత్యేకత లేవేవో ఉండాలంటూ, అవిలేవని అసమంజసు నికి రాజ్యాధికారం లేకుండా చేశారే.... మహర్షులారా.... మీకు లొంగి పోయిన ప్రతి అర్భకుడినీ సామంతుడిగా ప్రకటించేప్పుడు వారికి ఆ ప్రత్యే కతలు ఎన్ని ఉన్నాయో ,, ఒక్కసారైనా ఆలోచించారా. ..? అని ప్రశ్నించింది యోజిత!

"ఇది అప్రస్తుత ప్రసంగం" అన్నాడు కోపంగా వశిష్ఠుడు.

"పాపు! అత్యవసర ప్రసంగమే! ఎక్కడో అయోధ్యలోనో, మరో చోటో కూర్చుని, ప్రపంచం అంతా సుభిక్షంగా ఉందని ప్రభువునీ, ప్రభుత్వాన్నీ నమ్మించే మహర్షులారా... మీలో ఎవరైనా మిశ్రదేశం వెళ్ళారా.... పోనీ- వశిష్ఠ మహాశయా.... కనీసం మీరైనా ఆ దేశాన్ని ఎప్పుడైనా చూశారా.... ఒక్కసారి చూడండి.... అక్కడ అస్థిపంజరాలు నడుస్తున్నాయి. చేసేందుకు పనిలేక, తినటానికి తిండిలేక మనుషులు ఎముకల పోగులయ్యారు- అక్కడ మచ్చుకైనా పంటలు పండవు. పండినా నీలానది వరదల్లో కొట్టుకుపోతాయి- సప్తసింధులో ఇన్ని కాల్వలు తవ్వారు- అలాంటిది మిశ్రదేశంలో ఒక్కటికూడా లేదు.

మా ప్రజలు ఏ పాపం చేసుకున్నారని ఈ సుఖాలకు నోచుకో లేదు....?

కేవలం మిమ్మల్ని, మీ సార్వభౌమత్వాన్ని ఆమోదించడమేనా.... మేం చేసుకున్న దురదృష్టం....!!

మా ప్రజలుకూడా మీ ఏలుబడిలోని వారే, అయినా మీరెందుకు మమ్మల్ని ఉపేక్షించారు....? ఆకలితో అలమటించే లక్షలాది మిశ్ర దేశీయుల పక్షాన మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను—

చెప్పండి!

మాకీ దుస్థితికి కారణమైన ఈ రాజ్యసభ తనకు తాను ఏ శిక్ష విధించుకొంటుంది....?

మమ్మల్ని అన్యాయం చేసిన సార్వభౌముడు మా ప్రజలకు చెల్లించే పరిహారం ఏమిటి... ?" అని మహోద్వేగంగా ప్రసంగిస్తూ రాజ్యసభనే నిలదీసింది యోజిత!

"చూడమ్మాయీ....?" అంటూ లేచి ఏదో చెప్పబోయాడు వశిష్టుడు!

ఉగ్ర నేత్రాలతో రౌద్రంగా చూసింది ఆయన వంక!

పాలనా వ్యవహారాలలో అవకతవకలకు ప్రధాన బాధ్యుడు పురోహితుడే. అందుకే వశిష్ఠునిపట్ల అంత ఏహ్యభావాన్ని ప్రదర్శించింది యోజిత!

"ప్రహస్వదృష్టితో మీరందించిన తోడ్పాటును అడ్డుపెట్టుకుని, మిశ్ర దేశవాసులను చీకటిపాలుజేసిన ఆ 'శక్తి' అయోగ్యుణ్ణి ప్రజల కోరికమీద, ప్రజల సమక్షంలో, ప్రజల ఆనందోత్సాహాల మధ్య అసమంజుడు వీరోచితంగానే వధించాడు గాని, మీరు ఆరోపించినట్లు పిరికిపందలా అర్ధరాత్రి నిద్రిస్తున్న వాడిని హత్యచేయ....

మా మిశ్రదేశంలో ఇప్పుడు జరిగినది బానిసల తిరుగుబాటు-

ప్రజాక్షేమాన్ని కోరే ఎవరైనా, బానిస బంధాలు తెంచుకొని ప్రజలు సుఖ శాంతులు పొందాలని కోరుకుంటారు-

అసమంజసుడు దానిని సాధించాడు- మీరు దానిని వ్యతిరేకిస్తున్నారు— ఇంతకంటే నేను చెప్పేదేమీలేదు-" అన్నది యోజిత!

"ఈ రాజ్యసభ అప్రజాస్వామికంగా వ్యవహరిస్తోందంటావా?" కోపంగా అడిగాడు వశిష్ఠుడు!

"అది ఎవరికి వారు ఆత్మపరిశీలన చేసుకుని నిర్ణయించుకోవలసిన విషయం...!

ప్రజాస్వామ్యవాదులెవరైనా మా చర్యను హర్షిస్తారు—

మా జాతీయతను గౌరవిస్తారు.

మా నాగరికతను అంగీకరిస్తారు-

మా సంస్కృతిని ఆదరిస్తారు-

మా ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని ప్రజాస్వామ్యం ముసుగులో ఖండించాలని చూసే మీ మహర్షులు అప్రజాస్వామికంగా వ్యవహరించడం లేదని అనుకుంటున్నారంటే.... ఇంతకంటే సిగ్గుపడవలసిన అంశం ఇంకోటిలేదు. అంది యోజిత!

మహర్షులెవరూ మాట్లాడలేదు.

సామంతుల యోగ్యతను పునఃపరిశీలన చేయాలని ఆమె అంటున్నప్పుడు అదే సభలో కూర్చుని ఉన్న కొందరు భుజాలు తడుముకోవడం స్పష్టంగా కన్పించింది.

ఏమైనా- ప్రభువుల అధికారంమీద చేయిచేసుకునే అవకాశం ప్రజలకు ఉండకూడదని మహర్షులు శాసిస్తే బావుంటుందని ఆశగా చూస్తున్నారు

మహాసగరుడు మౌనంగా వశిష్ఠుని వైపు తిరిగి, కళ్ళతోనే ఏదో సందేశం అందించాడు. అర్థంచేసుకున్నవాడిలా తల పంకించాడు వశిష్ఠుడు.

వెంటనే ఆవేశంగా లేచి నిల్చుని-

"ఈ సభ దోషిగా ప్రకటించినప టికీ, తన తప్పిదాన్ని అంగీకరించడంగానీ, పశ్చాత్తాప పడడంగాని చేయకుండా, ఈమె వ్యర్థ ప్రసంగంతో తనకిచ్చిన అవకాశాన్ని దుర్వినియోగపరచుకొంది. ఇంక ఆమెను ముగింప చేయవలసిందిగా సభను అభ్యర్థిస్తున్నాను-" అన్నాడు.

ఆ తర్వాత "తక్షి" సామంతుని కుమారుడికి అవకాశం ఇచ్చింది సభ-

తన తండ్రిని రాక్షసంగా హతమార్చి, తమ రాజ్యాన్ని అసమంజుడు ఆక్రమించాడనీ, వారసత్వంగా తన రాజ్యాన్ని తనకు అప్పగించమని సభను వేడుకున్నాడతను!

"తప్పకుండా నాయనా! నీకు జరిగిన అన్యాయం ఘోరమైనది. ఒకనాడు జిగీషిని బంధించాలని మహనీయులైన నీ పితృదేవులు యత్నించిన వైనం ప్రభువులవారికి ఇంకా గుర్తుంది. నీకు న్యాయం జరుగుతుంది-" అని బహిరంగంగానే అభయం ఇచ్చాడు వశిష్టుడు.

వశిష్టుడు చెప్తున్న మాటలు సాక్షాత్తూ సగర చక్రవర్తివేనని అక్కడున్న అందరికీ తెలుసు.

మహాసగరుడు నేరవిచారణలో ఎటువంటి జోక్యం చేసుకోనని వాడిలా మౌనంగా కూర్చున్నాడు.

కాని, న్యాయవిచారణను ప్రభావితం చేసేలా వశిష్టుడు మాట్లాడడాన్ని బుధమహర్షి అంగీకరించలేదు-

ఆయన చివాల్న లేచినుంచుని ప్రసంగించడానికి అనుమతి కోరాడు-

"కుమారా!" అని 'తక్షి' తనయునివంక చూస్తూ-"నువ్వు మాదీ మాదీ అంటున్న ఆ మిత్రదేశం మీకెక్కడికో చెప్పగలవా....మీ తండ్రిని

అసమంజసుడు పవిచించినట్లే, తలేవాపైన ఏకటిదెబ్బతీసి మీ తండ్రి అపహరించిన రాజ్యం అది....

వారసత్వమే ప్రధానం అయితే, 'తలేవా' రాజ్యాన్ని ముందుగా యోజితకు ప్రసాదించవలసి వుంటుంది.

రాజ్యసభ ఈ విషయాన్నికూడా పరిగణనలోకి తీసుకోనవలసిందిగా ప్రార్థిస్తున్నాను-" అన్నాడు బుధమహర్షి.

వయోభారం పూర్తిగా మీదపడినా, ఆయనలో వాదనాపటిమ కొంచెమైనా తగ్గలేదు.

బుధుని మాటలకు సగరుని నేత్రాలు అగ్నిహోత్రాలైనాయి.అయినా పట్టించుకోలేదు బుధమహర్షి!

వశిష్టుడు చిన్నగా నవ్వి-"మహనీయా! తర్షికి ముందు తలేవా-రాజు అనుకుంటే, ఆయనకు పూర్వం ఎవరో....ఇలా మనం 'మనువు' వరకూ వంశక్రమాలను త్రవ్వుకుపోవడం ధర్మంకాదు.

'తర్షి' మరణం సగరులవారి అభయంలో జరిగింది....ఇదే ప్రస్తుత విచారణాంశం...." అని బుధుని వాదాన్ని కొట్టివేశాడు వశిష్టుడు.

ఇలా వాదోపవాదాలతో సభ వేడెక్కిపోయింది.

రాత్రి ప్రొద్దుపోతోన్నా సభలో ఉద్రేకాలు చల్లారలేదు.

పరిస్థితిని గమనించిన మహాసగరుడు సభను ఆపేశకు చాలించి, మర్నాడు సమావేశమవడానికి నిర్ణయించేశాడు....తాత్కాలికంగా ఆవేశాలు చల్లారతాయని!

కాని, ఆ రాత్రి కాళరాత్రిగామారి మహాసగరునికి తీరని గర్భశోకం కల్గిస్తుందని అక్కడేవున్న ఒక్కడికితప్ప ఇంకెవరికీ తెలియదు.

ఆ ఒక్కడే మాయా ఋషి రూపానవున్న త్వష్టుడు.

అతనిని గుర్తించగలవారి కళ్ళలో అతను పడకపోవడం....త్వష్ట అదృష్టం!

సింధువుల దురదృష్టం!!

* * *

వస్తూ మహర్షి రూపంలో త్వష్ట చెప్తోన్న మాటలు వింటూ అతను చెప్పిందల్లా చేస్తున్నాడు అసమంజసుడు.

"మహర్షీ! బ్రాహ్మణుల మనస్తత్వాన్ని నేను విశ్వసించను. కానీ, మీరు నాపైన అవ్యాజమైన అనురాగాన్ని చూపిస్తూ నన్నెంతో ప్రోత్సహిస్తున్నారు. ఇంతకీ తమపేరు? మీకు నా కృతజ్ఞతలు ఏవిధంగా చెప్పుకోగలను....?" అని అడిగాడు అసమంజసుడు!

ఆర్యావర్తానికి వెలుపల అడవులలో అసమంజసుడు విడిదిచేసి, యోజితను రాయబారిగా రాజసౌధానికి పంపాడు. ఎట్టిపరిస్థితులలోనూ రాజసౌధంలోకి అడుగుపెట్టనని అతని పట్టుదల.

"నీకెంతో కావలసిన వాడినే నేను నాయనా! నీ వలెనే సింహాసనభ్రష్టుడినై, కండబలం, బుద్ధిబలం ఉండికూడా రాజ్యఫలం దక్కించుకోలేకపోయిన అభాగ్యుణ్ణి. నాదంతా పెద్దచరిత్ర! నా చరిత్ర నీ తల్లి యోజితకు తెలుసు. నీ తండ్రి సగరుడికి తెలుసు. ఆ వివరాలు నీకు తర్వాత చెప్తాను. నన్ను ప్రశ్నించడం ఆపి, నేను చెప్పినట్లు చెయ్యి- సమయం మించిపోతోంది...." అన్నాడు త్వష్ట.

అసమంజసుడు అయోమయంగా చూశాడు.

"రేపు విచారణలో నీ తల్లి యోజితకు మరణశిక్ష విధిస్తారు. నిజానికి, అది ఈరోజే జరిగి ఉండవల్సింది. కాని, కొద్దిలో ఆగింది. నువ్వెంటనే రహస్యంగా రాజసౌధంలోకి ప్రవేశించి, నీ తల్లి చెర విడిపించు...." అని తొందరచేశాడు త్వష్ట.

అసమంజసుడు ఏమీ మాట్లాడలేదు.

"ఇంతకుపూర్వం యోజిత తానుండే అంతఃపురం మందిరంలోనే ప్రస్తుతం బంధించబడి ఉందని గూఢచారి వార్తలద్వారా తెల్సింది. అంతఃపురంలో మరో ఆడదిక్కులేదు. ఇదే సమయం....లే....!" అన్నాడు మళ్ళీ.

అసమంజసుడు ఆయనవంక అదోలా చూశాడు.

ఏది ఎలా చెయ్యాలో ఆలోచించుకోనీకుండా ఇంత తొందర పెడతాడేమిటి ...అసలీయన ఎవరు...?ఆ విషయమే అడిగాడు ఇంకోసారి.

"నేనెవరో రేపు తెలుస్తుంది నీకు! కాని, ఇలా వ్యర్థ ప్రశ్నలతో తెల్లవార్లూ ఇక్కడే గడిపితే, రేపు నీ తల్లికి మరణదండన అమలు జరిగి పోతుంది. ప్రాణాలతో నీ తల్లి నీకు దక్కాలంటే, నువు వెంటనే ఆమెను తప్పించాలి. ఇది ఆలస్యం లేకుండా జరగాలి. ఇంక నేనెవరంటావా? నేను యోజితకు అయినవాడినే! ఒకప్పుడు ఆమెకు చాలా దగ్గర వాడిని కూడా.... సరేనా....?" అన్నాడు కొంత మందలింపుగా.

"బాపుంది! అమ్మ మీకూ నాకూ కావలసినదేకదా.... మనం మన బుద్ధిబలంతో రేపు సభలో ఎదురు నిలబడి వాదిద్దాం.... అప్పటికీ ఫలితం లేకపోతే ఉండనే ఉంది వీరఖడ్గం.... వీర ధనువూ....!! అంతేగాని, దొంగతనంగా అంతఃపురంలోకి దూరవలసిన అవసరం ఏముందీ....?" అని ఎదురుతిరిగాడు, అసమంజసుడు.

విషపునవ్వు నవ్వాడు త్వష్ట!

"కండ బలం, గుండెబలం లేని నీ తమ్ముడు నీ స్థానంలో యువ రాజు అయ్యాడు. నువు రాజ్యభ్రష్టుడి వయ్యావు ఇంకా నిన్ను పిలిచి రాజుని చేస్తారని ఆశ ఏదో నీలో ఉన్నట్లు అనిపిస్తోంది.... అత్యాశకుపోకు కుమారా...." అన్నాడు.

"రాజ్యం అనేది ఒకరిస్తే పుచ్చుకునే భిక్షకాదు. పౌరుషంతో సాధించుకోవల్సింది-" రోషంగా మీసం మెలివేశాడు అసమంజు!

"అది ఒకనాటి మాట! బలం ఉన్నవాడిదే రాజ్యం అనే రోజులు పోయాయి. మనుషులు నాగరకత మీరారు. ఇప్పుడు రాజకీయ పలుకుబడి ఉన్నవాడిదే రాజ్యం.... నువ్వీ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించినట్లు లేదు!" అని వ్యంగ్యంగా నవ్వాడు త్వష్ట.

ఈ కుటిల రాజకీయాలతో నిమిత్తంలేదు నాకు! అవసరం అయితే ప్రాణాలకు తెగించయినా పోరాడడానికి సిద్ధంగా ఉన్నాను మహర్షీ -"

"నువు ప్రాణాలకు తెగించనూగలవు - పోరాడనూగలవు - కానీ గెలుపు వారిదే అవుతుంది. ఎందుకంటే వారి వెనక మహర్షి వ్యవస్థ ఉన్నది-చరిత్రని కథలుగా చెప్పి కీర్తించేది వారే కాబట్టి!"

"కానీ, నా వెనక సైనికబలం ఉంది. నన్ను నాయకుడిగా ఎన్ను కున్న మిశ్రదేశ ప్రజల ఆదరణ ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే, వారి వెనక మహర్షులుంటే, నా వెనక ప్రజలున్నారు-" పౌరుషంగా అన్నాడు అసమంజసుడు.

'రాజకీయాల్లో ప్రజలూ- ప్రజాబలం అనే మాటలు- వాడించడానికి పనికివచ్చేవేగాని, విజయానికి నడిపించేవి కావు పుత్రా! అవన్నీ ఆటవిక కాలంనాటివి! మనం ఇప్పుడు పరిపూర్ణమైన నాగరకతలో బ్రతుకుతున్నాం!" అన్నాడు త్వష్ట.

"ప్రజలెంచుకున్నవాడికే అధికారాన్ని అప్పచెప్పకపోవడం నాగర కతా....? అనాగరకతా....?" రెట్టించాడు అసమంజసుడు.

"నిస్సందేహంగా అనాగరకతే. అందుకే, నువ్వు నాగరికుడివై రాజ కీయాలు నేర్చుకో- అంతే!" మందలిస్తోన్న ధోరణిలో అన్నాడు త్వష్ట.

"రాజకీయం అంటే, అర్ధరాత్రిపూట దొంగలా అంతఃపురంలో దూరడమా...,? ఏమిటిగోల....??" చిరాగ్గా అడిగాడు అసమంజసుడు.

"మిశ్రదేశ ప్రభువు తక్షని నిద్రపోయే వేళలోనే నువ్వు సంహ రించావని ఆరోపణ! అటువంటిదే ఇప్పుడు మరో శుభకార్యం చేస్తున్నా వంతే! నేరాలెన్నిచేసినా శిక్ష ఒక్కటే వెయ్యగలరు. ఆ శిక్షని ఎదుర్కో గల ప్రజాబలం, మనోబలం నీకున్నాయి.... ఇంక ఈ అర్థంలేని వాదనలు ఆపెయ్- పిచ్చి తర్కంతో రాజకీయాలకు బలి అవకు. నడు త్వరగా...." అంటూ రాజాంతఃపుర మార్గంలోకి బలవంతంగా నెట్టాడు అసమంజసుణ్ణి!

చేసేదిలేక, మరో మార్గాంతరమూలేక లోపలికి కదిలాడు అసమంజసుడు.

"నేను ఇక్కడే ఈ ఉత్తమజాతి అశ్వంతో సిద్ధంగా ఉంటాను. ఒక మహర్షి ఆమెకు రక్షగా ఉంటాడని చెప్పు- వెంటనే ఆమెను ఇక్క డకు పంపు! నువ్వు నెమ్మదిగా, జాగ్రత్తగా రా- నేను నీకోసం అడవిలో వేచి ఉంటాను. నీ తల్లికి నేను అభయం ఇస్తున్నాను-" అన్నాడు త్వష్ట.

జరగకూడనిది ఎప్పుడో జరిగిపోయింది- జరుగుతున్నవన్నీ దాని పర్యవసానాలే! ఒకదానివెంట ఒకటిగా తెరలు తెరలుగా ముంచుకొస్తున్న ఈ విపరీత పరిణామాలకు ముగింపులేదు-

జరగవలసింది జరగక మానదు- జరగకూడదనుకోవడం అవివేకం. కాలచక్రం వెనక్కి తిరిగేదికాదు!!

*　　　*　　　*

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥

బుధ మహర్షి తన మందిరంలో ఏకాంతంలో కూర్చుని, మనసు శాంతిల్లడంకోసం ఆధ్యాత్మిక తత్త్వాన్ని అధ్యయనం చేస్తున్నాడు.

సున్నితమైన హృదయాలు ఉద్వేగాలకు లోనైనప్పుడు అతిలోక భావనలు మనసును తేలికపరుస్తాయేమో....!

"పుష్ప ఫలభరితమైన ఒక వృక్షం ఉంది! దానిమీద చక్కని పక్షులు రెండు కూర్చున్నాయి.

రెండు పక్షులూ పుష్టిగలవే! రెండూ ఉత్తమమైనవే.

గూడుపెట్టడం దగ్గర్నుంచీ, రెక్కలు విచ్చుకుని యోజనాల దూరం అమాంతం ఎగరడం వరకూ ఒకదాన్ని మించినది మరొకటి....!

రెండూ ఒకేచెట్టుమీద కూర్చున్నాయి-

కాని, రెండింటి అదృష్టాలూ ఒకలా లేవు.

ఒక పక్షి- కమ్మగా పండిన ఆ చెట్టు ఫలాలను ఆరగించి, వాటి మాధుర్యాన్ని అనుభవిస్తోంది హాయిగా-

రెండవ పక్షి- ఈ చరాచర సృష్టి సమస్తానికీ తానే సాక్షినన్నట్లు ఏమీ తినకుండా అలానే చూస్తూండిపోయింది...." అనే అర్థం వచ్చే ఆ ఋక్కులోని భావాన్ని తనచుట్టూ జరుగుతున్న వాస్తవికతకు అన్వయించుకుని విశ్లేషించుకొంటున్నాడాయన!

పుష్పఫల భరితమైన ఆ మహావృక్షం లాంటిదే ఈ మహాసామ్రాజ్యం!

అసమంజ, ఉర్ముఖులిద్దరూ ఆ రెండు పక్షులు!

కాని, ఒక పక్షి- సామ్రాజ్య ఫలాల్నీ, ఫలితాల్ని హాయిగా ఆరగిస్తోంది.

మొదటి పక్షి వాటికి దూరమైపోయింది.... అసమంజా.... కర్మసాక్షిగా మిగిలిపోయావా నాయనా....." అని చింతించసాగాడు బుధమహర్షి! ప్రధాన రాజకీయ స్రవంతిలోకి అసమంజసుని తీసుకురావాలనేది ఆయన తపన! కానీ, అసమంజసుడు తన అకారణ బ్రహ్మద్వేషాన్ని వదులుకోనిదే తానుగా ఏ చర్యా తీసుకోలేడు!!!

అనంత ఐశ్వర్యాలు నిండిన ఈ సామ్రాజ్య వైభవ వైభోగ నిర్మాణానికి ఆదినుంచీ నేటి వరకూ మిగిలిన ఏకైక సాక్షి ఆయనే!

అందరూ ఎవరి వారిన వారు పరలోకాలకు మార్గాలను వేసుకున్నారు-

"చివరికి మిగిలింది నేనే! జీవాత్మ కర్మఫలాన్ని భుజిస్తాడనీ పరమాత్మ కర్మసాక్షిగా మిగిలిపోతాడనీ మహనీయులు చెప్పారు- ఉర్ముఖుడు, అసమంజసుడు జీవాత్మ పరమాత్మలే! ప్రాణంలేని కట్టెగా మిగిలింది నేనే!!" అనుకొన్నాడు బుధమహర్షి!

విషాదానికి, దరహాసానికీ ఒకేలా ప్రతిస్పందించగల స్థితప్రజ్ఞుడు- బుధమహర్షి కూడా రాజాంతఃపురంలో ఒకదాని వెనక ఒకటిగా జరిగిపోతున్న సంఘటనలకు తట్టుకోలేకళ్లల్లి డిల్లిపోతున్నాడు.ఆయన స్థితప్రజ్ఞత సన్నగిల్లిపోయింది. పసిపిల్లవాడిలా రోదిస్తున్నాడాయన!

అసమంజసుని ధోరణిలోంచి ఆలోచించిచూస్తే, అతను చెప్తున్న దానిలోగాని, చేస్తున్న దానిలోగాని దోషం కన్పించ లేదాయనకు!

జనతంత్ర వ్యవస్థని నిర్మించడంలో మహా సగరుని ప్రేరేపించి, అందుకు కావలసిన సాయాన్ని అందించింది తానే! కాని, ఆ వ్యవస్థలో ఇన్నాళ్ళుగా ప్రేళ్ళూనుకున్న లోపాలను కనుగొనడంలో తాను పూర్తిగా విఫలమయ్యాడు. అందుకు శిక్ష అసమంజునికో- యోజితకో విధించడం అన్యాయం" అనుకున్నాడు బుధమహర్షి!

చెట్టుమీద పక్షుల కథలో ఆధ్యాత్మిక భావనని విశ్లేషించుకుంటున్న దొద్దీ ఆయన మనోవేదన ఉపశమించ సాగింది.

సభలో ఈరోజు యోజిత చేసిన వాదన గొప్పగా ఉంది. నిజమే! ప్రభుత్వాన్ని నడుపుతున్నవారు తమ తప్పులను కప్పిపుచ్చుకోవడానికి ఇతరులమీదకు నేరాన్ని నెట్టివేసే పద్ధతి మంచిదికాదు!.... అనుకున్నాడు!

ఇది రాజ్యాంగ సంక్షోభానికి సంబంధించిన విషయంగా పరిగణించ సాగాడాయన!

ఈ నాగరికతా పై భోగ సమర్పకుడిగా తన పెద్దరికాన్ని వినియోగించి, ఈ సమస్యలకు ఒక పరిష్కార సూత్రాన్ని అన్వేషించాలని దృఢంగా నిర్ణయించుకున్నాడు-.

అంతలోనే, సింధుమాత గుండెలు తల్లడిల్లేలా పెద్దకేక ఆయన కర్ణపుటాలను ఛేదించింది-

జరగకూడనిదేదో మరొకటి జరిగిపోయిందని భయంగా లేచి నిల్చున్నాడు మహర్షి.

కల్లోల పూరితమైన ఆ ధ్వని వచ్చిన దిక్కునే వేగంగా కదిలాడాయన.

సూటిగా యువరాజు మందిరం....

ఆ మందిరంపైపు చూసేనే ఆయన కాళ్ళు చేతులా వణికాయి...

అవును ... ఇక్కడినించే వచ్చింది ఆ ధ్వని....

యువరాజుకేమీ కాలేదుకదా....! అమంగళము అప్రతిహతమగు గాక....!

బరువెక్కిన హృదయంతో భారంగా నడిచాడాయన....

యువరాజ మందిరంలోకి ప్రవేశిస్తూనే కన్పించిన దృశ్యాన్ని చూసి, అవాక్కయి, శిలాప్రతిమలా నిల్చుండిపోయాడు.

అది నాగరకతా సరస్వతి గుండెలలో దిగిన పిడిబాకు....!

అది ఈ మహా సామ్రాజ్య నిర్మాత-సమ్రాట్ సగరుని వెన్నులో దిగిన శూలం!

అది ఈ ప్రజల పాలిట కన్నతల్లిలా, వరమిచ్చిన వేలుపులా పాలించిన మహామంత్రిని అసురసేని గర్భంలో దిగిన తీక్షణ శలాకం!

అది పరాజితుడు, పలాయనుడు, పిరికివాడూ అయిన ధూర్తుడు ఎవడో యువరాజు గుండెలలో పొడిచిన రాజద్రోహం....!

అయిపోయింది! అంతా అయిపోయింది. కాలిపోయి, కలలన్నీ బూడిదై రాలిపోయాయి.

పట్టు పాన్పుమీద రక్తపు మడుగులోపడి గిలాగిలా కొట్టుకొంటు న్నాడు యువరాజు ఉర్ముఖుడు. అతన్ని తన ఒడిలో పడుకో బెట్టుకొని రోదిస్తున్నాడు అసమంజసుడు. అంత బాధలోనూ, గొంతు పెగుల్చుకొని, మూలుగుతూ, ఉర్ముఖుడు అసమంజసుని గౌరవిస్తున్నాడు-

"అన్నయ్యా ఈ రాజ్యం నీదే- ఈ సింహాసనం నీదే-
నేనే దుర్మార్గుణ్ణి
నీకు దక్కవలసిన అధికారాన్ని దురాక్రమణ చేశాను-
భగవంతుడు నాకు తగినశిక్ష వేశాడు.

నన్ను క్షమించు !! అంటూ బాధతో మూల్గుతూ విలవిలలాడి పోతున్నాడు.

"తమ్ముడూ- ఇంత ఘోరం చేసిందెవరు?

ఇంత అక్రమానికి తలపడిందెవరు?

నీ గుండెల్లో.... కాదుకాదు.... ఈ మహా నాగరకత గుండెల్లో ఈ పిడిబాకును దించిందెవరు....?" అంటూ రోదించాడు అసమంజసుడు.

ఉర్ముఖుడు మాట్లాడలేని స్థితిలో రొప్పుతున్నాడు.

అతని ప్రాణాలు తుది శ్వాసను పిల్చుకొంటున్నాయి.

"తమ్ముడూ..... అమ్మయోజితని తీసుకొని మిశ్రదేశానికి వెళ్ళిపోవా లని నిశ్చయించుకొని ఈ సౌధం లోకి ప్రవేశించాను. నా మీద రాజ్య బహి ష్కారపు ఆంక్షలున్నాయని నాకు తెలుసు. కాని.... అమ్మను రక్షించుకోవ డానికి నాకు అంతకన్నా మార్గం కన్పించక ఇలా లోపలికి వచ్చాను. అయినా, రహస్యంగా పారిపోవడం ఇష్టం లేక, నిన్ను కలుసుకొని, మనసారా నిన్ను

గుండెలకు హత్తుకొని, ఇంకెప్పుడూ సింహాసనంపైపు కన్నెత్తి చూడ
నని చెప్పి వెళ్ళిపోవాలని నీ మందిరంలోకి వచ్చాను. వస్తూనే రక్తపు
మడుగులో పడివున్న నిన్ను చూడాల్సి వస్తుందని కలలోనైనా అనుకో
లేదు తమ్ముడూ.... ఈ అన్నయ్యను క్షమించు. నీ ప్రాణాలకు తన
ప్రాణాలు అడ్డు పెయ్యలేకపోతున్నాడీ అన్న... ఈ అశక్తతను మన్నించు
తమ్ముడూ...." అని వెక్కి వెక్కి ఏడ్చాడు అసమంజసుడు.

రక్తపు మడుగులో పడిఉన్న ఉద్ముఖుడు- అతని శరీరం పక్కన
అసమంజసుడు, అసమంజసుని చేతిలో రక్త సిక్తమైన పిడిబాకు!-

మందిరంలో ఈ భయానక దృశ్యాన్ని చూసి, స్తంభించి పోయిన
బుధ మహర్షికి నోట మాట రాలేదు! కర్తవ్య విమూఢతతో స్తబ్దుడై
ప్రమాన్పడి పోయాడు!

# 10

త్వష్ట యమ దంష్ట్రికలలో చిక్కిన యోజిత కెవ్వున అరిచే అవ
కాశమైనా లేక, మానప్రాణాలను రక్షించుకోవడానికి నిర్విరామంగా పెనుగు
లాడుతోంది.

యోజితను మోసుకుపోతున్న సంద్రం సోమపానమేచేసిందో, మార్ధ్వీ
కమే తాగిందో-వెర్రెత్తి పరిగెడుతోంది.

ఆమెను పెనవేసుకొని నోరు నొక్కి పెట్టి సంద్రాన్ని అదిలిస్తున్నాడు
త్వష్ట. కఠినమైన అతని పిడికిలి ఆమె కంఠాన్ని బిగుసుకుపోయి, ఆమె
అల్లల్లాడుతుంటే, వికటాట్టహాసంచేస్తూ నిర్జనారణ్యంలోకి మోసుకుపోతు
న్నాడు—

ఇరవై వర్షాల క్రితం ఏ అహంకారంతో ప్రజలమీద విజృంభించాడో, అదే భీకరస్వరంతో, అదే భీకర స్వరూపంతో ఈనాడు యోజిత పైన తన దౌష్ట్యాన్ని ప్రయోగిస్తున్నాడు.

కసి, పగ, ద్వేషం....అన్నీ అతని ఉగ్రనేత్రాలలో ప్రతి ఫలిస్తున్నాయి:—

తన తండ్రిని చంపి, తనను అవమానకరంగా వదిలేసి, తన శత్రువుతో చేతులు కలిపిన "యోజిత"ను దారుణంగా హింసించడమే అతని లక్ష్యం....!

"ఈ త్వష్టతోనే చెలగాటమాడాలనుకున్నావటే....చూడు నిన్నేం చేస్తానో...." అంటూ ఆమె వెన్నువూస విరిగేలా బలంగా మోదాడు—బలమైన ఆ ముష్టిఘాతానికి ఊపిరి ఆగినట్లయి పరిగెత్తే గుర్రంమీంచి క్రిందికి బోర్లాపడిపోయింది యోజిత! గుర్రం వెనకకాళ్ళు ఆమెనుబలంగా అదిమి గాలిలోకి లేచాయి-

ఆమె వెనకే త్వష్ట నేలదూకాడు. ఆమెమీదకు ఎగిరి, ఆమె శరీరాన్ని పూర్తిగా ఆక్రమించుకున్నాడు—

జరుగుతున్న ఈ అఘాయిత్యాన్ని చూడలేక ప్రకృతి పూర్తిగా కళ్ళు మూసుకొంది. నరసంచారంలేని ఆ అడవిలో ఎంతఅరిచినా ప్రయోజనం శూన్యమే! ఆమె అరుస్తున్నకొద్దీ అతను రెచ్చిపోతున్నాడు—

"మహానగరా! రక్షించు!" అంటూ ప్రాణభీతితో కేకలుపెడ్తోంది యోజిత! ఆ ఆపద సమయంలో భర్తనే తలచుకొంటుంది ఏ ఆడదయినా!

ఆమె ఆక్రందనలు వింటూ క్రూరంగానవ్వాడు త్వష్ట - ఆమెదుస్తులను వలిచి, ఆమె స్త్రీత్వాన్ని ప్రకృతికి ఆరవేశాడు.

శక్తినంతా ఏకాడదీసుకొని త్వష్టమీద కలియబడింది యోజిత-ఆమెచే ఓ పిడిబాకు అందితే ఆ మహిషాసురుడి గుండె లోతుల్లోకి గుచ్చి గిరగిరా తిప్పి నెత్తురు కళ్ళచూసేదే....!

కాని, ఆమె నిరాయుధ!

కామం, క్రోధం-ఒక్కసారి కమ్ముకొని ఆమెను పువ్వులా నలిపి తృప్తిగా నవ్వాడు త్వష్ట-

"నిన్ను చంపడంతోనే నావగిచల్లారదే....కుమార బ్రహ్మర్షి అనే వాణ్ణి తయారుచేసి, నీ అప్సరమీదకు వదలినవాణ్ణి నేనేనే....! ఆ పిచ్చిది కూడా ఈ అడవుల్లో ఎక్కడో తిరుగుతోంది! దానికి ఇదేగతి పట్టిస్తాను—

ఋష్యశృంగుణ్ణి చంపి, పాకచక్రంగా ఆ నేరాన్ని అసమంజసుడిమీద మోపింది నేనేనే....రేపు వాడికి మరణశిక్ష పడేది తథ్యం ...

ఏదోకరోజు ఆ సగరుడికీ ఇదేగతి పట్టిస్తాను-

కాని, అందాకా నిన్ను బ్రతకనిస్తాననుకున్నావా....?"అంటూ ఆమె రొమ్ములమీద కాలుపెట్టి బలంగా నొక్కెయ్యసాగాడు త్వష్ట.

ఆ బాధకు విలవిలలాడిపోయిందామె. వేదనో రోదనో తెలియని పెర్రికేకతో అడవి అడవంతా ప్రతిధ్వనించింది. .. "ఓ కరుణాసింధూ!మహా సగరా....రా....!"

ఇంతలో-

ఏనాడూ తను రుచిచూడనంత బలమైన పాదఘాతం త్వష్టని తాకింది.

ఆమె ప్రార్థనవిని మహాసగరుడే వచ్చాడా....లేక సాక్షాత్తూ ఆ ఇంద్రుడే నేలదిగాడా...??ఆకాలితన్నుకు కళ్ళు దిమ్మెక్కి నవరంధ్రాల్లోంచీ నెత్తురు కారినట్లయి ఎగిరి దూరంగాపడ్డాడు త్వష్టుడు—

బలవంతాన చూపుతెచ్చుకొని, కళ్ళువిప్పుకొని చూశాడు— ఎదురుగా అప్సర! ఈ మహాసామ్రాజ్యానికి కన్నతల్లి ....ఈ సంస్కృతీ వికాసాలను పెంచిపోషించిన దేవతామూర్తి ...

కాషాయాంబరధారి-సర్వసంగపరిత్యాగి—తాపసి అప్సర....భీకర నేత్ర ద్వయంతో మూర్తీభవించిన ఆదిశక్తిలా, చెలరేగిన అగ్నిలా కన్పించిం దతనికి....!

"సప్తసింధులోని ఆడదాని కాలిదెబ్బ ఎలావుంటుందో ఇంకోసారి రుచిచూడరా...." అని డొక్కల్లో చాచి తన్నింది మళ్ళీ! నేలమీద దొర్లు కుంటూపోయి, దూరంగావున్న చెట్టునితాకి ఆగిందతని శరీరం!

కొనఊపిరితో కొట్టుకుంటున్న యోజిత అప్సరనుచూసి ఓపిక కూడ గట్టుకుని చేతులెత్తి నమస్కరించి తలవాల్చేసింది....

ఆ స్థితిలో నిర్జీవంగా పడివున్న యోజితనుచూసి గుండె తరుక్కుపోయిందామెకు! నుదుట చుంబించి, తన శిరోవస్త్రాన్ని తీసి చలనరహితమైన ఆమె శరీరానికి కప్పింది.

రౌద్రంగా తలఎత్తి త్వష్టవైపు నడిచింది.

అది ఆమె పాదఘాతమో....లోహ గదాఘాతమో ..తెలుసుకునేలోగా మరోతన్ను తగిలి ఎగిరి దూరానపడ్డాడు త్వష్ట!

వనాలలోంచి-జనాలలోంచి—రాజధానీ నగరంలోంచి—రాజసౌధంలోకి అలాగే తన్నుకొంటూ వెళ్ళింది త్వష్టని అప్సర!

నిస్తేజుడై, నిర్వీర్యుడై నిర్బలుడై విరిగిపడిన మహావృక్షంలా కూలిపోయాడు త్వష్ట!

* * *

ఒక కొడుకును చంపిన నేరానికి ఇంకో కొడుకుకు మరణ దండన విధించాడు సగరచక్రవర్తి.

యువరాజు ఉల్ముఖుని భౌతికకాయానికి రాజలాంఛనాలతో అంత్యక్రియలు జరిపేందుకు అన్నీ సిద్ధంచేస్తున్నారు.

అసమంజసుడు మౌనంగా తలవంచుకుని నిల్చున్నాడు.

అందరూ తనను నేరస్థుడనీ, హంతకుడనీ, కర్కోటకుడనీ ఛీత్కరిస్తూ, అసహ్యిస్తూ, ద్వేషిస్తుంటే, కన్నీళ్ళను గొంతులో మింగుకున్నాడు కానీ, పెదవివిప్పి ఒక్కమాట మాట్లాడలేదు!

ఈ నేరం తానుచేయలేదని,సింహంలాగర్జించి మరీ చెప్పగల కంఠం తనకున్నప్పుడు ఎందుకు చెప్పడూ....? చెప్పలేదు అసమంజసుడు! అదొక నిరాసక్త, నిర్లిప్త, నిస్పృహాయస్థితి!

మహాసగరుడు తన కుమారునిపై నేరవిచారణలో ఏమాత్రం కల్పించుకోదలుచుకోలేదు-అలాంటి దుష్టసంతానాన్ని కన్ననేరం తనదే! అందుకు

అసమంజసుకు జీవితాంతం మళ్ళీకుళ్ళిపాపమని ఘోరమైన శిక్షే విధించాడు తనకు.

ప్రియాతి ప్రియమైన తన ఆత్మీయులందరూ వెళ్ళిపోయారు.ఎవ్వరూ లేని ఏకాకి అతను! ప్రకృతే అతనికి తోడు—ప్రజానురాగమే అతనికి రక్ష! మహర్షి వ్యవస్థే అతనికి సర్వస్వం!

ఇప్పుడింక ఆయనకు వారసులు లేరు—ఆయన తర్వాత ఈ రాజ్య పాలనా భారాన్ని వహించేవాడి విషయంలో బంధుప్రీతితో వ్యవహరించా డన్న అపకీర్తిలేదు. ఆయనకదే సంతోషం! చివరికి శేషం కీర్తిమాత్రమే కదా!

కాని, రమ్మంటే వస్తుందా కీర్తిశేషం....?

ఈ రాజ్యాన్ని మహర్షి సమితికి అప్పగించి, తాను నిష్క్రమించా లని నిర్ణయించుకున్నాడు సగరుడు- తానుకూడా వానప్రస్థానికి చేరుకునేం దుకే తీర్మానించుకొన్నాడు—

సరిగ్గా ఇదే సమయంలో-

త్వష్టని తన్నుకొంటూ అప్సర రాజప్రసాదంలోకి ప్రవేశించింది.

ఆమెనుచూడగానే మహాసగరుడికళ్ళలో ఆశాన్వీపాలు జ్వలించాయి! వెళ్ళిపోయిన వసంతం మళ్ళీ వచ్చినట్లనిపించింది. చెట్లు తిరిగి చిగురించి నట్లయ్యాయి. తలలువంచుకున్న పూలమొగ్గలు తిరిగి వికసించి పరిమళించ సాగాయి!

మూర్ఛావస్థలో నేలమీద పడివున్న త్వష్టని జుత్తుపుచ్చుకొని ఈడ్చు కొంటూ జనంముందుకు లాక్కొచ్చింది అప్సర.

అప్సరను చూడగానే, గుండెలో దాచుకున్న అశ్రుభాండం పగిలి నట్లయి, పరిగెత్తుకునివెళ్ళి ఆమెను అక్కున చేర్చుకున్నాడు సగరుడు. కన్నీటివాగులు కట్టలుతెంచుకుని ప్రవహించాయి!

"ప్రభూ! అంతా విన్నాను ...అన్ని అనర్థాలకూ మూలం ఇదుగో వీడే....ఉర్ముఖుని, యోజితనూకూడా వీడే పొట్టనపెట్టుకున్నాడు ప్రభూ...."

అని అరిచి, ఇంక దుఃఖాన్ని ఆపుకోలేక, ఆవేదనని తట్టుకోలేక సగరుని కాళ్ళను చుట్టుకుని కుప్పకూలిపోయింది అప్సర!

"వీడు త్వష్ట కదూ...." ఆశ్చర్యంగా అడిగాడు బుధమహర్షి వాడి ముఖాన్ని పైకిలేపనెత్తి చూస్తూ!

త్వష్ట పేరు వినగానే ఉలిక్కిపడ్డాడు అసమంజసుడు.

"దుర్మార్గుడా! నువ్వేనా త్వష్టవంటే.... ఎంత వంచించావురా...." అంటూ తనచుట్టూ రక్షణవలయంగా నిల్చున్న సాయుధులైన సైనికులలో ఒకడి నొడ్లోంచి చురకత్తిని లాగి, రివ్వున త్వష్టమీదకు విసిరాడు-

అసమంజసుని గొంతు వినంగానే, లేచినిల్చుంది అప్సర. అత నిలాంటి అఘాయిత్యాన్ని చేస్తాడని ముందే ఊహించి, గాలిలో దూసుకు వస్తున్న ఆ పిడిబాకును గాలిలోనే అందుకుందామె!

"అసమంజసా! త్వష్టని చంపే అధికారం నీకులేదు. తెలిసి చేసినా, తెలియకచేసినా ఈ దుష్టుడితో చేతులు కలిపి యోధిత మరణానికి కారకుడి వైనావు. హంతకుడా!" అని శపిస్తున్నట్లు అతనివంక రౌద్రంగా చూసి, గిర్రున సగరుని వైపు తిరిగి- "హైహయ మేధం చేసినవాడు సగరచక్రవర్తి! ఈ శత్రుశేషాన్ని వధించవలసింది కూడా ఆయనే! ఆయన అధికారాన్ని మరొకరు చెలాయించడాన్ని నేను అనుమతించను...." అంటూ చురకత్తిని అక్కడే వదిలి సగరుని సమీపించి రోదించింది అప్సర.

నెమ్మదిగా కళ్ళు తెరిచిచూశాడు త్వష్ట. ఎదురుగా అప్సర జారవిడిచిన పిడిబాకు కన్పించింది. వెంటనే దాన్ని అందుకున్నాడు. ఒక్క క్షణం ఆలోచించాడు— వెర్రిగా అరిచి తన గుండెలోతుల్లోకి దిగేలా దాన్ని బలంగా పొడుచుకున్నాడు.

భయంకరంగా అతను మూల్గుతుంటే భూమి కంపించినట్లే వుంది. ఒక దుర్మార్గుడు అంతరించేటప్పుడు ప్రకృతి ప్రకటించే పులకరింత అది!

సగరుడు అపార కారుణ్యంతో అతన్ని సమీపించాడు.

"మహా సగరా...." అంటూ బాధగా మూల్గుతూనే అతనికి చేతులెత్తి నమస్కరించాడు త్వష్ట.

"ఈ పాపులకూ, యీ కల్లోలాలకూ కారకుణ్ణి నేనే.... నేను పావాలి.... నాకు నిష్కృతిలేదు. నీ చేతులలోనే నేను చావాలి— మహా నగరా! నన్ను కరుణించవద్దు.... నన్ను చంపెయ్—" అన్నాడు త్వష్ట.

నిర్మాణాన్ని, విచ్ఛిన్నాన్నీ సమభావంతోపాలించే ఆ మహనీయుడు తన కరుణా కటాక్ష వీక్షణాలతో త్వష్టడి తలనిమిరాడు.

"త్వష్టా! మానవజాతి మహోదయాన్ని అరచేతులు అడ్డుపెట్టి ఆప గలమనుకోవడం భ్రమ! ప్రజాపీడకులయిన నియంతలు తామే సర్వస్వం అనుకొనీ— తామే సర్వవ్యాపకులం అనీ, భ్రమపడి- చివరకు నీలా భంగ పడతారు!

ప్రభువుల అధికార శక్తికన్నా ప్రజల సంఘటిత శక్తి గొప్పది.

పాలించే అవకాశం కోటికి ఏ ఒక్కరికో దక్కుతుంది. ఆ ఒక్కడూ ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని యీ విశ్వసృష్టికి తన అశ్రుబిందువులను జోడించ గలిగిననాడు మానవాళి మనుగడ నాగరక మౌతుంది-

"త్వష్టా! నీ చరిత్ర స్వార్థపరులయిన కర్కోటక నియంతలందరికి గుణపాఠం అవుతుంది—" అని, తన అమృతహస్తంతో అతని గుండెలలో దిగబడిన కత్తిని పెలికిలాగాడు. త్వష్ట నిర్జీవుడై మిగిలిపోయాడు.

# 11

ఇంద్రసోముల్ని కీర్తించే ఋక్కులా కాలం గలగలా ప్రవ హిస్తోంది!

సప్తసింధులో ఆనంద నందన వనాలు చిగురించసాగాయి.

రంగవల్లులతో తీర్చిదిద్దిన వాకిళ్లూ... ఆకుపచ్చని తోరణాలు కట్టిన ముంగిళ్ళూ... శోభస్కరంగా అలంకరించుకొంటోంది లోకం.

త్వష్ట నిర్మూలన తర్వాత, అసమంజసుడు తన సింహాసనాన్ని తిరస్కరించి, ప్రజలెన్నుకున్న పాలకుడిగా మిశ్రదేశంలో స్వతంత్ర నాగరకతని వ్యవస్థాపిస్తానని వెళ్ళిపోయాడు.

తన తల్లి అప్సర ఒకనాడు చేసిన ప్రతిజ్ఞవంటిదే, నేడు అసమంజుడు చేపట్టిన దీక్ష!

అనాగరకమయిన ఒక జాతిని సంస్కరించి, తనదైన రీతిలో స్వతంత్ర నాగరకతను సాధించడమే అతని ప్రతిజ్ఞ!

"ఇంకెప్పుడూ సప్తసింధువేపు కన్నెత్తి చూడను—" అని వెళ్ళిపోయాడు. ఇన్నాళ్ళయినా, మళ్ళీ ఎప్పుడూ ఇటు రాలేదతను.

నీలానదీ తీరాన చిన్నచిన్న జాతులుగా విడివడివున్న అనేక దేశాలను సమ్మిళిత పరిచి, సంయుక్త మిశ్రదేశాన్ని వ్యవస్థాపించి "మనస్యు"గా అక్కడ పేరొందాడని విని మహాసగరుడు ఎంతో సంతోషించాడు.

అప్సర కూడా తన సంతోషాన్ని ప్రకటించింది. "ఏది సమంజసమో- ఏది అసమంజసమో తెలియని చిత్రమయిన పరిస్థితులలో, మన అసమంజు స్వతంత్ర నాగరకతా నిర్మాణం చేసుకోవాలని సరియైన సమయంలో సరియైన నిర్ణయమే చేశాడు—" అన్నదామె నవ్వుతూ!

"కానీ, అప్సరా!" అంటూ ఏదో చెప్పబోయి ఆగి, మళ్ళీ అన్నాడు— "విదేశంలో మన పుత్రుడు సాధించిన ఘనత వార్తాహరుల ద్వారా మనకు మాత్రమే తెలుస్తోంది- కాని సప్తసింధులో మనవాడికి ఎటువంటి గౌరవ స్థానమూ లేదు. నాగరకతా వ్యాపకుడిగా మనవాళ్ళు వాణ్ణి ఏనాటికైనా గుర్తిస్తారంటావా...?" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

అప్సర నయనాలూ అశ్రుపూరితాలైనాయి!

"ఆరోజు- అసమంజసుని ఎలాగయినా రాజ్యసభకు రప్పించి- మహర్షి సమితిచేత క్షమింపచేసి, యీ భూమండలానికంతటికీ సార్వభౌముని చేయాలని ఎంతో తపించాను. కాని, నన్ను యోజిత అర్థంచేసు

కోలేను. ఆఖరికి బుధమహర్షి హాహా!" అని దీర్ఘ నిట్టూర్పు విడిచాడు సగరుడు.

అప్సర ఆయుస్సు వారించింది. ఎక్కువగా ఆవేశానికి లోనుకావడం ఆయన ఆరోగ్య పరిస్థితిరీత్యా అంతమంచిదికాదని శాంతింపజేసింది!

"విచారించకండి ప్రభూ! మనచరిత్ర ఆచంద్రతారార్కం యీసప్త సింధు భూమిపైన ప్రకాశిస్తుంది. అందుకు సందేహంలేదు. నీటిపారుదల సౌకర్యాలు కల్పించి, మనుషులు నాగళ్ళుపట్టి వ్యవసాయం చేసేలాప్రోత్స హించి, నాగరకతా వికాసానికి మీరు అందించిన అమృతహస్తం భవిష్య తరాలకు వెలుగుబాటనిస్తుంది!

ప్రసిద్ధ నావికుడిగా, ప్రపంచదేశాలను జయించి వివిధ దేశాలలో ఆర్షసంస్కృతిని వ్యాపింపచేసిన మీ ఘనత యీ భూమండలాన మహా సాగరాలు నిలిచి ఉన్నంతకాలం ప్రకాశిస్తూనే వుంటుంది.

ఇంక మన పుత్రుడి చరిత్ర అంటారా...?

భవిష్యత్తులో పరిపూర్ణ హృదయంతో ఏ పూర్ణచంద్రుడో అసమం జసుడి జీవితాన్ని యీ సింధువులకు అందించకపోడు-

ఆనాడు భారతీయులయిన ప్రజలు ఒక్కక్షణం అసమంజసుని స్మరించుకోకపోరు-మీరునిశ్చింతగా వుండండి—" అని ఓదార్చింది అప్సర.

అంతలో—

మిశ్రదేశంనించి వార్తాహరుడు అత్యంత ఆనందదాయకమైన సమాచారం తీసుకొచ్చాడు.

అసమంజసుడికి అంశుమంతుడనే కొడుకు కలిగాడన్నదే ఆ వార్త.

గలగలఐ సరస్వతీ నదిలా పరవశించారా వార్త వినగానే అప్సరా సగరులు.

ఆ ఇద్దరు వృద్ధమూర్తులు ప్రేమైక జీవనంలో వేయివసంతాలు ఒక్కసాగి వికసించాయి.

మహాసగరుని విశాలహృదయం మీద తన తలను వాల్చి ప్రేమగా ఆయన గుండెలు నిమురుతూ అన్నది అప్సర-

"ప్రభూ! మన పిల్లల బాల్యాన్ని పర్యవేక్షించే తీరిక లేకపోయింది మనకి- ఎందుకంటే, వాళ్ల యౌవనవంతులయ్యేవరకూ యుద్ధాలతోనూ, రాజ్యసమస్యలతోనూ కాలం సరిపోయింది కొబట్టి...

ఆ పిల్లవాణ్ని మనదగ్గరకు తెచ్చుకుందాం! సుస్థిరమైన భారతీయ రీతులలో దయాదాక్షిణ్యమూర్తిగా తీర్చిదిద్దుకుందాం- అంటోంది అప్సర-

అలాగేనంటూ తల పంకిస్తూనే, సగరుడు శూన్యంలోకి చూస్తూ అన్నాడు- "త్వష్ట నిర్మూలనతో శత్రు నిర్మూలన పూర్తిఅయినట్లు తోచడం లేదు- మరొక్క తడవ "హయమేధం" చేయాలని కూడా అనుకొంటున్నాను—" అని.

యుద్ధాలు మానాలని కోరకున్న అప్సర మహాసగరునివంకచూస్తూ వుండిపోయింది.

ఆమె చూపుల్లో అసమంజసుని పుత్రుడు అంశుమంతుని గలగలలే కన్పిస్తున్నాయి.

—: సమాప్తం :—

"ఈ తరానికి ప్రపంచ విజేత మీరే... ! ఈ ప్రపంచం అంతా మీ ఆదీనం లోకి వచ్చేవరకూ విశ్రమించను—" అని ప్రతిజ్ఞ చేసింది అప్సర.

"మహా సగరా! ఈ ప్రజలకు నీటిపారుదల సౌకర్యాలు కల్పించి, పాడి పంటలు వర్ధిల్లచేసిన నీ కృషికి గుర్తింపుగా జలనిధి అయిన సముద్రానికి 'సాగరం' అని నామకరణం చేస్తున్నాను—" అంటూ ఆశీర్వదించాడు వశిష్ఠుడు.

"శౌలాలు దున్నుతూ పౌరుషహీనులై బ్రతుకుతున్నారు కాబట్టే నాగరకుల్ని అనాగరకులు ఆట పట్టిస్తున్నారు. కత్తిపట్టి కదనరంగాన నిల్చుని తలలు తెగనరికే శౌర్యంగల జాతివంక కన్నెత్తి చూడగలరా ఎవరైనా?...." హుంకరించాడు అసమంజసుడు.

"అసమంజసుడివంటి అసహనపరుడికీ, కర్కోటకుడికీ ఈ సింహాసనాన్ని అధిష్టించే యోగ్యతలేదు. వాడి వారసత్వాన్ని బహిష్కరిస్తున్నాను—" ఆవేశంగా అన్నాడు మహాసగరుడు.

"అసమంజసుని నా వెంట మిశ్రదేశానికి (ఈజిప్ట్) తీసుకువెళ్ళడమే ఈ సమస్యకు పరిష్కారం—" అన్నది రోదిస్తూ యోజిత.

* * *

**ఈజిప్ట్ మహానాగరకతను సుస్థాపించిన "మెనిస్" మన రామాయణ, భారతాలలో కన్పించే అసమంజసుడే ... అనే చారిత్రక పరిశోధన చుట్టూ అల్లిన నవలా మాలిక...**

**"సప్తసింధు"**

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ